# ఆంధ్రగ్రంథమాల పుస్తకముల పట్టిక

| | | |
|---|---|---|
| ఆంధ్రవిజ్ఞానసర్వస్వము (2 సంపుటములు) సంపు. 1 కి | | రు. 10-0-0 |
| శ్రీ మహాఋషి నిఘంటిత యోగశాస్త్రము—కా. సూర్య నారాయణయోగిని | ... | 5-0-0 |
| భగవద్గీత (సంస్కృ.)—బె. రామారావుగారి వ్యాఖ్యానముతో 1, 2, 3 సంపుట్లు మాత్రమే ఉన్నవి. సంపు. 1 కి | ... | 1-8-0 |
| శతకకవులచరిత్ర—వం. సుబ్బారావుగారు | ... | 1-8-0 |
| పారిభాషికపదకోశము (ఇంగ్లీషులోని శాస్త్రీయపదముల తెలుగుపదముల నిఘంటువు) | ... | 1-4-0 |
| ఆంధ్రవాఙ్మయసూచిక (ముద్రితాముద్రితగ్రంథములపట్టిక) | | 1-0-0 |
| శ్యామాసుందరము—ఒం. సత్యనాథముగారు | ... | 1-0-0 |
| జీవనప్రభాతము (న.)—కె. యస్. వెంకటరమణిగారు | ... | 1-0-0 |
| భీష్ముడు (నాటకము)—పా. పిచ్చిరెడ్డిగారు | ... | 1-0-0 |
| అవిమారకము (నాటకము)—మానవల్లి రామకృష్ణకవిగారు | | 0-10-0 |
| కృషీవలవిజయము | ... | 0-8-0 |
| వివాహతత్వము—బం. మల్లయ్యశాస్త్రిగారు | ... | 0-8-0 |
| నిరుద్ధభారతము—మం. వెంకటశర్మగారు | ... | 0-8-0 |
| శ్రీ రామవిజయము (నాటకము) | ... | 0-8-0 |
| ఆరోగ్యసాధనము— గాంధీమహాత్ముడు | ... | 0-8-0 |
| గీతాబోధ— | ... | 0-4-0 |
| ప్రార్థనగీతావళి | ... | 0-4-0 |
| హాలికోద్ధారము—ప్ర. శేషాద్రిశర్మగారు | ... | రు. 0-4-0 |
| మానవస్వత్వములు—థామస్ పెయిన్ | ... | 0-4-0 |
| హిందీతెలుగు బాలశిక్ష—పం. ఆ. శాస్త్రిగారు | ... | 0-6-0 |
| ,, మొదటివాచకం | ... | 0-6-0 |

# "ఎలక్షన్లు"

వస్తున్నాయి!  వస్తున్నాయి!!

## ఎన్నికలంటే ఏమిటి?

## 1935 సం॥ ఇండియా ఆక్టు ప్రకారం

## ఎన్నికలు ఎట్లా జరగాలి?

ఢిల్లీ శాసనసభల ఎన్నికలు - రాష్ట్ర శాసనసభల ఎన్నికలు
లోకలుబోర్డుల ఎన్నికలు - మ్యునిసిపలు ఎన్నికలు ఎలెక్షను
తగాదాలు-విశ్వాసరాహిత్యతీర్మానాలు అన్నింటినీగూర్చిన
రూల్సు సవిస్తరంగా "ఎలక్షన్లు"అనే గ్రంథంలో ఉన్నాయి

## వేయేల? ఇది

# ఎన్నికల విజ్ఞాన సర్వస్వం

గ్రంథకర్త: అవసరాల వెంకటనర్సుగారు, బి.యే., బి.యల్.

వెల:— రూ. 2-8-0 పోస్టేజి ప్రత్యేకం.

**ఆంధ్ర గ్రంథమాల, 7, తంబుశెట్టివీధి, మద్రాస్.**



# విషయానుక్రమ

## డిసెంబరు, 1945



## చిత్రములు

# భారతి ఇరువదిరెండవ సంపుటము, భా-౨

## వ్యాసములు అకారాది సూచి

# ఈవిధముగా వుతికిన యెడల బాదటంవల్లకలిగే నష్టము వుండదు





రంధ్రములు పడుట, చిరుగుట, బ్రద్దలయిపోవుట సంభవించును. ..బట్టలను శుభ్రపరచుటకు వురాతనపు మోటు పద్ధతిగా బాదుట వలన ఈ విధమైనటువంటి అనవసరమైన నష్టమునకు డబ్బు ఖర్చునకు పాల్పడుట తటస్థించును.

ఈ నెబంరు వేయబడిన చిత్రములను చూడండి. బట్టలనుపాడుచేయకుండా వుతుకుట ఎట్లాగో ఇవి చూపగలవు.

(1) పంపు క్రిందగాని, తొట్టిలోగాని, చెరువులోగాని, కాల్వలోగాని వుతకవలసిన బట్టను బాగా తడపవలెను. (2) బట్ట బాగా తడిసిన తర్వాత సన్‌లైటుతోబాగారుద్దండి. (బాగా మురికిగావున్నచోట్ల సన్‌లైటు ఎక్కువగాపట్టించవలెను). (3) సబ్బుతోనిండిన బట్టను బాగా పుసమండి. బండకేసిబాదవద్దు (మామూలుగా చపాతీలు చేసేటప్పుడుపిండి కలిపేవిధంగా నన్నమాట). సబ్బుయొక్క నురుగునుబటంతటికి బాగా అంటేవిధంగా చూడండి. గట్టిగా రుద్దటంగాని మరి ఇతర విధంగా బాదటంగాని అనవసరము. సన్‌లైటుయొక్క "స్వయముగా శుభ్రపరచు నురుగు" మురికినంతటిని తీసివేయును. (4) తరువాత మురికితో కూడుకొనిన నురుగంతయు పోయేటట్టు బట్టను నీటిలో ముంచిపిడవడి.

ఈ సన్‌లైటు పద్ధతిగావుతికినయెడలబట్టలు చాలకాల మన్నుతవి.

2



3



4



## సన్‌లైటు సబ్బు బట్టలను కాపాడును






LEVER BROTHERS (INDIA) LIMITED



చంద్రకళారాగిణి

చిత్రకారుడు : శ్రీ జి. కోటేశ్వరరావు

సంపుటము 22 | డిసెంబరు, 1945 | పార్థివ మార్గశీర్షము | ంచిక 12

# మే లు కొ లు పు

= శ్రీ హ ను మ చ్ఛా స్త్రి =

౧

కలమా! తెప్పిక నిద్రజిమ్ముకొని వీకన్ లోకకల్యాణపు
స్ఖలమాంద్యమ్ములు నిండిపోయినవి; రక్షణీకృత్య పాండిత్యముల్
కలమా నాగరికప్రభావములు సంఘం జేలెడిన్ దీయగా
కలమాన్నంబులు విత్తనాథులకు జిక్కన్ బక్క యల్లాడెడున్.

చాళుక్య సర్వరాజ్యంబు గెల్చిన ద్రిప్పు నన్నయమహాని గంటమ్ముచుఱుకు
మన్మసిద్ధిక్షమామండల భాగ్యమ్ము నడపు తిక్కన్న గంటమ్ముచేవ
గర్విసర్వజ్ఞ సింగమరాజు గుండెలో నాటు పోతన్న గంటమ్ము పోటు
త్రోవతప్పిన కృష్ణదేవరాయలవారి కనువిప్పు తిమ్మన్న కలముచలువ
తరతరమ్ముల వారసత్వముగ వచ్చి-తెనుగుకవుల పటిష్ఠ లేఖినుల నిలచి
నేటికే కాదు మఱియు నేనాటికైన-ఎల్ల జాతిని పునరుద్ధరించుగాక.

పక్షీణరాజు ముత్యాలశాలల పైడి జలకమ్ములాడు నుత్సవదినమ్ము
మదకరీంద్రము డిగ్గి యెదురేగు నృపమౌళికర మందుకొనునాటి గర్వరేఖ
ఘటికాశతగ్రంధకరణపాండితి దండచఱచి నిల్చిననాటి చతురగాథ
తాంబూల జాంబూన దాంబరమ్ములు పెట్టి కృతివేడు నృపతి మన్నించు కవి
కలమ! కాంతువా? రంగుబంగారుకలల- నేటికిని భావహర్మ్యాల నిదురలోన
పగిలిపోయిన యాస్వర్ణయుగము మఱచి- కనుదెఱచి నగ్నసత్యలోకమ్ము జూడు!

౪

మా పూర్వకవుల నిర్మల మానసములలో వేంచేయు ముసలిరాయంచలార!
'మీరు మీప్రేమ బంగారమ్ముగాను' నాకంటికి రాని చక్రమ్ములార!
పూర్వకావ్యమ్ములో మొగ్గవిచ్చినయంత ఘుమ్మని రేగు భృంగమ్ములార!
వెనుకటి మా రాజ-శృంగారమ్ము పండించి పూలమ్ము పడుచులార!
తడవులంబట్టి మా ప్రబంధముల నిలచి- యేలితిరి; మేముకూడ నూరేగనాము;
నేడు తత్కల్పనాయవనికలు చెదరె- క్రొత్తకల మిది- -ఇక మీర లొత్తిగిలుడు.

# కవిరాజశిఖామణి కల్పనావైచిత్రి

## = శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి =

కావ్య జగత్తున కాధారభూతులైన యుత్తమ కవుల రచనాకౌశలమును బరికించినంతనే సహృదయుల హృదయములం దెబ్బురపాటుతోపాటు ఆనందాతిరేకమును గలుగుచుండును. ఉత్తమ కావ్యనిర్మాతలగు కవులకు ఇతివృత్తప్రదర్శనమునకంటె హృద్యభావనిబంధనమునం దవధాన మెక్కుడావశ్యకమైయుండును. అట్టి భావముల నేర్చికూర్చుటలోఁ గవికి ప్రతిభావిశేష మపేక్షితము. ఆ ప్రతిభ జన్మాంతరీయ సంస్కారాతిశయమువలనఁ గొందఱకు సహజముగ జనించిన ట్లగపడును. దాన నాతఁడు రసోత్తరకావ్యనిర్మాత కాఁగలఁడు. మఱికొందరు బహుగ్రంథ పర్యాలోకనముచే నేర్పడిన ధీసమున్మేషమునఁ గావ్యస్రష్టలు కాఁగలరు. వార లమర్చిన వినూత్న భావములును హృదయాకర్షకములై యొప్పారఁగలవు. కాని యట్టివాని నవగతము చేసికొనుటలోఁ బాఠకుల కవధానాతిరేక మావశ్యకము.

తపోవిశేషముచే వాణీప్రసాదమును జూఱఁగొని రసవద్భావభరితవాఙ్మయరాసులను జగమెల్లెడ వెదఁజల్లిన వాల్మీకివ్యాసులు చవిచూచి విడువని వినూత్నభావమునునది వేఱొక్కఁ డుండఁబోదని తద్వాఙ్మయమును దలస్పర్శిగఁ జదువువారు ధైర్యముతోఁ బల్కుటకు వెనుదీయరు. కావుననే కవివతంసుఁడగు కాళిదాసు తన కవితలోఁ గ్రొత్తభావములు లేవని ఈ క్రిందిరీతిని జాటియున్నాఁడు:

" అథవా కృతవాగ్ద్వారే
వంశేఽస్మిన్ పూర్వసూరిభిః
మణౌ వజ్రసముత్కీర్ణే
సూత్రస్యేవాస్తి మే

(రఘువంశము, ౧-౪.)

సంస్కృతవాఙ్మయమున సర్వోత్తమ కవులని యెన్నఁబడు భవభూతి బాణభట్ట భారవ్యాదుల కావ్యములలోఁ గానవచ్చెడి మృదుమధుర భావసామగ్రి ఆ వాల్మీకివ్యాసుల రచనలలో నితివృత్తముతో పాటు మిళితమైయున్నదియే. అట నిటునటు చెదరి యున్నవాని నొకచోఁ గూర్చి విలక్షణరూపము నాపాదించుటయందే వీరి భావనావైశద్యము గానవచ్చెడిని.

"భిన్నరుచిర్హి లోకః" అను సూక్తిచొప్పునఁ గవులకును వేర్వేఱగు నభిరుచులు గన్పట్టుచుండును. మృదుమధురములగు భావములను లలితపదసన్నివేశమున గంభీరముగాఁ జిత్రించుటపైనఁ బేర్కొనిన కవులందఱకు నభిమతము. వీరల కవితలలో నుపమాసామగ్రికిఁ బ్రాధాన్య మధికము. మఱి కొందఱు ప్రౌఢములగు భావములను గఠినమగు శైలిలో విలక్షణముగఁ జిత్రించి పాఠకలోకమునకుఁ బ్రత్యక్షము సేయుదురు. ఈవర్గమునకుఁ జేరిన సంస్కృత కవులలో నగ్రగణ్యుఁడు కవిరాజరాజగు శ్రీహర్షుఁడు. తెల్గుకవులలో నద్వితీయుఁడు, కవిరాజశిఖామణియు నగు నన్నెచోడుఁడు రెండవవాఁడు. వీరి కవితలో నుత్ప్రేక్ష కగ్రస్థానము. ఉత్ప్రేక్షకు భావనాధిక్య మపేక్షితము. అందును దృశ్యము కన్నులకుఁ గట్టునట్లుత్ప్రేక్షింపవలయునన్న నది కవితలో సిద్ధహస్తునకే సాధ్యమగును. అందె వేసినచేయి శ్రీహర్షునిది. మచ్చున కొక్క శ్లోకము నుదాహరించెదను.

"శ్రవణపూరతమాలదళాంకురం
  శశికురఙ్గముఖే సఖి నిక్షిప
కిమపి తున్దిలిత స్థగయ త్వముం
  సపది తేన తదుచ్ఛ్వసిమి క్షణం."
(నైష. ౪-౫౬)

దమయంతీవిరహవర్ణనప్రకరణమునందలి దీశ్లోకము. "ఓచెలీ, కర్ణాలంకారమైన లేఁతదిరిసెనరేకును చంద్రునిలో నుండు లేడినోటి కందిమ్ము. దానిని దిని నంతనే యాలేడి బలిసి చంద్రుని గప్పివైచును. ఆక్షణమున నే నించుక నేదదేఱుదును."అని పై శ్లోకమునకు భావము. దీని నాంధ్రమున శ్రీనాథుఁ డిట్లను వదించినాఁడు

"శ్రవణపూరతమాలపల్లవచయంబు
మేపుదము వీనిలో నున్న మృగశిశువున;
కది ప్రవర్ధనమందెనే ముదితలార!
మండలం బెల్లఁ దానయై యుండుఁగాని."
(నైష. ౨-౧౨౬)

ఇది కవితామార్గమునఁ గవులందఱచే క్షుణ్ణమైన చంద్రోపాలంభనమునకు సంబంధించిన వర్ణనయే. అయినను సహృదయుల హృదయమున కీకల్పన యబ్బురపాటు గల్గింపకమానదు.

తెలుఁగుకవులలో నుత్ప్రేక్షను మిక్కిలి తీవిగ సాఁగించినవారిలో నన్నెచోడుఁ డగ్రస్థానము నలంకరించు ననవచ్చును. ఆంధ్రావని వెలసి, రాజులై కవిరాజులైనవారందఱిలో నిట్టి యుత్ప్రేక్షాసామగ్రి బహుళముగఁ గానవచ్చును. బహుపండితకవులఁ బోషించుచు వారివలన వివిధకవితావిశిష్టతల నెఱిఁగి, సారవత్తరకావ్యనిర్మితికిఁ గడఁగువారగుటచే వీరి కృతు లితరకవికృతులకంటె విలక్షణముగఁ గన్పట్టుచుండును. కావుననే శ్రీకృష్ణదేవరాయల యాముక్తమాల్యదయు, రఘునాథరాయల వాల్మీకిచరిత్రమును ఆంధ్రభాష కలంకారములై వెలయుచున్నవి. ఈ రాజకవుల కృతులు భగవద్భక్తిని బ్రదర్శించుట కుపక్రమింపఁబడి విలక్షణభావ ప్రదర్శనమునకుఁ దీఁగసాఁగించినవి.

మఱియొక మాట. వాల్మీకివ్యాసాది మహర్షుల కవితలు దక్కఁ దరువాతికవుల రచన లన్నిటియందుఁ గవిహృదయమే ప్రత్యక్షముగఁ గన్పట్టుచుండును. ఆయాకవులకుఁ గల యభిరుచులన్నియుఁ గావ్యదర్పణమునఁ బ్రతిబింబించును. వారికిఁ బరిచితములైన సన్నివేశము లాకవితలలోఁ దొలఁకాడకమానవు. అందును బ్రభువుల రచనలలో నవి పరిస్ఫుటముగ స్ఫురించుచుండును. వారాత్మతృప్తికై రచనల సాఁగించువారుగావున వారి కవితావాహిని నిర్నిరోధముగ జాలువాఱును. ఇతరకవులకన్నను నిరోధ మత్యధికము. ప్రభువును మెప్పింపఁదలఁచినచో నాతని యభిరుచి ననుసరింపవలయును. పండితుల నానందింపఁజేయఁ దలం పున్నచోఁ బాండిత్యప్రకర్షముఁ జూపవలయును. జనసామాన్యము మెప్పు వడయవలయు నన్న సరళమార్గముఁ బట్టవలయును. ఆత్మతృప్తికే యైనచో భక్తిభారభుగ్నము గావలయును. ప్రాభవముతోఁ గూడి కవితాభిరుచి గల్గిన కవిరాజశిఖామణి కిట్టి నిరోధము లేమొ యనుదలనూపవు. కావుననే నన్నెచోడుని కుమారసంభవము వివిధ కవితాసామగ్రీ సముల్లసితమై వెలసినది. కాని పాకము మాత్రము నారికేళమైనది. అందులకుఁ గారణము కవి కల్పించి ప్రదర్శించిన భావనాతిశయము, తత్ప్రదర్శనమున కాతఁ డంగీకరించిన విలక్షణమార్గమును. కనుకనే పద్యములన్నియు నించుమించుగ భావవివరణము నపేక్షించుచునే యున్నవి.

నన్నెచోడుఁడు తననాఁటికిఁ బ్రసిద్ధికెక్కిన యాలంకారిక నిబంధనల ననుసరించియే కుమారసంభవకృతినిర్మితికిఁ గడంగెను. కానఁ గావ్యమున నష్టాదశవర్ణనలు ప్రతిజ్ఞానుసారముగఁ గూర్చియున్నాఁడు. అందలి పురవర్ణన మొకపట్టున హృద్యభావవిలసితమై నామానసమున • కాశ్చర్యాదరములఁ గల్గించినది. తొలుత నాపట్టునఁ గొన్ని విషయముల నామోపిక కొలఁది పాఠకుల కెఱిఁగించెదను.

శంకరుఁడు పార్వతిని బెండ్లియాడఁదలఁచి హిమవంతుననుమతిఁ బడయుటకు సప్తర్షుల నంపించి

గౌరి నోషధిప్రస్థపురమునకుఁ బంపెను. ఆ యోషధిప్రస్థమును కాళిదాసు తన కుమారసంభవమున ప్రస్తావవశమున వర్ణించెను. అట నాతఁ డేవిషయముల స్పృశించెనో వాని నటుంచి, నన్నెచోడుఁడు ప్రత్యేకముగ నలుబదిపద్యముల నాపట్టణము చిత్రించినాఁడు. ఉపక్రమోపసంహారములయందు "ప్రస్తుతంబగు నోషధీప్రస్థపురము" అను గీతపాదమును మకుటమువోలెఁ గూర్చినాఁడు.

వరిపొలములఁ గాఁపుండెడి కాఁపుటిల్లాండ్రు మధురమగు కంఠధ్వనులతో వెడవెడ తొక్కుపలుకులతో నలసటగొనక చిలుకలఁ బోఁద్రోలుటకై రొద సేయుచుండ, చిలుక లాపలుకులను, వారు తమ్ము దగ్గరకు రమ్మని పిలుచుటగాఁ దలఁచి, వాని నింకను వినవలెనను కుతూహలముతోఁ జేలను వదలక యచటనే మందలుగట్టియుండునఁట. ఇటఁ గవిపదబంధ మీ రీతి నున్నది:

"నలిఁ గమలాననల్ మృదుని
నాదముల న్వెడదొక్కుపల్కులన్
సొలవక చిల్కల న్వెడలఁ
జోపు నెలుంగులు, తమ్ము డాయరాఁ
బిలుచుటగాఁగ, నాచిలుక
పిండనిశంబును జేలలోన మం
దలు గొని పాయకుండు; మదిఁ
దద్వచనశ్రవణాభిలాషమై."
(కు. సం. ౮-౯౨౭.)

చిలుకల పోఁద్రోలఁ దలఁచిన పడఁతుల కేకలచేఁ జిలుకలు నిలిచిపోవుటలో కవి చిత్రించిన చమత్కృతి హృద్యమనిపించును. ఈసందర్భముననే మఱియొక విలక్షణదృశ్యము గాంచనగును. సేద్యగాండ్రయిల్లాండ్రు మిక్కిలి ప్రయత్నముతోఁ దాము కాఁపుండెడి శాలిసస్యములందు చక్రవాకపక్షుల గుంపులు ప్రవేశింప వానిని బోఁద్రోలుటకై చప్పట్లు చఱువఁ జేతుల నెత్తఁగా వారి తుంగ కుచములఁ జూచి, తమ యందమును బోలిన క్రొత్త చక్రవాకములనుకొని వానిని జూచుచు నవి గదలకుండునఁట.

"హాలికనితంబినీతతి ప్ర
యత్నమునం దమ కాచియున్న య
క్కలమవనాళిచక్రవిహ
గంబులు సొచ్చినఁ జోపిపుచ్చఁ జే
తులు చఱువంగ నెత్తుటయుఁ
దుంగకుచంబులు వాని నాఁగు న
ప్పులుగుల యొప్పిదమ్ము లెడఁ
బోలిన పక్షము సేయునట్టివై."
(కు. సం. ౮-౯౨౮)

ఇఁక నుపకంఠము వదలి యుపవనములోఁ బ్రవేశించి భూమినుండి యాకాశమువఱకు పండ్లతో నింపినాఁడు. ఆపండ్లన్నియు నొకటిపై నొకటి మోచియుండుట కనువైనవియే. ఏకాగ్రతతో పరికించిన మన కాపండ్ల గుత్తులన్నియుఁ గన్నులకుఁ గట్టినట్లగపడును. అట్లు దృశ్యసాక్షాత్కారము గల్గునట్లు చిత్రించుట కీకవిరాజు తన యుపవనమున వృక్షవాటి నావిధముగ నేర్పఱచి, భావనాబలమున వాని నీపద్యమునఁ గూర్చుటయే కానోపును. కనుఁ డాఫలరాశిని.

"నిమ్మలు మాదీఫలమ్ములు నతిరమ్య
ముగఁ బండి నేలపై మోచియుండు
పనసలు నీడలు పండుగుత్తులుగట్టి
వారక వానిపై బ్రాలియుండుఁ
దేరుమామిండ్లును నేరేళ్లుఁ గడుఁ జెల్వ
మై పండి వానిపై నదికియుండుఁ
గ్రముకంబులును వరఖర్జూరనికరంబు
నొగిఁ బండి వానిపై నొఱగియుండు
నాలికేరములును దాలసమూహంబుఁ
బండి వానిఁ గప్పియుండు నొప్పి
వరుసఁ దరతరంబ వనములు సత్ఫల
రాసులై నభమ్ము రాయుచుండు."
(కు. సం. ౮-౯౩౦)

పురోపవనమునఁ బ్రత్యూషశోభ నతిహృద్యముగ నీక్రిందిపద్యమునఁ జిత్రించినాఁడు :

"శ్రీలఁ దాంబూలవల్లీతమాలనీల
భాతి దనరంగఁ బరిపక్వపనసపూగ
భాసురారుణద్యుతులు పైఁ బర్వ పొగడఁ
జాలు వనలక్ష్మి ప్రత్యూషవేళవోలె."

(కు. సం. ౮-౧౩౨)

క్రమముగఁ దములపాకుల తీఁగల తమాలముల వోని నల్లనికాంతి క్రిందిభాగమున వ్యాపించి, మీఁదఁ బండిన పనసపండ్లయు, పోకపండ్లయు నెఱ్ఱనికాంతులు వ్యాపింప నవ్వనలక్ష్మి క్రిందిభాగమున చీకటినలుపుపై సంధ్యారాగము వ్యాపించునప్పటి ప్రత్యూషమువోలెఁ బొగడఁజాలి యుండునఁట. ఇటఁ బ్రత్యూషరామణీయకము నుత్ప్రేక్షించుకొని దానిని వనలక్ష్మితోఁ బోల్చుకొను భారమును పాఠకులకు వదలుటలోఁ గవి చమత్కృతి నొనర్చినాఁడు.

"తమ వక్త్రాధరకేశయానవయనో
ద్దామప్రభావంబులన్
రమణం బోలుదమన్నఁ దత్పురసతుల్
రాజీవబంధూకభృం
గమరాళోత్పలరాజి నూరివెలి న
ల్కన్నీరఁ ద్రోపించిన
ట్లమరెం దోయజషండముల్పురవరో
ద్యానంబులం దందమై."

(కు. సం. ౮-౧౩౩)

ఆపట్టణమునందలి సతీమతల్లులు తమ ముఖము, అధరోష్ఠములు, కేశములు, గమనము, నేత్రములు అను వీని ఘనతను బోలుదమనినంతనే—పద్మములు, మం

* అష్టావక్రమహర్షి తండ్రియగు కహోలుఁడు తన భార్య పురిటిసమయమున కావశ్యకమగు ధనము నార్జించుటకై జనకునాస్థానమునకుఁ బోయినపుడు అక్కడి వంది యనునాతఁడీతని వేదవాదమున నోడించెను. దానఁ గహోలుఁడు చిరకాలము జలదుర్గమునఁ బడియుండెను.

(సం. భార. ఆరణ్యపర్వము).

కెనపువ్వు, తుమ్మెదలు, హంసలు, కలువలు అనువీని నల్కతో నూరివెలుపల జలదుర్గమునఁ ద్రోపించెనో యనునట్లు పురోద్యానవనము లందముతో నొప్పారుచున్నవఁట. ఇట వక్త్రాధరకేశయాన నయనప్రభావములను మించవలెనని రాజీవభృంగ మరాళోత్పలములు యత్నించి, యోటమిగొని జలదుర్గములఁ ద్రోపింపఁబడుట ను ంచినాఁడు. ఒకనిమీఁద విజయమునకై దండెత్తి యోటమిగొనిన నాతని రాజదండనరూపమున జలదుర్గమునఁ ద్రోపించుపద్ధతి యితిహాసప్రసిద్ధమై కానవచ్చుచున్నది.*

పిమ్మటఁ బట్టణమునందలి హర్మ్యముల రామణీయకమును మనోహరముగఁ జిత్రించినాఁడు. బంగారు మేడల వరుసలు ఆకసము నంటియుండఁ గల్పవృక్షములది గాంచి స్వర్ణభూమి యనుకొని యూడలుదిగెనో యనునట్లు మేడలమీఁది కేతుదండము లొప్పుచుండె నఁట.

"కనకమయహర్మ్యపంక్తులు
ఘనమార్గం బడరియున్నఁ గల్పకుజంబుల్
గని యూడలు డిగ్గెనొ యనఁ
దనరుచుఁ దత్కేతుదండతతి విలసిల్లున్."

(కు. సం. ౮-౧౪౬)

"కమనీయాత్మక సర్వలోహమణి స
త్కాష్టేష్టికానిర్మితో
త్తమహర్మ్యంబుల గండరించిన కపో
తవ్రాతపంక్తుల్ బిడా
లము లోలింగని వానిమీఁది కలుక
న్లంఘించి గాకున్నఁ ద
ద్భ్రమఁ బైనూఁగినఁ బల్కవొందెడఁగఁ బా
రావతానీకముల్."

(కు. సం. ౮-౧౪౮)

అందమైన సర్వలోహములు, మణులు, చక్కని కఱ్ఱలు, ఇటుకలు వీనిచే నిర్మింపఁబడిన మేడలందు చెక్కిన పావురపుఁబంక్తులను బిల్లులు చూచి వానిని మ్రింగవలెననుకొని కోపముచే నుమికి, అవి నిజమైన

పావురములు గాకున్న నాభ్రమ మనమునం దలముకొని యుండుటచే వేఱొకచోట నిజమైనపావురములు మీఁద నూఁగఁగఁ జూచియు మెదలకుండునఁట. కవియుత్ప్రేక్షలో నిట్టి భావ మున్నట్లు పొడసూపుచున్నది. కాని నాల్గవ పాదమునందలి 'కఁటే' అనుపదమునకు వాస్తవికార్థమేమో? ఇఁక వ్రాఁతప్రతిలో 'ఒండెడంగంటి పారావతానీకముల్' అను పాఠముగలదు. 'కఁటే' అను కొనిన నర్థమేమో! 'కనీ' అనియో, లేక 'కనన్' అనియో సవరించుకొని 'కానవచ్చినను' అనునర్థమును బొసఁగించుకొనవలయునా? ఏదియెట్లయినను గవిమాత్ర మీపట్టున హృద్యమగు భావమును యోజించినాఁ డనక తప్పదు. ఈప్రస్తావముననే మఱియొక చిత్రప్రదర్శనము గావించి యున్నాఁడు.

"గగనము దాఁకి చిత్రగత
　　కాననసంహతిఁ బొల్చు హర్మ్యశ్రీము
ల్నగముల సావి యూఁగిన ఘ
　　నంబులఁ బూర్ణసరోవరంబుల
న్నగ జలకేళి సల్పనని
　　వచ్చి యెఱింగి వియచ్చరాంగనల్
నగుడుట చూచి నవ్వుదురు
　　మాడువులందు రమించు దంపతుల్."

(కు. సం. ౭-౫౭౮)

ఆకసమునంటి, చిత్రతరువులందలి యరణ్యపంక్తులతో నొప్పారెడి మేడలు పర్వతము లనుకొని, మీఁదఁ గదలుచున్న మేఘములు జలముతో నిండిన సరోవరము లను భ్రాంతిచే దేవతాస్త్రీలు జలకేళి సల్పుటకై వచ్చి, కావని తెలిసికొని మరలిపోవుట చూచి, మేడలపై విహరించు దంపతులు వారిని నవ్వుదురఁట.

ఈపద్యము రెండవపాదమున ముద్రితప్రతిలోను, వ్రాఁతప్రతిలోను గూడ 'నగము సాఁచి యూఁగిన మనంబుల' అని కలదు. ఆపక్షమున నర్థముపొసఁగకుండునని—'సాఁచి' యనుచోట 'సావి' యనియు, 'మనంబుల' అనుచోట 'ఘనంబుల' అనియు సవరించుకొనిన సరిపడునని తలపోసియుంటిని. కాని యీవఱకున్న పాఠముననే సారళ్యము గానవచ్చినచో సవరింపనక్కఱలేదనియే నాయూహ.

ఇంతకును నేఁటిదనుక నీకుమారసంభవమునకు తంజావూరు సరస్వతీభాండారమునందలి ప్రతియొక్కటిదక్క వేఱొకటి గానరాకుండుటచే, నిర్దుష్టమగు కృతిని కవిహృదయము సుస్పష్టముగఁ దెలియునట్టి సంస్కారములతో నీగ్రంథము ముద్రణభాగ్యము నందకుండుటచేతను పెక్కువితర్కముల కాస్పదమగుచున్నది. ఏది యెట్లున్నను కల్పనావైచిత్రి యసదృశమనుటలో సందియ మక్కఱలేదు.



# కవిత్వము - భావకత్వము



= శ్రీ మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి =

'ముఖే ముఖే సరస్వతీ' అను పెద్దల పలుకునకుఁ దాత్పర్యము 'కవిత యొకరి సొమ్ము కాదని'. ఒకానొక వ్యక్తిలో నవ్యక్తముగ నేదోయొక ప్రతిభ యంతర్లీనమై యుండును. ఆ ప్రతిభ నెఱిఁగికొనుటకుఁ బ్రతిభాన మావశ్యకము. కవిని కవి యెఱుఁగును. విమర్శకుని తత్త్వము విమర్శకునకే యెఱుక. గాయకుని లోఁతు గాయకుఁడు ముట్టును. కవియగాథ హృదయము కవిగాని విమర్శకునకుఁ బాతాళము. విమర్శకుఁడు స్వయము కవికూడనైన, కవిహృదయము పాతాళమునుండి స్వర్గాగ్రమున కెత్తినైవఁ గలుగును. విమర్శకుఁడు భావకుఁడు కానిచోఁ, గవికర్మము కాలిపోయినట్లే. భావకుఁడు కవి కావలయును; కవి భావకుఁడు కావలయును. అట్లు కానిచోఁ దత్తద్రచనములు క్షణభంగురములే. మల్లినాథుఁడు కాళిదాసునకు వ్యాఖ్యానము రచించినాఁడు. మల్లినాథుఁడు నిఘంటువులు వల్లెవేసిన వట్టి వ్యాఖ్యాత కాఁడు; భావకుఁడైన వ్యాఖ్యాత. కానిచోఁ గాళిదాసకవిచక్రవర్తి యీపాటికి రెండవ తరగతి కవులలోఁ జేరవలసినవాఁడై యుండునేమో? మల్లినాథుఁడు కవియు, భావకుఁడును. ఛందశ్శాస్త్రము చదివి నాల్గు పద్యములు వ్రాసినవాఁడు వ్రాయసగాఁడు కాని రచయిత యనిపించుకొనఁడు. మల్లినాథుఁడు ఛంద మెఱుఁగును. కావ్యములు రచింపలేదు. కాని, యతఁడు మహాకవి. భావకుఁడు. అతఁడు తన్ను గుఱించి యిటులు చెప్పికొనెను:

"వాణీం కాణభుజీ మజీగణ దవా
సాసీచ్చ నైయాసికీ
మంతస్తంత్ర మరంస్త పన్నగగవీ
గుంభేషు చాజాగరీత్
వాచా మాకలయద్రహస్యమఖిలం
యచ్చాక్షపాదస్ఫురాం
లోకేఽభూ ద్యదుపజ్ఞ మేవవిదుషాం
సౌజన్యజన్యం యశః"

మల్లినాథుఁడు శాస్త్రప్రజ్ఞ నిటుఁ బ్రకటించుకొని, తన కవితావిషయము నెతుకొనలేదు. తరువాతి శ్లోకమున 'మల్లినాథకవి స్సోఽయం' అని సామాన్యముగఁ గవి ననుకొనెను. అంతే. వ్యాకరణము, న్యాయవైశేషికములు తెలిసికొంటి ననియేగాని, కవితా ప్రతిభను గూర్చి వచించుకొనకపోవుట మల్లినాథుని సౌజన్యమునకు మంచి తారకాణ. 'కవీనాం కవి' యనఁదగిన కాళిదాసుని యగాథహృదయ పారావారము లోఁతుముట్టి భావరత్నములు బయటఁబెట్టిన మల్లినాథుని వంటివాఁడే మహాకవి కానిచో మనమా మతి! పాండితీపరిగణనమునకుఁగాని కవితాపరిగణనమునకు ఇయత్త లేదు. అందులకే, యీ మహామహోపాధ్యాయుఁడు కవిత నెఱుఁగుదునని కంఠోక్తిగఁ జెప్పుకొనుటకు శంకించినాఁడు.

భావనకుఁ గొలఁతకట్టు లేదు. కవిత భావరూపము. కొన్ని నియమములలో భావమే కవితగ వివర్తించును. పరమార్థమున, కవిత్వభావములకు జీవబ్రహ్మములవలె నేకత్వము. జగత్తునకు నానాత్వమువలె కవిత్వమునకే యనేకత్వకల్పనము. కవిధర్మము కవిత్వము. భావకుని ధర్మము భావకత్వము. ఇప్పుడీకవిత్వభావకత్వములకుఁగల సంబంధము, తత్తల్లక్షణ కథనము ప్రస్తుత వ్యాసాంశము.

## — కవిత్వము —

కవిత్వము కళ. దీని కభ్యాసాదులు కారణము కాదు. ప్రతిభయే ప్రధాన హేతువు. కావ్యఘటనమున కనుకూలమగు శబ్దార్థముల యుపస్థితి ప్రతిభ యని యాలంకారికుల నిర్వచనము. జన్మాంతరీయ తపస్సు ప్రతిభకుఁ గారణము. దేవతా మహాపురుష ప్రసాద జన్య మగు నదృష్టమది. విలక్షణ మగు వ్యుత్పత్తి, కావ్య కరణాభ్యాసము కూడఁ బ్రతిభోదయమునకు హేతువు లని చెప్పుదురు. ఏది యెటున్నను బ్రధానమైనది ప్రతిభయే. ప్రతిభ కొఱవడిన కవిత కవిత గాదు. ప్రతిభారహితుఁడు ఔపదేశికకవి. అతని కావ్యము స్వగృహభిత్తికలందే యుండి మూల్గుచుండును. ప్రతిభా సహితుఁడగు కవికావ్యము శ్రుతిరమణీయమై ప్రతి భావకుని హృదయమందుఁ జొచ్చి, జనసాధారణ గ్రాహ్యము, విదగ్ధహృదయావర్జకముగూడ నగును. సామాన్యప్రజ మెచ్చని కవితకు శాశ్వతత్వ ముండదు. రామాయణము ఇన్ని సహస్రాబ్దము లిటులు నిలుచుటకుఁ గారణము యోచించినచో, జనసాధారణమున దాని కున్న స్థానము, పండితలోకములో దాని గౌరవ మసాధారణ మైనదే. దానికి విప్రతిపత్తియే లేదు. రామాయణేతివృత్తము బహుప్రసిద్ధము. వాల్మీకి కవిత ద్రాక్షాసదృశము. అన్వయ కాఠిన్యముగాని, అర్థగాంభీర్యముగాని, తికమకలుగాని యుండని మృదుల కవిత నెన్నవలసివచ్చినప్పుడు వాల్మీకిదే పైచెయ్యి. అంతమాత్రమున వాల్మీకికవిత్వము విదగ్ధహృదయావర్జకము, అర్థపాటవాభిరామము రనఁగలరు? భారతము, పురాణములు, కాళిదాసుని సర్వరచనలు, భవభూతినాటకములు, మృచ్ఛకటికము, జయదేవుని గీతగోవిందము మున్నగు సంస్కృత వాఙ్మయ కృతులెన్నో మన మిపు డనుకొన్న లక్షణమునకు సరిపడిన యుదాహరణములు. అవి పండితుల విమర్శములకుఁ దాళి, అవిదగ్ధుల హృదయములను సైతము వంచి రసోదంచితములై శతాబ్దులు శతాబ్దులు నిలువఁగలుగుచున్నవి. భట్టికావ్యము ఒక్క విదగ్ధచిత్తములలోనే యుండిపోవును. మఱి మేఘదూతమో, సూర్యకిరణము వలె నెల్ల యెడలఁ బ్రాకిపోవును.

మన తెలుఁగుసారస్వతములోఁ జూచుకొందము. ఆంధ్రమహాభారతము వేయేండ్లు కావచ్చుచున్నది, రచింపఁబడి. ఇప్పటికి నది పురాణము. ఎన్నాళ్లైన నది పురాణము. "పురాపి నవమ్" అని పురాణమునకు అర్థము చెప్పిరి యీ యూహతోడనే. భారతములో విరాటోద్యోగము లెంత వ్యాప్తిలో నున్నవో చూడుఁడు. ఆ సంజయరాయబారము, ఆ కృష్ణరాయబారము నేఁటి రాజకీయ రాయబారముల కంటె వేయి రెట్లు స్వభావ సుందరములై యున్నవి. అట్టి రమణీయఘట్టములు భారతములోఁ బర్వపర్వమునఁ బదికిఁ దక్కువ గాక యున్నవి.

"పగయడఁగించు టెంతయు శు
భం; బదిలెస్స యడంగునే పగం,
బగ, వగ గొన్న మార్కొనక
పల్కక యుండఁగవచ్చునే; కడుం
దెగ మొగలెత్తి పోవఁ, బగ
దీర్పఁగవచ్చినఁ గ్రౌర్యమొందునే
మిగతిఁ దలంచినం బగకు
మేలిమిలేమి ధ్రువంబు కేశవా!"

ఈ మొదలగు పద్యములలోని రాజకీయ రహస్య భావములు, నీతిసారము భావకులకు మఱవరానివి. ఇప్పుడు మనమనుకొన్న ఘట్టములలో నిట్టి పద్యములు తేపతేపకుఁ జూపట్టును. "పగ యడఁగించు టెంతయు శుభం" బన్న పద్యము విదగ్ధభావకు లాలోచించిన కొలఁది రసస్ఫూర్తి వెదచిమ్మును. అవిదగ్ధులకు సైతము చక్కని నీతిమార్గమును బోధించును. ఇతివృత్తములో జీవము, కవితలో జవము గల భారతాది కృతులు ప్రజల జీవములతోపాటు పాతుకొని యుండును.

ఆముక్తమాల్యద యున్నదనుకొనుఁడు అందలి కవిత పండితైకసంవేద్యము. అందలి భావగాం ము పండితైక ప్రవేశయోగ్యము. అది

ప్రజాసామాన్యమున కందరాని ఫలము. అయినను, దానిని చక్కఁగఁ జదివి యొక పండితుఁడు ప్రజకు బోధించినపుడు తద్భావరీతులకు 'ఆహా!' యననివాఁడుండఁడు. అది భారతము వంటి కవితయుఁగాదు, కథయుఁ గాదు. త్యాగరాజుగానము కవిత్వమైనది. క్షేత్రయ్యపదములు ఆబాలగోపాలము పఠించును గుడములో మాధుర్యము వలెఁ బ్రజలలో వారి వారి కవితలు కలసిపోయియున్నవి. అవి మనము ఎన్నేండ్లు ప్రయత్నించినను వేఱుచేయలేము. ఆధునిక కవులలో పానుగంటివారు, తిరుపతి వేంకట కవులు, చిలకమర్తి లక్ష్మీనరసింహాకవి మున్నగు కొందఱు కవితలు కొన్ని ప్రజాహృదయములలో నాటుకొనిపోయినవి. "మనమా! వద్దిఁక నాదుమాట వినుమా మర్యాద మాటాడుమా" అన్న పద్యపాదము బండివాఁడు పాడును. పడవ నడపువాఁడు పాడును. పండితుఁడు పాడును. వారి వారిని పాడవలదని ప్రచారము చేయ మొదలిడినచో, వ్రెత్తితన మనిపించుకొనును. పక్షపాతము విడిచి చూచుకొనవలెను. "పురాణ మిత్యేవ నసాధు సర్వం, నచాపి కావ్యం నవమిత్యవద్యం" అని పాపము, కాళిదాసుఁడు గోలపెట్టినాఁడు! రాయప్రోలు సుబ్బారావుగారి "తన గీతి యఖవజాతిని పాఠకులనుగా దిద్ది వర్ధిల్లిన తెలుఁగువాణి" అన్న పద్యము, "జయ జయ జయ ప్రియభారత జనయిత్రీ" అనిన పదము మనము నేఁటి కాలమున వేల కొలఁది పండిత పామరుల నోళ్లనుండి రాఁగా విందుము. మఱి, ఆ కవితలో నెంతజీవము, జవము లేకపోయినచో నశ్లేల వ్యాపించును! అది భావకవిత్వమని, వినఁగూడదని చెవులు మూసికొన్నవారిని యిద్దఱుముగ్గురను నేను ప్రత్యక్షముగ నెఱుఁగుదును. అట్టివారు భావకులు కారన్నమాట. సుబ్బారావుగారు భావకుఁడైన కవి. దేశకాల పాత్రములు పరిశీలించినవాఁడై పద్యములు రచించెను. అందులకే యా కవితను దేశము సమారాధించినది. భాషావిషయవాదము ప్రస్తుతవ్యాసమునకు విషయముగాదు. 'ఎంకిపాటలు' పాడుకొన్న కవిని దేశము బ్రహ్మరథము పట్టుచున్నది. భావభ్రష్టముగ నున్నదని పండితులలోఁ గొందఱు త్రోసివేయుచున్నారు. భావములో జీవ మున్నదని చాల మంది విదగ్ధులు చెప్పుకొనఁగా నేను విన్నాను.

కవితలో ననేకజాతులున్నవి. ఒక జాతి కవితలో 'ఎంకి పాటల'కు గౌరవస్థానమున్నది. ఒక రకము కవితలో 'జడకుచ్చుల'కు ఉచ్చైఃపదవి యున్నది. అది మనము చూచుకొనవలసినది. రాచబాటలలో నీ రాచబాట యుత్తమ మని, యీ రాజమార్గము నీచమైనదని నిర్ణయించుట యెవని తరము! ఇది రాజమార్గమా, కాదా యనియే పాంథుఁడు పరిశీలించును. పదకవితకుఁగాదు, పద్యకవితకుఁగాదు, మఱొకరకపు కవితకుఁగాదు-సమస్తమునకుఁ బ్రాప్య మొక్కటియే. అదే రసప్రపంచము. ఉత్తమభావకుని చేతిలో భారతము పడును. భావకవిత్వమని వ్యవహరింపఁబడుచున్న నేఁటివారి కొన్ని కృతులును పడును. క్షేత్రయ్యపదములు పడును. ఎంకిపాటలు పడును. అతఁడు ప్రతిపదమును సహృదయుఁడై చదువును. చదివి భావించును. భావించి తన్మయీభవనయోగ్యహృదయసంవాదభాక్కు కాఁగలఁడు ఆ వ్యాపారమంతయు భావకునిది. కవి భావకుఁడైనపుడు ఛందోబద్ధములగు వృత్తములు వ్రాయును. ఒకప్పుడు నియమములు లేక యేవో పాటలు రచించి పాడుకొనును. మఱొకప్పుడు యేభారతమో పైకెఁదీసి లోలోఁ జదువుకొని రసాస్వాదనము చేసికొనును. ఈ పై మూఁడవస్థలలోను కవి కవియే యగునుగాని, కాకపోవుట తటస్థింపదు. తృతీయావస్థలో నతని కవిత్వము కాగితముపై కెక్కదు. శ్రవణేంద్రియప్రత్యక్షమునుగాదు. 'జీర్ణమంగే సుభాషిత'మ్మనునటు లతని భావములో నశ్టై యుండిపోవును. కవిత యొందఱెందఱు పిదికినను పొదుగెండని పాడియావు. గ్ధయొకఁడు విషపుఁబాత్రలో నాపాలు పిదికికొనును. ఒక దోగ్ధ బంగారుగిన్నెతో పాలు పిండి తెచ్చికొనును. అదియే భేదము. ఉపాధిభేదమువలన నాభిన్నత్వమేర్పడినది.

## — భావకత్వము —

కవియభిప్రాయమును, శ్రమను భావించువాఁడు భావకుఁడు. "బహుకావ్యములను బరిశీలించి పరిశీలించి స్వచ్ఛము గావించుకొనిన మనోదర్పణమున వర్ణనీయ తాదాత్మ్యము వహించుటలో హృదయ సంవాదము నందినవాఁడు భావకుఁడు"అని రాజశేఖరాదులు నిర్వచనము గావించిరి. కవికి శబ్దార్థములు విషయము. భావకునకు రసాస్వాదము విషయము-భావకత్వ మున్నఁగాని కవిత్వకల్పతరువు ఫలింపలేదు. మఱి, యీకవిభావకుల భేదాభేదము లెట్టివి? కవి భావకుఁడైయుండును. భావకుఁడు కవియైయుండును. కావున వీరిర్వురకభేదభావ మనవలయును. ఆచార్యుల నిర్వచన మిటు లున్నది:

"ప్రతిభాతారతమ్యేన ప్రతిష్ఠా భువి భూరిధా
భావకస్తు కవిః ప్రాయో నభజత్యధమాం దశామ్."

భావకుఁడుగాని కవి యధమదశయే యనుభవించును. కావ్యానుశీలనములేక, వర్ణనీయవస్తువుతోఁ దన్మయత నందక పద్యములు గొలుకువాఁడు కవియే కాఁడు. అట్టి కవింమన్యుని కావ్యము నిన్నవిని యీనాఁడు విస్మరింతుము. కావునఁ గవి భావకుఁడైనచోఁ గావ్యమున కేమియు బాధలేదు. ఉత్తముఁడైన కవిలోనే భావకత్వ ముండును. అనుత్తమకవి విషయము చూచుకొన్నపుడు కవి వేఱు, భావకుఁడు వేఱు అనవలసి వచ్చును. అందులకే కొందఱు కవి, భావకులకు స్వరూపమునను, విషయమునను బహుభేద మున్నదని వక్కాణించిరి. ప్రతిభావిశిష్టుఁడైన కవి శబ్దరూపమగు వాణిని రచించుటకు సమర్థుఁడు. కవిలోని ప్రతిభ కారయిత్రి. భావకునిలోని ప్రతిభ భావయిత్రి. కవి కనకము. భావకుఁడు నికషోపలము. కానఁ గవిత్వభావకత్వముల కెంతోయంతర మున్నదని చెప్పిరి. ఇది సత్యమే. కవిత్వ భావకత్వములు రెండును గలవాఁడు కవిత రచించిన, నదియే యుత్తమకవిత, భావవత్కవిత యని మనము సిద్ధాంతీకరించుకోవలయును. కేవలభావకుఁడు, కేవల కవి రాణింపరు. భావకత్వము గల కవిత్వమునకు రెండు మూఁడు రచనలు మూదలించి వివమించెద. లక్ష్యలక్షణసమన్వయము భావకపాఠకలోకమునకే విడుచుట యైనది. ఈ యుదాహృతములన్నియు నఘునాతనకవులవే యని మనవి.

"మేఘమండలముపై మెఱుపుఁదీవలతోడ
ముద్దులాడుచు నాదుసుద్ది మఱతొ?
మవ్వంపు వనులలోఁ బువ్వుఁదీవియలతో
నవ్వులాడుచు నీవు నన్ను మఱతొ?
పర్వతాగ్రములపై నుర్వీరుహాళితో
నాటలాడుచు నాదుమాట మఱతొ?
పొంగారునదులఁ దరంగమాలికలతోఁ
జల్లులాడుచు నా ప్రసక్తి మఱతొ?
యెచట నీవుండి నీకు నే నెన్నిమార్లు
విన్నవించిన నీ విట్టె విస్మరించి
యూరకొనుచుంటివో? యెట్టులూరకుండు
దినదినము మ్రొక్కి కృష్టికిఁ బెకయుండు?"

["ఉపాయనము"]

"ఈ తేనె చుక్క యొక్కటి
మూతికి రాచికొను మోసముగ్రుఁడ! యేత
న్మాత్రములోపల నీ వా
పాతాళముదాఁకఁ దియ్యఁబడఁగలవుచుమీ!"

["ఏకావళి"]

"ఆకసంబునసైన, నవనిపైనైన
జలదపంక్తులనైన, జలరాశినైన
ఘోరాటవులనైనఁ, గొండలనైన
నెదురుగాడ్పులనైన, నెండలనైనఁ
ద్రోవదప్పకయుండఁ దూలిపోకుండ
నరచంబుదిప్ప నీయలవాటు మెఱయఁ
బ్రణయవనంబులోపలి పుష్పరథము
-తుమ్మెదా! వేవేగ తోలితేవమ్మ!"

["ఏకాంతసేవ"]



# విరుపణ్ణ

## = శ్రీ రాజు, రాయలు =

విరుపణ్ణ పెనుగొండరాష్ట్రానికి కృష్ణరాయల ప్రతినిధి. రాజాజ్ఞ లేకుండా లేపాక్షిలో ఆంధ్రశిల్పజ్యోతి అనదగిన ఆలయాన్ని నిర్మించడానికి ద్రవ్యము ఖర్చుచేసినాడని అతని కండ్లు రెండూ ఊడబెరికించినాడు రాజు.

ఆత్రమువల్ల బుద్ధిచెడి ఆపయి నిర్ణయశక్తిలేక నా
నేత్రము లూడదీయుమని నీవు విధించితిగాని నా మనో
నేత్రము నార్పజాలగల నేర్పు త్వదాశ్రయమందు లేదు ఈ
మాత్రము శాశ్వతంబుగ చరిత్రను నిల్చును కృష్ణభూవరా!

రాలకు చక్కిలింతలిడ రాలిన పూవుల గూర్చినట్టి నా
మాలను త్రెంపివేసెడు అమానుషశక్తులు నీకు లేవు కో
పాలకు తాపమొందె తమ కోమలికత్వము గోలుపోక మా
బాల కళాతపస్వి తన ప్రాభవ మెప్పుడు చిందిలీరెడుః.

పన్ను వసూలుజేయు పనిపట్ల ప్రజాహృదయాంతరాళమం
దున్నటువంటి భావములు ఊహాలు పోహలు జూచు పీలు నా
కున్నది కావ్యకర్తలను నూపుచు నూరటజెందుచున్న మీ
మన్నన యింతపాటిదనిమాత్ర మెరుంగను నాడు నేటికిః.

కవిత స్ఫూర్తికి కోటి కొక్కరుడెగా కాంక్షించి ఆనందపుఁ
రవళిం జెందెడు నింక చిత్రకళయో రాజా కనుల్గల్గువా
డెవడే న్మెచ్చి తలూపితీరునని నే నెంతో శ్రమం జెంది మీ
యవివేకాగ్నికి కాలిపోయితి నిటుల్ అధ్వాన్నమౌ దుస్థితిన్.

రాలను జీల్చి భావముల రాసులబోసెడు నేర్పుకూర్పులం
జాల ప్రసిద్ధి గల్గు నులి చాలదు గంటపు తిక్కగీరలన్
చీలికలైన నీహృదయచిత్రము దిద్దగ నన్న సంగ తీ
వేళకు అర్థమైన దిక నేమనుకున్నను లాభ మున్నదా.

కాల-ప్రవాహఘాటికి ఎకాయెకి నాగుచు కావ్యకన్యకుఁ
మేలిముసుంగుచీరలను మీఁగడవెన్నల విందు లిచ్చి భా
వాలను దిద్దితీర్చెడు కళాలలితాంగిని ఆదరించుటే
మాలిన దోషమయ్యె తమ మానస మిట్టుల మారినందునన్.

పూసిన భావనాలతల పూపొదరిండ్లను తీపిజీవనా
ల్జూసిన చిత్రకారుల మనస్సుల పండిన పంటలన్నిటిఁ
రాసిగ బోసి ఆపయిని రంగుల దీపిక లుంచి నీయశో
వాసికి వన్నెగూర్చెడు ప్రభల్ వెలయింప తపస్సు జేసితిన్.

కళయౌచిత్యము నెట్టి రాజసము నీ కండ్లం బ్రవేశించుటం
బలదర్పంబులు హుంకరించినవి నీ పాండిత్యము న్దౌల్వియు
న్నలుపై నీరసమయ్యె రాజు మిగిలె న్నావంటి యుద్యోగిపై
చల మిట్లయ్యె చరిత్రపంక్తుల మషీసారంబులో రక్తమై.

ని యనవద్యమౌ ప్రభుత నెన్నడు విస్మరియించికాదు, నా
కే యధికార మొల్ల తలకెత్తితి వంచని గాదు, సుస్థిరం
బౌ యశముం గడించుకొను నాశయు మోసము కానె కాదు మా
రాయలులే మరొక్కవిధి రాదును కాదనుకొంటి నోప్రభూ.



# సౌందర్యముయొక్క ప్రాముఖ్యత నిలబెట్టుట

ముఖ్యమైన అన్ని విషయాలలో వనితలకు చిన్నతనములో తమ తల్లులకంటె మంచి సలహాను ఎవరు యివ్వలేరు. ఈ తల్లి తనకుమార్తెకు ముఖ్యముగా బోధించినదేమంటే, పియర్సు సబ్బు నిర్మలమైన నీటితో తన చర్మసౌందర్యమును నిలబెట్టుకొనుటయే. ఈ పద్ధతిని తన తల్లివద్దనుంచి నేర్చుకొని అనుసరించుచున్నది. ఇదే ఆమె సౌందర్యము చెడకుండా వుండుటకు కారణము. తన కుమార్తెకూడా యీ విధంగానే చేయుచున్నది. కనుక ఆమెయొక్క సౌందర్యము కూడా ఏమాత్రము చెడకుండా వుంటుంది.

ఇండియాలో నలభై సంవత్సరములనుంచి అందమైన స్త్రీలు ప్రత్యేకముగా పియర్సునే వాడుచున్నారు. దీని పరిమళము, మృదువైన నురుగు దీనికి సబ్బులలో ప్రాముఖ్యత నిచ్చినవి.




# పియర్సు సబ్బు

శాశ్వతముగా సౌందర్యమును కాపాడుట

TG. 39-172 TL — A. & F. PEARS, ISLEWORTH, ENGLAND



[ కథానిక ]



= శ్రీ కొడవటిగంటి కృష్ణమూర్తి

"ఇది ఎన్నోసారి వాళ్లింటికి వెళ్లటం" అంది రాఘవమ్మ భర్తతో. "వాళ్లింటికి వెళ్లటం ఇది రెండో సారేకాని బిచ్చానికి బయలుదేరటం ఇది ఎన్నో సారో!" అన్నాడు సత్యం.

"బిచ్చమేం ఖర్మం—ఎవ్వరికీ బాకీతీర్చకుండా వుంచలేదే" అన్నది రాఘవమ్మ.

"నువ్వు చేసే బాకీలు తీరుస్తున్నాంకాని నేను చేసే బాకీలు తీరటం లేదు!"

"వారంరోజులు కాలేదు వాళ్లింటో బియ్యం తెచ్చి. మళ్లీ ఈ శుక్రవారం పొద్దున్నే బియ్యానికి పోతే—వాళ్లుమటుకు ఎక్కడినించి తెస్తారు?"

"అదీ నిజమే. కాని మనం చెయ్యగలిగిందేమీ లేదు. నాకు జీతం వచ్చేటంతవరకూ బియ్యానికీ, నేతికీ మనం ఎక్కడికో అక్కడికి పోకతప్పదు"

"ఎరిగున్న వాళ్ల అందరి ఇళ్లల్లోనూ మన ఖర్మం మనం బాకీ! నన్ను చూస్తేనే దేనికో వచ్చానని వాళ్లకు అనుమానం. నిజంగా వాళ్లని చూడటానికే నాకు మొహం చెల్లదు."

సత్యంమనస్సు చివుక్కుమంది. అతని భార్య కావటంవల్ల రాఘవమ్మ కీ ఖర్మం!

"మీరైనా ఎవరిదగ్గిరికైనా వెళ్లి పదిరూపాయలు తీసుకురారు. ఆడబ్బులో వెచ్చాలు తెచ్చుకుంటే ఈ తిరిపెం ఎత్తాలిసిన అవసరమే వుండదు".

మురుగుగుంటలో ఈదేవాడికి దుర్వాసన దుస్సహం అయితే ఎలా జరుగుతుంది? సంభాషణ గాంధీ మహాత్ముడితో ప్రారంభం అయినా సత్యం వున్న ఇంటియజమాని దానిని తన ఆఫీసు, తన వుద్యోగం దగ్గిరికి లాక్కొచ్చేటట్లు సత్యం, రాఘవమ్మా తమ జీవితఘట్టంలో మెట్లు లెక్కపెట్టుకోవటం నిత్య కృత్యం. విసుగేసి వొక్కొక్కప్పుడు సత్యం ఆ వాసనను తప్పించుకోటానికికూడా ప్రయత్నించడు! అయితే భార్యాభర్తలు ఒకళ్ల కష్టసుఖాలు వొకరికి తెలియనీయకుండా వుంచటానికి ప్రయత్నం చేసినప్పటికీ వాళ్ల ఆత్మగౌరవం మరీ మందరస్థాయిలో వుండటంవల్ల అదిమామూలుగా కాబోయి అప్పుడప్పుడు తారస్థాయిలోకి పోవటంకద్దు. కేవలం రాఘవమ్మ ద్వారా జరగాలిసిన తిరిపెం ఆమె జరుపుతున్నప్పటికీ అందులో నాజూకులు భర్తకు తెలియనిచ్చేది కాదు రాఘవమ్మ. కాని అర్థంచేసుకోలేనంత పరమనిర్భాగ్యుడు కాకపోవటంవల్ల సత్యం భార్యను ప్రేమించాలిసిన వయస్సులో గౌరవించటం జరుగుతున్నది! సంసారం లేకపోతే తన కింత బాధ్యత వుండదేమోననిపించేది కాని ఆ ఈ భార్య లేకపోతే పరిస్థితి మరీ ఘోరంగా వుండేదని సత్యం నమ్మగలిగాడు. భార్యను చూచినప్పుడల్లా సత్యం తన అదృష్టం అంతా భార్యా రూపంతోనే వుందని భావించేవాడు. ఆమె తనుకారణంగా అవస్థపడుతున్నప్పటికీ, అతని అభిప్రాయం మారలేదు. "పెళ్లిచేసుకున్నవారంతా పడుతున్న

సుఖం నాకు లేదనా నీవిచారం?" అని ఒక బ్రహ్మచారి స్నేహితుడు సత్యాన్ని నిలవేశాడుకాని భార్య లేకుండా ఆ స్నేహితుడు పడుతున్న సుఖంకంటె సత్యం ఏరోజునైనా రాఘవమ్మతో కష్టాన్నే అనుభవించటానికి కోరుకుంటాడని ఆ స్నేహితుడికేకాదు, ఎవ్వరికీ తెలియదు. తను లేకపోతే ఇంత కష్టం వుండేది కాదేమోనని ఒకో సమయంలో అని రాఘవమ్మ కాబట్టి తప్పించుకుందికాని మరొకర్తై తే సత్యం చీల్చివుండును!

తన సంగతి అవతలపెట్టి, తనకేమీ చెప్పటం లేదని రాఘవమ్మ మధ్య మధ్య సత్యాన్ని సాధిస్తుంది! బియ్యం తేవటానికే తన కింత బాధగా వుంటే ఆ బాకీతోపాటు వందబాకీలు తీర్చటానికి అవసరమైన డబ్బు తేవటానికి సత్యం ఎంతబాధ అనుభవిస్తున్నాడో నని ఆమెకు అనుమానమేకాని నిజం తెలియదు. సత్యం ఎప్పుడూ చెప్పలేదు. ఒకసారి సత్యం అయిదు రూపాయలు ఒకాయనదగ్గిర అప్పుతీసుకున్న సంగతి వూరంతా తెలిసిందని రాఘవమ్మకు తెలియదు. అంత నిర్భాగ్యుడిదగ్గిర తనవంటి భాగ్యవంతుడు అక్షరాలా అయిదురూపాయలు అప్పుతీసుకోవటం వింతసంగతో లేక అయిదురూపాయలు లేకుండా జీవితం గడపలేకపోవటం వింతసంగతో సత్యానికి తెలియలేదు. ఇచ్చేవాడుంటే ఇంకా తీసుకోవటానికి అతనికి అభ్యంతరం లేదుకాని పావుబస్తా బియ్యం కొనటానికి డబ్బు అప్పు అడిగితే ఒకాయన సాయంత్రానికి వాయిదావేసి రెండుమానికలకు సరిపొయ్యే డబ్బు చేతిలో పెట్టినప్పటినుంచీ అతను ఎవ్వరినీ అయిదురూపాయలు మించి అడగలేదు. ఆ రెండుమానికల బియ్యానికి సరిపోయే డబ్బుఅయినా తీసుకోకపోతే తనకు అహంకారం జాస్తిగా వుందని అవతలాయన అభిప్రాయపడతాడేమోనన్న భయంతో సత్యం తీసుకున్నాడు కాని నిజంగా ఆ వచ్చే బియ్యం అప్పుకిందనే పోతయ్యి కాబట్టి ఆడబ్బును తీసుకోవటమే సత్యానికిష్టంలేదు! తను అయిదురూపాయలు అప్పు తీసుకున్న సంగతి వూరందరికీ తెలిసిందని తెలియగానే సత్యం అప్పు చెయ్యకూడదనే తేల్చుకున్నాడు. డబ్బు అయితే అప్పుచెయ్యకపోవచ్చుకాని నెయ్యీ, బియ్యం అప్పు చెయ్యకుండా (సత్యానికి అదృష్టవశాత్తూ వుద్యోగం దొరికినప్పటికీ) జీతం వచ్చేదాకా ఎలా జరుగుతుంది? సత్యానికి తెలిసివొచ్చిందేమిటంటే డబ్బూ, బియ్యం అప్పుచెయ్యటం దరిద్రానికి నిదర్శనంకాని పుస్తకాలూ, గ్రామఫోను ప్లేట్లూ, అభిప్రాయాలూ తాత్కాలికంగానైనా, శాశ్వతంగానైనా అప్పు చెయ్యటం భాగ్యలక్షణమేకాక అప్పుచెయ్యటం కిందికికూడా రాదు. పుస్తకాలూ, ప్లేట్లూ లేకుండా జీవించటం అసంభవంకాని బియ్యం, నెయ్యీ లేకుండా జీవించలేకపోవడమేకాక అప్పుచెయ్యకుండావుండటం సులభం.

అంత అనవసరమైన బియ్యానికీ డబ్బుకూ అప్పుకోసం బైలుదేరితే జనం ఆశ్చర్యపోవటమేకాక తమ ఈసడింపు చూపించటంకూడా సహజధర్మం. బియ్యానికి అప్పుకువచ్చినవాడిమీద చూపించకపోతే ఈఈసడింపు అంతా ఏంకాను? పుస్తకాలకోసం వచ్చినవారితో నీళ్లునమలి "మరొక్కరి కియ్యకు"అనటం ఎలానూ తప్పదు! ఇక డబ్బుకోసం వచ్చేవాడికి ఈసడింపును ఆనందించకుండా చిన్నబుచ్చుకోవటానికి అధికారమేముంది? అంత గోరోజనం కలవాడు అప్పుకెందుకు బయలుదేరటం?

సత్యం గ్రహించగలిగిందీ, అనుభవించిందీ రాఘవమ్మతో చెప్పలేదు. సత్యం ఎవరిదగ్గిరికైనా సాయి ఎందుకు పదిరూపాయలు బదులుతీసుకోడో రాఘవమ్మకు అర్థంకాదు. తను వెళ్లితే దేనికో అప్పుకోసమే వచ్చినట్లు చుట్టుపక్కల ఆడవాళ్లు చూచినట్లే, సత్యం బజారులో కనపడితేనే మరోసందు దూరేవా రున్నట్లు రాఘవమ్మకు తెలియదు. సత్యం ఆరోజున కనపడకుండావుంటే కోటిరూపాయల భాగ్యం లభించినట్లుగా భావించేవారు లేకపోలేదు. సత్యం కనపడితేనే హడలిపోయేవాళ్లున్నారు. సత్యం అడిగేది స్వల్పమేనని వారికి తెలుసు! సత్యం ఎలాగూ పెద్దమొత్తాలు అడగనూ అడగడు, వాళ్లు

ఇయ్యనూ ఇయ్యరు. ఇచ్చేవాళ్లకు పెద్ద మొత్తాలు ఇచ్చినా తాకట్లూ, ప్రాంసరీనోట్లూ వగైరా తంతు వుంటుంది. పావలా తీసుకుంటే సాక్ష్యం ఏమిటి? వాడిని మళ్లీ ఎలా ఆ పావలా అడగటం? ఆ పావలా ఇయ్యటానికి సత్యంబోటి అహంకారంగల మనిషికి ఎలా బుద్ధిపుట్టుతుంది? ఇదంతా ఎందుకొచ్చిన రొష్టు అని సత్యానికి కనపడకుండానే వుండేవారున్నారు.

పామును చూస్తే మనిషి కెంత భయమో, మనిషిని చూచినా పాముకూ అంతే భయం! నిత్యజీవితంలో పాముని చూచి పామూ, మనిషిని చూచి మనిషీ భయపడకుండా తిరగటం జరుగుతూవుంటుంది. అయితే పాముల్ని మింగే పాములూ, మనుషుల్ని మింగే మనుష్యులూ లేకపోలేదు. తన సందర్శనమే ఇతరులకు ఎంత బాధాకరంగావున్నదో సత్యం గ్రహించకపోలేదు. దానికతను చెయ్యగలిగిందేమీ లేదు. ఒకవిధంగా సత్యం ఇతరులని తప్పించుకుతిరగటానికి అదొక కారణం అవటమే కాక ఇతరులు అతన్ని డబ్బు అప్పుఅడగటం జరగటంకూడా ఇంకో కారణం! స్వరాజ్యం వస్తేగానికోశాధిపతులుగానూ, ఆర్థికమంత్రులుగానూ నియమింపనర్హులైన బద్రిగాళ్లు ఆ పరిసర ప్రాంతాలలో వుండటంవల్ల వారు వీథిమలుపుదగ్గిర అకస్మాత్తుగా సత్యం కనిపించగానే మరోవీధిగుండా పోవటానికి వీల్లేక సత్యాన్ని తప్పించుకోటానికి సూత్రం కనిపెట్టారు. అతనెలాగూ డబ్బు అడుగుతాడుగనక వాళ్లే ముందర అడిగితేసరి! డబ్బు అప్పు అడిగేవాడిని డబ్బు ఎలా అప్పుఅడగటం? వీథిమలుపునైనా కొంచెం ఎడంటంగా కనపడితే ఓ చిరునవ్వు పారేసి సత్యం తమని సమీపించేలోపల నడిచి పారిపోవచ్చు. అలాకాక ముఖాముఖి, బాహాబాహి ఎదురైతే అవతలవాళ్లు చచ్చారన్నమాటే! మొదట ఒకరిద్దరు తననే డబ్బు అడగటం చూచి సత్యం దిమ్మరపోయినాడు. వారేవుద్దేశంతో అతన్ని అడుగుతున్నారో అతనికి అనవసరం—తెలీదు. అతను డబ్బు ఇచ్చేస్థితిలో ఎప్పుడూ వుండడు. కాని ట్రాముకు చిల్లరడబ్బులు లేవనేవాడిని తప్పించుకోవటం ఎలా? వాడు సినిమాహాలునించి ఇంటికి నడిచిపోవాలిసివస్తుంది. అణా అవసరం మహామహులకుకూడా వస్తుందని సత్యానికి తెలుసు. అయితే సత్యాన్ని అణా అడిగిన మహామహుడు అవసరం వొచ్చికాదు అడిగింది—అవసరం తెప్పించుకుని! నలుగురితో సినిమాకెళ్లేటప్పుడు ఎక్కువడబ్బులు జేబులో వేసుకెళ్లినవాడికే క్షవరం అవటం జగద్విఖ్యాతం. అందుకని తనుమాత్రం—తన టిక్కెట్టుకు—ఖర్చు వేసికెళ్లితే ఆశరీరాన్ని మిగతావాళ్లు ఈడ్చి పారెయ్యలేకపోరు! ఇటువంటివాడి పాల్పడ్డాడు సత్యం. ఓసమయంలో ఒక అర్ధణా ఇచ్చినవాడిని సత్యం అనుదినమూ స్మరించటం, మనసారా తనకు అర్ధణాతో చేయూత ఇచ్చిన వ్యక్తిని ధ్యానించటం సత్యంఅనుభవంలోదిగనక అణావిలువ సత్యానికే తెలుసు. కొత్తగా బాగుకుందామని వూళ్లోకి దిగిన మరోవ్యక్తి సత్యంసంగతి తెలియక రూపాయిఅప్పు పుచ్చుకునిపోయినాడు వొకసారి. ఇచ్చే శక్తి లేదని చెప్పటానికి అతను మరీ కొత్తవాడు కావడంవల్ల సత్యం ఆరూపాయ ఇయ్యకతప్పలేదు! ఆరూపాయ తీసుకున్న వ్యక్తి అన్నిచోట్లా, అందరితోనూ తన ఆర్థికసూత్రాన్ని ప్రయోగించటం మామూలు. పరపతి లేకపోతే జీవితం దుర్భరమని, అనుభవంగా కాకపోయినా, గుర్తించిన మనిషి కావటంవల్ల పరపతి పుట్టటానికి "మంచివాడు"అనిపించుకోవటం అతిముఖ్యమని గ్రహించి డబ్బు అవసరం లేకపోయినా డబ్బు తీసుకుని రేపు, లేక ఎల్లుండి ఇస్తానని నిమిషం హెచ్చు తగ్గులేకుండా సరియైన టైముకు తిరిగి ఇచ్చేవాడు అతను! డబ్బు తీసుకుంటే మనం అడగక్కరలేకుండానే తిరిగి తెచ్చిఇస్తాడని ఆవ్యక్తికి అమోఘమైన పేరు—మీకు తెలియదేమో! తమాషా ఏమిటంటే అతనికి నిజంగా డబ్బు అక్కర్లేదుకనక పదిరూపాయలడిగి చివరకు రూపాయిఇచ్చినా తీసుకుపోతాడు! డబ్బు తిరిగి అడగక్కరలేకుండా ఇచ్చేస్తాడన్న పేరు అతను అవలంబించే సూత్రంలో ఒక ఆయువుపట్టు

అని ఎవరికీ తెలియదు. లోకంలో రివాజు ఏమిటంటే డబ్బు తీసుకున్నవాళ్లు అడిగితే తప్ప ఇయ్యకపోవటం. అలాంటివాళ్ల సిద్ధాంతం ఏమిటంటే "మన అవసరముండి మనం డబ్బు అడిగితీసుకున్నాం—వాళ్లకాడబ్బు మళ్లీ తిరిగి కావాలిసివుంటే వాళ్లు దాన్ని అడిగితీసుకుపోవటం డిమాక్రసీ—న్యాయం." అని. ఇంక కొంతమంది అడిగినా ఇయ్యరు. కొంతమంది ఇదివరకే ఇచ్చామంటారు! ఇలా అనేవాళ్ల వుద్దేశం కీడెంచి మేలెంచమని! పొరబాటున నాళ్లిదివరకే ఇచ్చేసివుండవచ్చునని, అటువంటప్పుడు అవతలవారికి జ్ఞాపకంలేక అడిగినంతమాత్రాన ఇస్తే మళ్లీ ఇయ్యటం అవుతుందికాని ఇంకేమవుతుంది? అవతలవాళ్లు ఘట్టిగా ఇయ్యలేదని చెబితే ఇచ్చేసెయ్యటానికి వీరి కెప్పుడూ అభ్యంతరం వుండదు. అందరూ కుండపగలగొట్టి డబ్బు తిరిగిఇయ్యమని అడగరుకనక వీళ్లు తిరిగి ఇయ్యకుండా తప్పించుకునే మొత్తాలు చాలా వుంటయి. పెద్దమొత్తాలతో చిక్కు ఎప్పుడూ వుండదుకనక తికమకలూ, ఎత్తుకు పై ఎత్తులూ చిన్న మొత్తాలలోనే. ఇక వాయిదాలూ మొదలైనవి వుండనేవున్నయి. డబ్బు అప్పుతీసుకున్న వాడు అప్పిచ్చినవాడు కనపడితే వాడే వీడిదగ్గిర అప్పు తీసుకున్నట్టుగా మాట్లాడటంమాట అటుంచి "నీదగ్గిర అప్పుతీసుకున్న సంగతి జ్ఞాపకం వుందిలే" అన్నట్టుగా అప్పిచ్చినవాడు కనపడగానే నవ్వి వెళ్లిపోవటంకూడా కద్దు. తలతిక్కతో తిరిగే వాడిని డబ్బు అడిగి తీసుకుని వాడు అడిగితే తప్ప తిరిగి ఇయ్యకూడదని నిర్ధారణచేసుకునేవాళ్లున్నారు. వాడు అడగడూ—మరీ మంచిది! ఒక వేళ వాడు అడుగుతాడూ-వాడి తలతిక్క అణిగిందని వీళ్ల వుద్దేశం! డబ్బు అడగటంకంటె తలతిక్కే ప్రాధాన్యంగా భావించేటట్టయితే వాడు అడగనే అడగడని వీరి విశ్వాసం.

ఏమైతేం, ఈ లోతుపాతులు తెలీని సత్యం ఇతరులు తన్ను డబ్బుఅడగటం చూచేటప్పటికి ఖంగారు పడ్డాడు. తిరిగి ఇచ్చేసినప్పటికీ అనేకమంది దగ్గిర అతను డబ్బు అప్పుఅడిగి తీసుకున్నాడు. చాలా కొద్ది మందికి చాలా చిన్న మొత్తాలు అతను అప్పు ఇచ్చాడు. ఎంతమొత్తమయినా అతను ఇచ్చే స్థితిలో లేడు. కర్తవ్యం సాధ్యమైనంతవరకు తప్పించుకు తిరగటమే — ఏకారణం వల్లనైనా సరే! అనేక మంది అనేకంగా అనుకున్నారు. వాళ్లు సత్యాన్ని ఎందుకు తప్పించుకు తిరుగుతున్నారో వాళ్లకి తెలియటమే కాక వాళ్లు అలా చెయ్యటం తప్పనిసరికనుక న్యాయం అనికూడా నమ్మేవాళ్లున్నారు. అయితే సత్యం వాళ్లని ఎందుకు తప్పించుకునితిరుగుతున్నాడో వారికి తెలియదు. మొదట్లో అసలతను తప్పించుకొంటున్నాడనికూడ తెలియదు! ఎదురుపడినప్పుడు అతను వీరిని చూడటం వీరు చూచినట్లయితే అదొరి వేరు. అతను వీళ్లని చూడనట్టుగానే వుండె—అక్కడా వీరి మనస్సు చివుక్కుమందె! అత నేమంత మహా ఇదని వీరినిచూడకపోవటం-చూస్తే వీళ్లు పారిపోవటం అటుంచుదాం! ఒక్కొక్కప్పుడు సత్యం నిజంగా వీళ్లని చూడకపోయినా వీరి కీబాధ తప్పలేదు. వీరనుకునే మాటలు సత్యందాకా రాలేదు. ఆడవాళ్లల్లోకి వచ్చేటప్పటికి చూచాయగా రాఘవమ్మకు అర్థంఅయింది. అసలు ఆవులిస్తే పేగులు లెక్కపెట్టేదని రాఘవమ్మకు ఓ ప్రఖ్యాతి మహిళలలో వుంది! వాళ్లు దాచిపెట్టటానికి ప్రయత్నించే విషయాలే రాఘవమ్మ గ్రహిస్తుందని ఆడవాళ్లు గ్రహించినప్పుడు ఇక వాళ్లు వొయ్యారంగా రాఘవమ్మకు తెలియపఱచాలనే వుద్దేశంతో చెప్పే పలుకులు రాఘవమ్మకు అర్థంకాకుండా ఎలా పోతై? నిజంగా రాఘవమ్మ ఆవులిస్తే పేగులు లెక్కపెట్టేటంతటి గండ్రకత్తె కాదు. కాని మరికి ంగా ఇరుగుపొరుగూ అమ్మలక్కల అభిప్రాయాలు వాసనేస్తుంటే ఏరాఘవమ్మ అయితేమటుకు గ్రహించకుండా ఎలా వుంటుంది? అయితే ఏవిషయమూ సత్యంతో చెప్పేది కాదు. అవతల ఇంటి డాక్టరుగారు అతన్ని గురించి అంతా ఏమనుకుంటున్నారోనని ఆయనపెళ్లాన్ని అడిగినట్టుగా సత్యం ప్రవర్తించకపోవటం చూచి సత్యం అంటే రాఘవమ్మకు ఎందుకో అభిమానం ఎక్కువయింది. ఆడవాళ్లల్లో అన్ని

కబుర్లూ వస్తయికాబట్టి ఆడవాళ్లు అనుకునే మాటలు వినాలని మొగవాళ్లు తహతహలాడటం సహజం! తాళంచెవి అక్కర్లేదని భార్యని పంపి, ఆ తాళంచెవికోసం ఆడవాళ్లున్న చోటికి ఈ మొగపురుసు వెళ్లగానే లోపలవాళ్లు కిచకిచలాడుకుంటున్నా బైట వున్న వనితారత్నం ఎనభైమైళ్ల వేగంతో లోపలికి పోయి "మీ ఆయన వచ్చాడు" అని చిదంబరరహస్యం చెప్పటం చూస్తే వాళ్లు పులకరించేవారున్నారు! అంతటితో ఆ కిచకిచలు ఆగి మరింతసేపటికి ఆయన భార్య వచ్చి తాళంచెవి ఇస్తే అదో ముచ్చట! ఇటువంటివి అనేకరకాలు అనేకవిధాల కొన్ని మొగపురుగులు చెయ్యటం చూచి, మధ్యమధ్య సత్యాన్ని చూచి ఆశ్చర్యపోతుంది రాఘవమ్మ. అయితే ఏవిషయమూ, ముఖ్యంగా ఇతరులు అతన్ని ఏవిధంగా అనుకుంటున్నారో కూడా చెప్పదు ఆమె. అందువల్ల ఆమెపాతివ్రత్యాని కేమన్నా లోటు వచ్చిందేమో తేల్చాలిసినవారు ధర్మజ్ఞులు. అసలు రాఘవమ్మ చెప్పేదేకాని కొంతమంది ఆడవాళ్లను చూచింతరువాత ఆమె వుద్దేశం మార్చుకుంది. ప్రతిచిన్నవిషయమూ భర్తతో చెప్పటం, ఆడంగిరేకులఅచ్చమ్మకు మల్లే భర్త అన్నివిషయాలూ ప్లీడరు సాక్ష్యాన్ని, రోగిగుణాల్ని పోగుచేసినట్టు పోగుచేసి "మీ అందరి సంగతీ నాకు తెలుసులే" అన్నట్టు తిరగటం చూచి రాఘవమ్మకు రోతగలిగింది. మొగవాళ్లల్లో తిరిగి ఆడవాళ్ల విషయాలూ, భాగ్యద్వారా ఆడవాళ్లల్లో తెలిసే మొగవాళ్ల విషయాలూ తెలుసుకోవటమే పరమావధిగా పెట్టుకుంటే బతికేదెలాగ! అయినా ఎవ్వరికీ తెలియని వేముంటయికనక!

అసలుసంగతి ఇటువంటి ఆలోచనలు కలగటానికీ, తెలుసుకోటానికీ సత్యానికి టైములేదు. ఇవన్నీ రాబడి అభివృద్ధిఅయినకొద్దీ చేసే పనులు, లేక చేసే ఏర్పాట్లు. సత్యానికి బొటాబొటీగానైనా సంసారం వెళ్లేటందుకు సంపాదించుకోగలిగితే చాలు అన్నయావతప్ప మరోటి లేదు. ఇక రాఘవమ్మ ప్రస్తుత సాంఘిక వాతావరణం తప్పించుకోలేని స్త్రీ. అయినా ఆమె సత్యానికిమల్లేనే తన దారి తాను చూసుకుంటున్నది. ఈ మహాసుడిగుండంలో ఈ భార్యాభర్తలు ఎవరికి వారుగా వుండి, మామూలు సంసారాలలో మామూలుగావుండే ఏకత్వం, ఒకొక్కప్పుడు ఇతరుల మెప్పుకోసం కన్పించే అన్యోన్యత, నిజంగా విరుద్ధంగా వుండి గుట్టుకోసం వ్యక్తంఅయ్యే గుంభనా సత్యం,రాఘవమ్మలమధ్య లేకపోయినప్పటికీ అనేకసంసారాలలో కంటె అన్నివిధాలా ఆదర్శమైన గుణగంభీరత్వం వారిద్దరిమధ్యా వుంది. రెండుకత్తులు ఒక అరలో ఇముడుతయ్యి అని రుజువుచేసేటట్టుగా వుంటుంది వారి కాపురం. వారిద్దరికీ ఒకరిమీద ఒకరికి నిజమైన అభిమానం వుంది. ఆ అభిమానమే వారికున్న ప్రేమని పైకి రానియ్యకుండాకూడా తొక్కేస్తున్నది. ఆ పరిస్థితులలో మనకు కావలిసినట్లుగా వారి ప్రేమను తావు లేదు.

౨

ఏనక్షత్రం ఏమార్పు చెందిందోకాని సత్యానికి వుద్యోగం దొరికింది. ఏకారణాలవల్ల వుద్యోగం దొరికినప్పటికీ వుద్యోగం ఇచ్చిన మేనేజరు సత్యానికి ఇంత తిండి దొరికేటందుకు వుద్యోగం ఇచ్చినట్టుగానే భావించినట్టు కనిపించాడు. యథార్థం అయితే కావచ్చునుకాని వుద్యోగధర్మంలో సత్యంలో చాలా లోపాలు కనిపించినై. అనేక స్తంభాలు పోటీపెట్టినటువంటి డేరావంటిదైనప్పటికీ, ఆఫీసులో ఏ ఒక స్తంభం తీసేసినా డేరాకు ప్రమాదం లేకపోయినప్పటికీ ప్రతిస్తంభానికీ ఓవిలువ వుంది. సత్యం కూడా మరిఒక స్తంభం! అయితే కొత్తబిచ్చం కావటంవల్ల పనిపట్ల అతని వుత్సాహం తోడివాళ్ళ ఛలోక్తులకు గురిఅయ్యేది. అతని వుత్సాహం లోపాలకిందికి మారింది. "నీపని నీవుచూసుకో" అన్న మేనేజరు తనకు సంబంధించని పని చెయ్యనందుకు సత్యాన్ని తప్పుపట్టాడు. సిపాయిదగ్గిర్నించి మేనేజరుదాకా సంబంధం వుందన్నాడు. ఇదంతా కుటుంబం అన్నాడు. ఏ ఒక్కడు తనకేమీ సంబంధం లేదన్నా పని జరగదన్నాడు. మళ్లీ కొన్ని విషయాలు సత్యా

నీకీ అనవసరం అన్నాడు. అన్నిపనులూ సత్యమే చేస్తే కడంవాళ్లెందుకన్నాడు. ఏపనిలో తను పూనుకోవాలో, ఏపనిలో తను వేలుపెట్టాలో సత్యానికి అర్థంకాలేదు. ఒక్కొక్కప్పుడు తనే మేనేజరుకు మల్లే ప్రవర్తించాలిసిన అవసరంకూడా వుంటుందని మేనేజరు సత్యానికి తెలియబరిచాడు. సత్యానికి తల తిరిగిపోతున్నది. "ఎందుకొచ్చింది — ఇంటికెళ్లి చక్కగా వుండు" అని కొంతమంది నంగనాచులు ఆకష్టాలన్నీ తాము అనుభవించాలిసిందేనన్నట్లుగా సలహాఇచ్చారు. ఏమైనా సత్యం ఎవ్వరినీ లెక్కపెట్ట దలచుకోలేదు. యాభైరూపాయలు ఎలా వదలుకోవటం?

సత్యం లెక్కవేశాడు. అతను చేరింది పదో తారీకు. ఆనెల ఇరవైరోజులకూ ముప్ఫయిరూపాయలుపైగా జీతం వస్తుంది. బ్రహ్మదేముడు వచ్చేది ఆనెలఖర్చు అంతకు మించకూడదు! సత్యం చేరక మునుపు పదిరోజులక్రిందనే చేరిన మరొకతనికీ, సత్యానికీ ఒకవిధమైన స్నేహం అయింది. ఇద్దరూ కొత్త పెళ్లికొడుకులు! అయితే అతనికి నెలజీతం పూర్తిగా వస్తుంది. రోజులు గడుస్తున్నకొద్దీ సత్యానికి ఓవిధమైన "ఇది" బైలుదేరింది. అతనెన్నడూ అంతవరకు వుద్యోగం చేసి డబ్బు గడించలేదు. రేపు, ఎల్లుండి— జీతంరావటం ఖాయం. సత్యం చేరిన ఆఫీసులో జీతాలు ఒకటోతారీఖున ఇస్తారుకాని కొన్ని ఆఫీసులలో మల్లే నెలఆఖరికే ఇయ్యరు. అయితే ఎంతముందర జీతం వస్తే అంతముందర ఖర్చుఅవుతుందని ఒకతను సత్యానికి వేదాంతం బోధించాడుకాని మళ్లీ జీతం ముందరే వస్తుందిగదా అని ఆ నీతిపరుడు గ్రహించినట్టు లేదు!

జీతం వచ్చేరోజున లెక్కవేసిపెట్టాడు సత్యం— ఎవరెవరికి డబ్బురూపకంగా ఎంత బాకో, బియ్యం, నెయ్యి ఇత్యాదులరూపకంగా ఎంతఖర్చు వుందో. జీతం వచ్చిన మర్నాడు అన్నీపోను ఆతనిదగ్గిర అయిదురూపాయలకన్న మిగలవు. దాంతో మళ్లీ నెల ఎలా గడుస్తుంది? మళ్లీ అప్పు తప్పదు. అయితే వుద్యోగి కావటంవల్ల అతనికి అప్పుఇయ్యటానికి ఎవరూ భయపడాలిసిన అవసరం లేదు. ఎంతో జాగ్రత్తగా జరిపితే ఒక ఏడాది అయేటప్పటికి సత్యం అప్పు చెయ్యకుండా, వచ్చేజీతంతో నెలగడపటానికి అవకాశం వుంది!

సత్యంఆఫీసులో జీతా లిస్తున్నారు. ప్రతివాడూ వెళ్లి జీతం తెచ్చుకోవాలి. పెద్దజీతగాళ్లు వాళ్ల జీతాల్ని తీసుకొని వెళ్లుతున్నారు. జీతం తీసుకునేవాళ్లల్లో సత్యంపేరు ఆఖరున వుంచటం న్యాయం! కొంతమంది జీతం తీసుకోగానే చెల్లించాలిసిన బాకీలు అప్పుడే చెల్లించివేస్తున్నారు. వసూల్లు చేసుకునేవాళ్లకు అప్పుడు వసూలుచెయ్యకపోతే మరి నెలదాకా ఆగాలని తెలుసు! సత్యంస్నేహితుడు డబ్బు తీసుకుని గుంపులోనించి వచ్చాడు. అతని పెదమలు తొట్రుపడుతున్నయి—అతనికి కొత్త జీతం పుచ్చుకోవటం. సిగిరెట్టు ఆతని పెదిమలమధ్య నిలవకుండావుంది.

"నీపేరు?" అన్నాడు ఎకౌంటెంటు.

"సత్యం?"

* * *

రాఘవమ్మ స్నానం చేసి అత్తిసగు పొయ్యిమీద పెట్టి, పిల్లవాడికి పాలుపట్టి నిద్రపుచ్చి కుంపటిని తాపీగా విసురుతూ కూర్చుంది సత్యం ఎప్పుడు వస్తాడా అని. వేళ కాలేదేమోనని అనుమానం వేసింది. కాని ట్రాములు తరచు ఆలస్యంగా రావటం రాఘవమ్మకు తెలియని విషయం కాదు. అయినా సత్యం వుద్యోగంలో ప్రవేశించిందిమొదలు ఏరోజూ అప్పటివరకూ రాకుండావుండలేదు. అన్నంగిన్నె దింపింది. రాఘవమ్మకు ఏమిటేమిటో ఆలోచనలు వస్తున్నయి. ఏడు, ఎనిమిది. తొమ్మిదిగంటలుకూడా దాటింది. రాఘవమ్మమనసులో ఓవిధమైన ఆందోళన బయలుదేరింది. ఎన్నిసార్లు పక్కింటివాళ్లను టైము అడుగుతుంది? ఆకలేస్తున్నది. కాని సత్యం రాకుండా

భోంచెయ్యటం ఎలా? అందులో అంత ముఖ్యమైన రోజున. దీపం తగ్గించి కొంగు చెరుగుపరుచుకుని పండుకుంది. ఏరోజునా, ఏకారణంవల్లా సత్యం అంత సేపటివరకూ రాకుండాపోలేదు. రాఘవమ్మ మామూలు స్త్రీయేకనక అయితే ఆపాటికి కనీసం రెండుఇళ్లకు వెళ్లి బావురుమని ఏడవాలిసిందే. కాని ఆమె మామూలు వ్యక్తికాదు. తన దుఃఖం అంతా వినియోగించాలిసినరోజులు ఇంకాముందు వున్నయ్యని ఆమెకు అనుమానం. సత్యం ఇంటికి రానందుకుకాదు ఆమె విచారం—ఆరోజున అంతవరకూ అతను రానందుకు! అది విచిత్రంగా కనిపించవచ్చునుకాని సత్యంభార్యగా రాఘవమ్మ అనుభవించిన జీవితానికి ఆస్థితి ఆఖరుమెట్టు. కొద్దిగా తుంపరపడుతున్నదేమో. ఆమె ఎక్కడికీ వెళ్లే స్థితిలోకూడా లేదు. అయినా భార్యలదగ్గిరనించి భర్తలు తమలపాకులు పుచ్చుకునే వేళ అది! రాఘవమ్మ ఏడిచేదేమోకాని ఆదుఃఖం ప్రశాంతంగా, నిశ్శబ్దంగా వుండకుండా గండితెగిన మహానదీప్రవాహంమల్లే బ్రహ్మాండమైన మోతతో తప్ప బైటపడేటట్టు లేకపోవటంవల్ల రాఘవమ్మ ఏంబాధ అనుభవించిందోకాని అంతదాన్నీ అణిచిపారేసింది! ఆమెకు నిస్త్రాణకూడా ఎక్కువఅయింది. ఎక్కడో ఒకటీ, రెండు—పదకొండు కొట్టింది గడియారం!

దభాలున తలుపు తెరుచుకున్న చప్పుడయింది. రాఘవమ్మ వులిక్కిపడి దీపం పెద్దదిచేసింది. తలుపు గడియవెయ్యటంకూడా మరిచిపోయివుండాలి! సత్యం మెల్లిగా లోపలికి వచ్చాడు. ఒక్కక్షణం అతన్ని చూచింది రాఘవమ్మ. అతని జుట్టు వానకు తడిసి చెదిరి చెంపలమీద పడుతున్నది. బట్టలు తడిసి వున్నయి. అతని నేత్రాలు మెరుస్తున్నయి. అతని నుదుట్లో, చెక్కిళ్లలో, పెదిమలలో దరిద్రదేవత సౌందర్యం అంతా దేదీప్యమానంగా ప్రకాశిస్తున్నది! రాఘవమ్మకు నఖశిఖపర్యంతమూ కొత్తరక్తం వరదలై ప్రవహించింది. అతను తలుపుగడియ వేసేటప్పటికల్లా ఆమె అతనిమీద విరుచుకుపడి అతని కంఠం కావిలించుకుంది.

రాఘవమ్మ ఏడుపు మాన్పటానికీ, ఆమె అతన్ని పెట్టుకునే ముద్దులసంఖ్య తగ్గించటానికీ ఎంతసేపు పట్టిందోకాని సత్యం చాలా ప్రయాసపడ్డాడు. రాఘవమ్మ అలా ముద్దుపెట్టుకోవాలంటే అత నాస్థితిలోకి రావాలన్నమాట! ఆమె అతనికి దూరంగా కూచోటానికే అంగీకరించలేదు. "ఇంత ఆలస్యంగా వచ్చారేం?" అంది రాఘవమ్మ.

"ఇంత బేజారయిపోయినావేం?" అన్నాడు సత్యం.

"ఇంక నేను ఇక్కడ వక్కక్షణం కాపురం చెయ్యలేను!" అంది దీనంగా.

"ఏం?"

"నేను ఏదీ బాకీ తీసుకురాను."

"అలాఅయితే ఎలా కుదురుతుంది?"

"మీ రేమవస్థపడుతున్నారో నాకు తెలియదు కాని ఈ బాకీలు చేసినందుకు నేను యాతన పడుతున్నాను!"

"అలా అనుకుంటే ఎలా!"

"ఇవాళ జీతం వస్తుందని తెలుసుగదా—డబ్బు అయితే ఇవాళే ఇయ్యగలంకాని బియ్యం ఇయ్యటానికి అవి కావాలికదా—ఆవిడ సాయంత్రమే బియ్యానికి వచ్చి కూచుంది! ఇదివరకు తీసుకున్న బియ్యం ఎప్పుడైనా ఎగగొట్టామా? ఇదివరకల్లా ఇచ్చినప్పుడే తీసుకుందికాని ఈరోజున, అంత వోపిక లేకపోవటం ఏమిటో?" అంది కొంచెం రోషంతో.

"అదా నీగోల! దరిద్రుడికి ఏదైనా ఇచ్చేవాళ్లు మళ్లీ రాదనుకునే ఇస్తారు. కాని మళ్లీ ఇయ్యగలడని తెలిసినప్పుడు ఆ ఇయ్యగలిగిన అవకాశంలోనే రాబట్టుకోవాలికాని సమయం దాటిపోతే అది రావటానికే వీలుండదు—అదీ రహస్యం!"

"మనకు జీతంగా వచ్చేది డబ్బుగాని బియ్యం, నెయ్యీ కావుగా! మరి వాటికోసం ఈరోజునే వచ్చి కూచుంటే అర్థం ఏమిటి?"

"బాకీవున్నదానివి నీకు ఈ ప్రశ్నలు వేసేటందుకు అధికారం లేదు. వాళ్ల యావ వాళ్లది. అడగటానికి వాళ్లకెప్పుడైనా అధికారం వుంది. దానికి నువ్వు తప్పుపట్టితే అర్థం ఏముంది?"

"దేనికైనా అర్థం వుండాలి. ఇన్నాళ్లనించి లేని తొందర ఈకాస్తలో దేనికి? బైటపడటం కాకపోతే?"

"బైటపడటం నువ్వా, వాళ్లా? బాకీలు చెయ్యటానికి అర్థంవుందేమోగాని బాకీలు చెల్లించటానికీ, చెల్లించమనటానికీ అర్థం అనవసరం."

"మనంకాబట్టి ఆవిడ అలా వచ్చి అడిగిందికాని డాక్టరుగారి పెళ్లాం అయితే అలా అడుగుతుందీ?"

"డాక్టరుగారి పెళ్లాం అసలు అప్పుచేస్తుందీ?"

"మంచిమాట—ఆవిడ అప్పుచేసేది బొగ్గులదగ్గిర్నించీ—మనమే నయం!"

"బొగ్గులకూ, బియ్యానికీ భేదం నీకు తెలియటం కొత్తగా వుంది! అయినా బొగ్గులు ఆవిడ ఇయ్యగలదు కాబట్టి ఇయ్యకపోయినా ఫరవాలేదు! మరి నువ్వు బియ్యం ఇయ్యలేవు. లేనిదానికోసమే ప్రజలు తహాతహ లాడటం సహజం. తర్వాత నువ్వు బియ్యం బాకీవున్నావని ఎన్నిసార్లు అయినా నీకు తెలియబరచటానికి వాళ్లకు అధికారం వుంది."

"మీమాటలు అర్థంకావు! తీసుకున్న బియ్యం ఎన్నడూ ఎగకొట్టలేదే?"

"ఎలా అర్థం అవుతయ్యి? ఈ రోజున నువ్వు యాభైరూపాయలు సంపాదించే గొప్పవాడి భార్యవయినావు. నే నింకా బాకీలు తీర్చేదాని భర్తనే!"

"అందుకనే నేను ఇక బాకీలు చెయ్యను."

"అది ఎలాగూ జరగదు. అయినా ఇదివరకెన్నిసార్లు వాళ్లడిగినా రోషంలేనిదానివి ఇవాళ ఇంతలో మారావేం?"

"ఆవిడ ఈసాయంత్రమె బియ్యానికి రావటం నాకు కష్టంగానే వుంది!"

"ఎందుకు? నీకు ఆ బాకీ తీర్చగలనని ధైర్యం వుండటం మూలాన. ఆ ధైర్యం లేనప్పుడు నీళ్లు నమిలేదానివి. వాళ్లకైనా నీవు తీర్చగలవని నమ్మకం చిక్కలేదు. ఆ నమ్మకం చిక్కినరోజున వాళ్లు నిన్ను అడగనేఅడగరు!"

"ఆరోజున నేను బాకీ చెయ్యను!"

"మరి రేపటినుంచే బాకీచెయ్యనంటుంటివి?"

రాఘవమ్మ ఆడఅహంకారానికి తృప్తి కలక్కపోగా హెచ్చవుతున్నది! ఆమె సత్యంవంక చూచింది. అతను మనస్సులో మాట బైటికి రానియ్యకుండా కేవలం తర్కంతో ఆమెను ఏడిపిస్తున్నట్టు ఆమెకు అనుమానం కలిగింది. కాని సత్యం సత్యప్రమాణకంగా సత్యస్వరూపంతో కనపడ్డాడు ఆమెకు. అతని మొఖంలో ఏవిధమైన కల్మషమేఘాలూ కనిపించలేదు ఆమెకు. సత్యానికికూడా రాఘవమ్మ అంటే ఓవిధమైన ఆశ్చర్యం కలిగింది. భర్తలు స్వయంగా జీవనాధారం చేసుకోలేకపోతే భార్య భర్తకన్న ఎన్నివేలరెట్లు ఎక్కువ బాధపడుతుందో అతనికి అర్థంఅయింది. భర్త స్వంతంగా జీవించగలిగిన రోజున ఆడదానిలో కలిగే మార్పుకూడా అతనికి అర్థంఅయింది. భర్త కానీ సంపాదించినా ఆడదానికి ఎంత అహంకారమో! ఇక వందలూ వేలూ సంపాదించే భర్తలు గల భార్యలు అహంకారంతోటే నిద్రపట్టకుండా మసలుతారంటే ఆశ్చర్యం ఏముంది? పైగా రాఘవమ్మవంటి అందంగల ఆడదానికి ఎంత అహంకారమైనా వుండటానికి అర్హతే వుంది! అది బైటికిరాకపోవటానికి సత్యమే కారణం. అతను భార్యను ముద్దుపెట్టుకున్నాడు!

"అయితే వీరు బాకీఇయ్యగలరని ధైర్యం వుండబట్టేనా ఆయన మిమ్మల్ని ఇన్నాళ్లనుంచీ బాకీతీర్చమని అడగనిది?" అంది రాఘవమ్మ ఎగతాళిగా. సత్యంమొఖంలో మార్పు వచ్చింది.

"నన్ను ఎంతమంది ఎన్నిసార్లు అడిగారో నీకు తెలియదు. కాని నన్ను అడగనివాళ్లా ఆయన వొక్కడే.

అది తలుచుకుంటే నాకే ఆశ్చర్యం వేస్తుంది. నేను ఆయనబాకీ ఇయ్యగలనని ధైర్యమో, లేక ఇయ్యక పోయినా ఫరవాలేదని సంతృప్తో చెప్పలేంకాని నన్ను ఇంతవరకూ అడగనిది ఆయన వక్కడే. కడంవాళ్లు అడక్కపోయినా నేను బాకీవున్నానని మాటల్లో అన్నా వాసనచూపించేవారు. ఎందుకంటే, బాకీ వున్నవాడికి బాకీఇచ్చినవాడికంటె తెలివిగా వుండ టానికీ, మాట్లాడటానికీ అర్హత లేదు! వాళ్లకన్న మనం ఏ విషయంలోనైనా తెలివిగా వుంటే మనం వాళ్లకి బాకీవున్నామని జ్ఞాపకంవస్తుంది. బాకీవుండి కూడా తెలివిగావుండటం క్రూరం. అందుకనే ఆబాకీ అడిగితే వాడి తెలివితేటలూ, తిక్కా అన్నీ దారి కొస్తయ్యని గ్రహించి బాకీచెల్లించమని అడుగుతారు. ఇంక వీడు ఏమొహం పెట్టుకుని తెలివిగా వుండ గలడు? కాని ఆయనదారి వేరు. నాదరిద్రంతో నన్ను పరాభవిద్దామని ఆయ నెప్పుడూ ప్రయత్నం చెయ్యలేదు. అలాంటివారు అయినవాళ్లల్లోకూడ వుండరు!"

"అయినా మీ రింతఆలస్యంగా వచ్చారేం—నా కెంత ఏడుపొచ్చిందో తెలుసునా?"

"నేను ట్రాములో రాలేదు—నడిచివచ్చాను!"

రాఘవమ్మ లేచికూచుంది.

"అదేమిటే?"

"ట్రాములో రావటానికి నాదగ్గిర డబ్బులు

"మీజీతం ఏమైంది?"

"నాకు జీతం రాలేదు."

"జీతంరాలేదూ—"

"నాపేరు ఇంకా జీతాలుఇయ్యాలిసినపట్టీలో చేరలేదు. రేపుగాని జీతంరాదు!"

"అయితే ఈ అయిదుమైళ్లూ ఈవానలో తడిసి నడిచివచ్చారా?" అంది రాఘవమ్మ. సత్యం నిబ్బ రంగా తలవూపటం చూచి ఆమెకు కళ్లవెంట నీళ్లు తిరిగినై.

"అయితే ఈబాకీలు రేపు చెల్లించలేమన్న మాట!"

"ఎల్లుండి!"

"ఆవిడ మళ్లీ తెల్లారకముందే వస్తుందేమో!"

"రానియ్యి—మనం చేసేదిలేదు."

"నేనుమటుకు ఆవిడముఖం చూడలేను బాబూ—మీ కో నమస్కారం!"

"నాకు నమస్కారం పెట్టి ప్రయోజనంలేదు."

"నేను చెప్పేది నమ్మక ఆవిడ ఏం విసుక్కుని కేకలేసుందో?"

"అంతగా కేకలేస్తే 'మీఇంట్లో వండుకోటానికి ఈపూట బియ్యం లేవా' అని అడుగు!"

"బాగుంది! వాళ్లింట్లో వుంటేనేం, లేకపోతే నేం! మనం బాకీవున్నప్పుడు వాళ్లకి అడగటానికి అధి కారం వుందని మీరేగా అన్నారు?"

సత్యంతాతకూడా దానికి సమాధానం చెప్ప లేదు!

"పోనీలెండి—ఎలాగో తంటాలుపడతాను—రేపైనా జీతం వస్తుందా?" అంది రాఘవమ్మ నోట మాట లేకపోవటంచూచి.

"రేపు వస్తుందని అన్నారు!" అన్నాడు సత్యం.

రాఘవమ్మ బేజారయిపోయింది.

"నిజంగానా, నన్ను ఏడిపిస్తున్నారా? నిజంగా జీతంరాలేదూ?" రాఘవమ్మ సత్యంజేబులు తడివి చూచి బేడాకాసు బైటికితీసింది.

"అబద్ధాలు చెప్పి నీతో శృంగారం వెలిగించటానికి నేనేం కవిననుకున్నావా, లేక కథకుణ్ణి అనుకున్నావా?"

రాఘవమ్మ నోట మాట లేదు.

"పోనీ, ఈ జేడా పెట్టి ట్రాములో రాలేక పోయారూ?"

"ఆ జేడా ఖర్చుచేసి రేపు ఆఫీసుకు నడిచి పొమ్మన్నావా?"

రాఘవమ్మ ఒక్క క్షణం భర్తను చూచి వెర్రిగా అతని వళ్ళోకి చేరగిలబడిపోయింది. వాళ్ళిద్దరి ఆకలీ, అభిప్రాయాలూ, దేహాలూ పరిపూర్ణత్వం చెందినై!



# బిరుదములు

— శ్రీ రావూరి దొరసామిశర్మ —

భారతి అక్టోబరు నెల సంచికలో శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు "ఎవఁడు కవి - ఏది కావ్యము" అను వ్యాసమున నీక్రిందిరీతి వ్రాసియున్నారు:

"నన్నయార్యుఁడు మొదలుగా పోతనార్యుని వఱకు మహనీయు లెందఱో యున్నారు ... అవకాశ మున్నను వారు పోషక ప్రభువులవల్ల బిరుదులు గైకొన్నవారు కారు. అట్టివారికి బిరుదు లెందుకు? వారి పేరే బిరుదు. శ్రీనాథుఁడొకఁడు కప్పనిసరి యనుటచే గౌడడిండిమభట్టునంచు ఢక్క పగులఁగొట్టించి, దేశమంతట నెలసినాఁడుకాని, యతఁడైనా, తన కవిత్వశక్తికి మెచ్చి చంద్రశేఖరక్రియాశక్తిరాయలు నిండు పండితకవిసభలో నిచ్చిన కవిసార్వభౌమబిరుదము పరిగ్రహించి యొక చాటుపద్యములో నొకమాఱు స్మరించినాఁడే కాని దానిని బుజాన వేసికొని యూరేగలేదు. అరుగుచున్నాఁడు శ్రీనాథుఁ డమరపురి కన్నాఁడుగాని పోవునపుడు తూడాపట్టుకొనిపోవుట కుద్యమించలేదు. అల్లసాని పెద్దనార్యుని యాంధ్రకవితాపితామహబిరుదము నట్టిదే" (భారతి, పుటలు ౩౦౮-౩౦౯)

కవులకు బిరుదములు సాధారణముగాఁ బోషక ప్రభువులుగాని, మహాపండితులుగాని వారి కవితాశక్తికి మెచ్చి యిచ్చునవి. కేతన దశకుమారచరిత్రమును వ్రాసి తిక్కనను మెప్పించి 'అభినవదండి'యని బుధజనములచేత భువిఁ బేరుగొన్నవాఁడు. చంద్రశేఖరక్రియాశక్తిరాయలు శ్రీనాథునకుఁ గవిసార్వభౌమబిరుద మొసఁగెనుగదా! అనంతామాత్యుని ముత్తాతయగు బయ్యనమంత్రికి నాతని కవితాశక్తికి మెచ్చి తిక్కన సోమయాజియే 'భవ్యభారతి' బిరుదము ప్రసాదించియున్నాఁడు. ఇట్టి బిరుదులను గవులు తమ కృతులలోను, చాటుపద్యములలోను జెప్పియుండుటచే మన మిపాఁ డెఱుంగుచున్నారము.

నన్నయభట్టు భారతావతారికలో 'విపులశబ్దశాసన' బిరుదమును జెప్పుకొన్నాఁడు. మఱియు నాంధ్రశబ్దచింతామణిగద్యలో 'సకలభాషా వాగనుశాసన' అనియు, భారత ప్రత్యాశ్వాసాంత ... లో 'సకలసుకవిజనవినుత' అనియు వ్రాసికొన్నాఁడు. ఇవి నన్నయ బిరుదులని చెప్పికొన్నాఁ డనుటకు నిదర్శనములు గావా?

ఇఁకఁ దిక్కన నిర్వచనోత్తర రామాయణ, భారతములలో 'ఉభయకవిమిత్ర' బిరుదమును వ్రాసికొనియే యున్నాఁడు. మఱియు నిర్వచనోత్తర రామాయణారంభమున 'అమలోదాత్తమనీష నే నుభయకావ్యప్రౌఢిఁ బాటింపఁ శిల్పమునం బారగుఁడ' నని యుభయకవిమిత్ర బిరుదము ప్రకారాంతరముచే విరచితమైయున్నది. ఇతనికిఁ గవిబ్రహ్మ బిరుద మున్నట్లు ప్రసిద్ధిగలదు. అది యీతని కాలములో నొసఁగఁబడినదిగాఁ గన్పడలేదు. తిక్కనశిష్యుఁడగు మారనగాని, యితనిని గృతిపతిఁ గావించిన కేతనగాని యుభయకవిమిత్ర బిరుదమును బేర్కొన్నారేకాని కవిబ్రహ్మ నామమును సూచింపనైనా లేదు. "తన కావించిన సృష్టి తక్కొరులచేతం గాదు నా నేర్పుముఖంబునఁ దాఁ బల్కిన పల్కు లాగమములై పొల్పొందు నా వాణి నత్తను నీతం డొకరుండు నాఁ జను మహత్త్వప్రౌఢిం 'కవిబ్రహ్మ' నా వినుతింతుం గవితిక్కయజ్వ నఖిలోర్వీదేవతాభ్యర్చితున్" అను నెఱ్ఱాప్రెగ్గడ హరివంశము

లోని పద్యమువలన కవిబ్రహ్మబిరుదు తిక్కన కెఱ్ఱనయే యొసఁగినదని తెలియుచున్నది. కాన దీనిని తిక్కన చెప్పికొనలేదని సందేహింప నక్కఱలేదు.

ఎఱ్ఱనయుఁ "ప్రబంధపరమేశ, శంభుదాస" బిరుదములను దన కృతులయందుఁ దెలిపియున్నాఁడు.

నాచనసోమన యుత్తరహరివంశ గద్యలో "శ్రీమత్సకలభాషాభూషణ సాహిత్యరసపోషణ సంవిధానచక్రవర్తి సంపూర్ణకీర్తి నవీనగుణసనాథ" అను బిరుదులను వేసికొనియున్నాఁడు. ఇట్టి బిరుదముల వంటి విశేషణములు సోమన కగ్రహార మొసఁగిన విషయమును ప్రకటించు బుక్కరాయల శాసనమునను గలవు.

కడకు పోతనామాత్యుఁడును 'సహజపాండిత్య' బిరుదమును దగిలించుకొన్నాఁడు.

ఇట్లు కవులు తమ బిరుదములను గ్రంథములందుఁ జూపియున్నారు. ఈ బిరుదులు తమ కెవరిచ్చిరో యనుట యెవరో యొకరిద్దఱుదప్ప నెల్లరు చెప్పిన వారు గారు. నన్నయ మొదలుకొని పోతన్నవఱకు బిరుదములు గైకొన్నవారే యున్నారు.

ఇఁక శ్రీనాథవిషయమును గొంత పరికింతము. "కవిసార్వభౌమబిరుదము పరిగ్రహించి యొక చాటుపద్యములో నొకమాఱు స్మరించినాఁ"డిత్యాదిగా శాస్త్రులవారు వ్రాసిరి. శ్రీనాథున కనేకబిరుదములుగలవు. పెదకోమటి వేమభూపాలకాస్థానమున విద్యాధికారోద్యోగమున నున్నవాఁడుగాన 'సకలవిద్యాసనాథ' బిరుదమును నైషధమునఁ జేర్చుకొన్నాఁడు. 'విద్యాధికారి' శబ్దము శ్రీనాథరచితశాసనములందెల్లను గానవచ్చుచున్నది. (చూ : శృంగారశ్రీనాథము)

హరవిలాసమున 'సకలవిద్యాసనాథ' పదమును మార్చి 'సుకవిజనవిధేయ' పదము చేర్చుకొన్నాఁడు. కాని తత్కృతిపతి (అవచితిప్పయప్రభుఁడు) కవిని గూర్చి చెప్పుపద్యములో 'కమలనాభుని పౌత్రుఁ గవితామహారాజ్యభద్రాసనారూఢు' నని వెలయుచున్నది. హరవిలాసరచనాకాలమున కతనికిఁ గవిసార్వభౌమబిరుదము సంభవింపలేదు. కాన, "కవితామహారాజ్యభద్రాసనారూఢ" శబ్దమునకుఁ 'గవిరా' జని యర్థము చేసికొనవలయునేమో! 'కవిరాజ' బిరుదము నైతము శ్రీనాథునకుఁ గలదు.

"హా జలజాక్షి హా కిసలయాధర........
రాజమహేంద్రవీథిఁ గవిరాజు ననుంగికరించి"

"కవిరాజుకంఠంబుఁ గౌఁగిలించెనుగదా
పురవీథి నెదురెండఁ బొగడదండ"

ఇత్యాదిచాటువులలోఁ 'గవిరాజ' బిరుదము గానవగును.

డిండిమభట్టుకంచుఢక్కను బగులఁగొట్టించి కవిసార్వభౌమబిరుదమును గాంచకమున్నె యాడిండిమభట్టును దర్శింపనేఁగిన శ్రీనాథుఁడు "తరువున గాండివంబిడఁడె! ధర్మజునానఁ గిరీటి, యేను వాక్సరసిజనేత్రయానతి విచారముచొప్పున గర్వహీనతన్ మరలి తెనుంగుభూమి కసమానగతిం గొనిపోవువాఁడనై బిరుదులు నారివాఁగుకడఁ బెట్టితి సత్కవిసార్వభౌముఁడన్" అను పద్యమునఁ దాను గవిసార్వభౌమబిరుదభూషితుఁడని యుద్ఘోషించియున్నాఁడు (చూ: శృంగారశ్రీనాథము)

'దీనారటంకాల తీర్థమాడించితి' అను పద్యమున 'చంద్రశేఖర క్రియాశక్తిరాయలయొద్దఁ బాదుకొల్పితి సార్వభౌమ బిరుదు' అని శ్రీనాథుఁడు చెప్పికొన్నాఁడు. ఈపద్యము శ్రీనాథుఁడు సర్వజ్ఞసింగభూపాలుని దర్శింపనేఁగినప్పుడు శారదాదేవిని గూర్చి స్తుతించిన సందర్భమునఁ జెప్పఁబడినది.

కవిసార్వభౌమ బిరుద ప్రాప్త్యనంతరము రచించిన గ్రంథమగు కాశీఖండమున నీబిరుదు పెక్కుమార్లు చెప్పఁబడియెను.

కాశీఖండము—"ఈక్షోణి న్నినుఁబోలు సత్కవులు వే రీనేఁటికాలమ్మునన్......అధ్యక్షించుఁ గవిసార్వభౌమ! భవదీయప్రౌఢ సాహిత్యమున్."

కాశీఖండ గద్యమందు "కవిసార్వభౌమ శ్రీనాథ నామధేయప్రణీత" మని కలదు.

మఱియు శ్రీనాథవిరచితములగు రసికాభిరామములోను, శివరాత్రి మాహాత్మ్యములోను గవిసార్వభౌమ బిరుదు గలదు.

పల్నాటి వీరచరిత్రమందు నీక్రిందిరీతిగాఁ గలదు:

"ఘనుఁడైన శ్రీనాథకవిరాజరాజు
చెన్నుని కృపచేతఁ జిత్తముప్పొంగి
బాలుని విక్రమప్రౌఢి యెంతయును
విరచించె జనులకు విశదంబుగాను."

కవిరాజరాజనఁగాఁ గవిసార్వభౌముఁడే కదా. 'అక్షయ్యంబుగ సాంపరాయని తెలుంగాధీశ కస్తూరికా భిక్షాదానము సేయరా సుకవిరాడ్బృందారక స్వామికిన్' అను చాటువులోనను గవిసార్వభౌమ బిరుదము ప్రకారాంతరముచే నుక్తము.

సరి, ఇవంతయు నిట్లుండ నిండు.

'అరుగుచున్నాఁడు శ్రీనాథుఁ డమరపురి' కన్నాఁడుగాని పోవునపుడు కూడాపట్టుకొనిపోవుట కుద్యమించలేదఁట!

అవసాన కాలమున శ్రీనాథుఁడు చెప్పిన పద్యములు రెండు.

(౧) "కవిరాజు కంఠంబుఁ గౌఁగిలించెనుగదా
పురవీథి నెదురెండఁ బొగడదండ
సార్వభౌముని భుజాస్తంభ మెక్కెనుగదా
నగరివాఁకిట నుండు నల్లగుండు
వీరభద్రారెడ్డి విద్వాంసు ముంజేత
వియ్యమందెనుగదా వెదురుగొడియ
ఆంధ్రనైషధకర్త యంఘ్రియుగ్మంబునఁ
దగిలియుండెనుగదా నిగళయుగము
కృష్ణవేణమ్మ గొనిపోయె నింతఫలము
బిలబిలాక్షులు తినిపోయెఁ దిలలు పెసలు
బొడ్డుపల్లెను గొడ్డేరి మోసపోతి
నెట్టు చెల్లింతుఁ దంకంబు లేడునూర్లు?"

(౨) కాశికావిశ్వేశుఁ గలసె వీరారెడ్డి
రత్నాంబరంబు లేరాయఁ డిచ్చు
రంభఁ గూడెఁ దెనుంగురాయ రాహుత్తరాజు
కస్తూరి కేరాజుఁ బ్రస్తుతింతు
స్వర్గస్థుఁ డయ్యె విస్సనమంత్రి మఱి హేమ
పాత్రాన్న మెవ్వాని పంక్తిఁ గలదు
కైలాసగిరి పండె మైలారవిభుఁ డేఁగి
దినవెచ్చ మేరాజు దీర్పఁగలఁడు
భాస్కరుఁడు మున్నె దేవుని పాలి కరిగెఁ
గలియుగంబున నిఁక నుండఁ గష్టమనుచు
దివిజకవివరు గుండియల్ దిగ్గురనఁగ
నరుగుచున్నాఁడు శ్రీనాథుఁ డమరపురికి"

శాస్త్రిగారు చెప్పిన 'అరుగుచున్నాఁడు శ్రీనాథుఁ డమరపురికి' నను పాదము రెండవ పద్యములోనిది. ఆహా! పోవునప్పుడుకూడ నెంతతెలివి, ఎంత గాంభీర్యము, ఎంత పాండిత్యోద్ఘాటనము? సామాన్య బిరుదమును జెప్పకొనుటకన్న నిది పైమెట్టు. శాస్త్రిగారు మొదటిపద్యము పోవుకాలమునఁ జెప్పినదైనను దానిని గ్రహింపక మానిరి. అందు కవిరాజ, కవిసార్వభౌమ బిరుదములు రెం డున్నవిగదా! పోవునప్పుడు కూడా పట్టుకొనిపోవుట కుద్యమించినట్లే కనఁబడుటలేదా?

శ్రీనాథుఁడు తన బిరుదులను గ్రంథములందును, చాటువులందును పెక్కెంట బాహాటముగాఁ జెప్పికొన్నాఁడని స్పష్టపడుచున్నది. దీనినిబట్టి శాస్త్రిగారి పై వాక్యములు నిరాకరములనుట సాహసోక్తి గాఁజాలదు.

ఇఁక మిగిలిన కడపటియాతఁ డల్లసాని పెద్దన. ఇతఁడుగూడ మనుచరిత్రయందు "హితుఁడవు చతురవచోనిధి వతులపురాణాగమేతిహాస కథార్థస్మృతి యుతుఁడ వాంధ్రకవితా పితామహుఁడ వెవ్వ రీడు పేర్కొన నీకున్" అను పద్యములోను, కృష్ణరాయల మరణానంతరము చెప్పిన 'ఎదురైనచోఁ దన

మదకరీంద్రము నిల్పి' యను సీసములో 'ఆంధ్రకవితాపితామహ యల్లసాని పెద్దనకవీంద్ర యని నన్నుఁ బిలుచునట్టి కృష్ణరాయలతో' నను గీతభాగములోను దన బిరుదము దెలిపికొన్నాఁడు. శాలివాహనశకము ౧౪౪౦ నాఁటి కోకటశాసనములోఁ బెద్దన కాంధ్రకవితా పితామహబిరుదము చేర్పఁబడియున్నది.

ఇఁకఁ దెనాలిరామకృష్ణాదులగు తరువాతి కవుల విషయములు దడవనక్కఱలేదని నామతము. మనకుఁ బ్రస్తుతలభ్యమానాధారములనుబట్టియే యిన్ని లభించినప్పుడు మనకు దొరకని, తెలియని గ్రంథ చాటుపద్యకథాదికములలో నెన్ని కలవో?

ఆయాయి కవికి నేవిధముగానో లభించిన బిరుదములను నవకాశము గలయప్పుడెల్లఁ జెప్పికొనుట యొక కొంత గాఁజాలదనియు, నది యాత్మస్తుతి యనిగాని, గర్హ్యమనిగాని భావింపరాదనియు విజ్ఞులకు విన్నవించుచున్నాను.






# — the time factor



కీప్‌సేక్ - క్రొత్త ఆకారం

వెస్టు ఎండ్ పేటెంట్ యెవర్ బ్రైట్‌స్టీల్ రు. 60/-లు.

ప్రతి 'వెస్టు ఎండ్' గడియారమునకు వెనుక, ప్రత్యేకంగా యిండియాకు సరిపడే డిజైనులో వుత్తమమైన గడియారాలను చేసేవారమని మా 75 యేండ్ల అనుభవం గ్యారంటీగా వుండగలదు.

## వ్యాపారములో
## కాలము విలువ

ఆఫీసులో, ఫ్యాక్టరీలో, మిల్లులో, నిజానికి జీవితానికి సంబంధించిన వ్యాపార, పారిశ్రామిక వృత్తిలో, కాలముముఖ్యమైనది. ఒక పనిచేయటానికి టైము, డెలివరీచేయటానికి టైము, ప్రతిపనీ అనుకున్నప్రకారం శాంతంగా జరిగిపోవాలి - యజమాని అయినప్పటికి నౌకరు అయినప్పటికి ప్రతివానికి ఒక గడియారం అత్యావసరం. నమ్మకంగా పనిచేయాలని కోరేవారికి 'వెస్టు ఎండ్' సరియైన గడియారం. ప్రతివారికి నచ్చేలాగు అందుబాటులో వుండేలాగు, అన్ని మాడల్సు త్వరలో లభించగలవని ఆశిస్తున్నాము.

వెస్టు ఎండ్ వాచ్ కంపెనీ.
బొంబాయి & కలకత్తా.

# WEST END WATCH Co.

BOMBAY CALCUTTA

# తిక్కన ఐతిహ్యము

శ్రీ నండూరి రామకృష్ణమాచార్యులు =

"అక్కన్న బయ్యన్న లధిక బలిష్ఠు
లక్కట సిద్ధిరాయని బారదోలి
దక్కిన రాజ్యంబు దామె యేలుచును"
[సిద్ధేశ్వరచరిత్రము]

అక్కన్న బయ్యన్నలు మనుమసిద్ధి మహారాజు రాజ్యము నాక్రమింపగా మంత్రియైన తిక్కన కాకతి గణపతిదేవచక్రవర్తిఆస్థానమున కేగి తాను రచించిన భారతమును చదివి వినిపించి ఆ రాజును మెప్పించి అతని సహాయమువలన మనుమసిద్ధి మహారాజును రాజ్యమున పునః ప్రతిష్ఠితు నొనర్చెనని ఐతిహ్యము వలన తెలియుచున్నది. పూర్వోదాహృతములైన సిద్ధేశ్వరచరిత్రలోని ద్విపదపంక్తులును ఈ ఐతిహ్యమునకు దోహదమొసగుచున్నవి. ఈ విషయమునే 'సోమదేవరాజీయము'లో కూచిమంచి జగ్గకవికూడ ప్రస్తావించినాడు. గణపతిదేవుడు తిక్కనమహాకవికి "అతిథిపూజ లొనర్చి యతనిచే భారతార్థమును, ద్వైతాద్వైత తత్త్వములును" తెలిసికొనెనని చెప్పినాడు

గణపతిదేవ చక్రవర్తి క్రీ.శ. ౧౨౬౧ సం. వరకు రాజ్యముచేసినట్లు శిలాశాసనములవలన తెలియుచున్నది. కాని ఆ నాటికి తిక్కన సోమయాజియై యజ్ఞముచేసినట్లుగాని, భారతము రచించినట్లుగాని ఊహించుటకు వీలులేదు. కావున శ్రీ వీరేశలింగము పంతులుగారు "అందుచేత సోమదేవ రాజీయాదులందు చెప్పబడిన భారతశ్రవణకథ కవికల్పిత మనుటకు సందేహములేదు" అని వ్రాసినారు. కాని, చారిత్రికముగా చూచిన, ఇట్లు ప్రాచీనమైన సిద్ధేశ్వరచరిత్రాదులలోని కథనమును, పరంపరాగతమైన ఐతిహ్యమును త్రోసిపుచ్చుటకు వీలులేదు.

మనుమసిద్ధి చరిత్రలో తెలుగుచోడులని ప్రసిద్ధికెక్కిన వంశమునకు చెందినవాడు. మధురాంతక పొత్తపిచోడ, గండగోపాల మున్నగునవి వీరికి వంశక్రమానుగతమైన బిరుదునామములు. వీరు దక్షిణదేశమునకు పాలకులైన చోళులకు సామంతులై రాజ్యము చేసినట్లు వీరి శిలాశాసనములవల్ల తెలియుచున్నది.[1] మనుమసిద్ధిమహారాజుతండ్రి తిక్కనృపతి. తిక్కనృపతి వీరుడు. నిజపరాక్రమమున రాజ్యమును విస్తరించెను. శంభురాజును నిగ్రహించి కాంచిని గైకొనెను. చోళరాజునకు సాయముచేసి 'చోళస్థాపనాచార్య' యని ప్రశస్తిబడసెను.[2] తిక్కనృపతిశిలాశాసనములు కాంచీపురమునగూడ కన్పించుచున్నవి.[3] ఈ తిక్కనృపతి ఆస్థానమున పెక్కండ్రు కవీశ్వరు లుండెడివారని తెలియుచున్నది. తిక్కనతండ్రియైన కొమ్మన తిక్కనృపతికి మంత్రి యని యూహింపవచ్చును. దశకుమారచరిత్రములో తిక్కన మనుమసిద్ధిరాజ్యమున నిజకులక్రమాగతమైన మంత్రిపదవి నధిష్ఠించినా డను కేతన పల్కులు దృష్టాంతము.

ఆ కాలమున దేవాలయముల పేరులు రాజనామాంకితము లైనవి కన్పించుచున్నవి. ప్రాచీనకాలములో వెలసిన భీమేశ్వరాలయము, మనుసిద్ధేశ్వరాలయము మున్నగునవి ఏ తత్కాలములోని రాజుల నామములను సూచించుచున్నవి. తిక్కనకవి, తిక్కయజ్వగా ఆంధ్రకవితాలోకమున ప్రశస్తివహించిన ఈ

౧. 582 of 1907

౨. నిర్వచనోత్తర రామాయణము.

3. 34 of 1893

మహాకవి నామము నీ తిక్కనృపతిపేరున వెలసినదని నేనూహించుచున్నాను. తిక్కయజ్వతండ్రి కొమ్మన మంత్రి దక్షిణాపథరాజ్యరంగమున పరాక్రమవైభవ ప్రాభవముచే ప్రకాశించుచున్న తన రాజుగారి పేరును తన కుమారునకు పెట్టెననుటలో విప్రతిపత్తి లేదు.

తిక్కనృపతి క్రీ. శ. ౧౨౫౪ సం. వరకు రాజ్యమునేలెను.౪ అతని తరువాత మనుమసిద్ధి రాజ్యమునకు వచ్చెను. మనుమసిద్ధిశాసనములు క్రీ. శ. ౧౨౫౬ నుండియు కన్పించుచున్నవి.౫ కావున నిర్వచనోత్తర రామాయణ కృతికాలము క్రీ. శ. ౧౨౫౬ తరువాత నని ఊహింపవచ్చును. ఈ విషయమునే నిర్వచనోత్తర రామాయణములోని అంతరంగిక సాక్ష్యములను బట్టికూడ నిర్ణయింపవచ్చును. తిక్కన అవతారికలో కృతిపతియగు మనుమసిద్ధి విజయపరాక్రమములను వర్ణించినాడు. అందు పేర్కొనిన విషయములను కవి కాలానుక్రమముగ కూర్చినట్లు తోచుచున్నది. అందు చివర "శృంగారంబు నలంగదేమియును ......... సారంగుతో దోలి తురంగముతో నోనిన సంగ్రామంబునన్"......... అని వర్ణించినాడు. ఇందు పేర్కొనిన సారంగుడు అద్దంకిసీమకు పాలకుడు. శిలాశాసనములలో 'సారంగపాణి' అని కానవచ్చుచున్నది. ఇతడు మాధవనాయకుని కుమారుడు. మాధవ నాయకుని అనంతరము సింగళదేవమహారాజు క్రీ. శ. ౧౨౫౪ సం. వరకు రాజ్యము చేసెను.౬ సింగళదేవమహారాజు అనంతరము సారంగపాణి రాజ్యమునకు వచ్చెను. క్రీ. శ. ౧౨౫౫ సం.లో సారంగుని శాసనములు కన్పించుచున్నవి.౭ కావున ఈ సారంగుని పేర్కొనిన నిర్వచనోత్తర రామాయణము క్రీ. శ. ౧౨౫౫ సంవత్సరము తరువాత ప్రాయశః ౧౨౫౬ ప్రాంతమున రచింపబడియుండవలెను. ఆ నాటికి మనుమసిద్ధి రాజ్యము చేయుచున్నాడు. తిక్కన మంత్రిత్వము నెరపుచున్నాడు. కేతన దశకుమార చరిత్రముకూడ ౧౨౫౬ ప్రాంతముననే తిక్కనకు అంకితమై యుండవలెను. దశకుమార చరిత్రము నిర్వచనోత్తర రామాయణమునకు ఈషత్పూర్వమైయుండును. దానిలో నిర్వచనోత్తర రామాయణ ప్రశంస లేదు. దీనిని బట్టి దశకుమార చరిత్ర క్రీ. శ. ౧౨౫౬ ప్రాంతమనిన నిర్వచనోత్తర రామాయణము క్రీ. శ. ౧౨౫౭ ప్రాంతమని చెపవచ్చును. నిర్వచనోత్తర రామాయణ కాలమునాటికి తిక్కన నడిమివయస్సులో నుండి యుండును. మనుమసిద్ధి "మామా" యని తిక్కనను సంబోధించువాడు. అయిన తిక్కన భారతము నెప్పుడు ప్రారంభించి పూర్తిచేసెను? తిక్కన భారత రచనకు, నిర్వచనోత్తరరామాయణకృతికి మధ్య వ్యవధి యుండకతప్పదు. నిర్వచనోత్తరరామాయణ కర్త తిక్కన మంత్రి. భారతకర్త తిక్కన సోమయాజి. రామాయణకృతికర్త తిక్కన అహంభావపూరితుడు. "అమలోదాత్తమనీష నే నుభయ కావ్య ప్రౌఢ పాటించు శిల్పమునన్ పారగుడన్ కళావిదుడ" అని చాటిచెప్పుకొన్నాడు. భారతరచనలో సోమయాజి "నా నేర్చినభంగి చెప్పి వరణీయుడ నయ్యెద భక్తకోటికిన్" అని వినమ్రముగా భారతమును హరిహరనాథాంకితము చేసినాడు. నిర్వచనోత్తర రామాయణమున తిక్కన "మహేశ్వరాంఘ్రికమలధ్యానైకశీలుడు." కాని భారతకర్త తిక్కన హరిహరనాథుని ఉపాసించు అద్వైతమూర్తి. కవి ఆత్మీయతలో ఈ మహాసంస్కార పరిణామము రావలెనన్న వ్యవధి కొంతకాల ముండవలెననుట తథ్యము. తిక్కన తన వార్ధక్యములో కన్నులు కనపడని దినములలో భారతమును కుమ్మరి గురునాథునిచే వ్రాయించెనని

౪. ఉదయగిరిశాసనము - Nellore Inscriptions.

౫. కందుకూరు 60- ,,

౬. Nellore Inscriptions Vol III
Appendix ఒంగోలు శిలాశాసనములు, 28.

౭. Nellore Inscriptions Vol I
తామ్రశాసనము 17.
ఒంగోలు శిలాశాసనము 67.

ర్యము. పదిహేనుపర్వములు వ్రాసిన తిక్కన భారతమును ఒక్కనాటిలో ముగించియుండడుగదా! తిక్కన మూలమునకు వన్నెచిన్నెలు గల్పించి వ్రాసెనే గాని యథామాత్రకముగా వ్రాయలేదు. దీనినిబట్టి నిర్వచనోత్తరరామాయణము క్రీ. శ. ౧౨౫౪ సం. ప్రాంతమని, దానిని తిక్కన నడిమివయస్సులో వ్రాసినా పిదప భారతమును పూర్తిచేయుట క్రీ. శ. ౧౨౬౫ ప్రాంతమున తిక్కన వార్ధక్యములోనని చెప్పవచ్చును.

కాని, మనుమసిద్ధి రాజ్యభ్రష్టుడగుట, తిక్కన రాయబారము, కాకతిగణపతి భారతశ్రవణగాథ మున్నగు ఐతిహ్యములోని గాథలు ఈ కాలముతో పొసగవు. కాకతిగణపతిదేవచక్రవర్తి క్రీ. శ. ౧౨౬౦ లో శాశ్వతికదేహము చాలించినాడు. క్రీ. శ. ౧౨౫౦ ప్రాంతమునాటి భారతమును క్రీ. శ. ౧౨౬౦ లో మరణించిన కాకతిగణపతిదేవచక్రవర్తి వినుట ఎట్లు పొసగును? కావుననే శ్రీ వీరేశలింగముపంతులుగారు భారతశ్రవణగాథ కల్పితమని త్రోసిపుచ్చిరి. కాని, వారు మనుమసిద్ధి రాజ్యభ్రష్టుడగుట అసత్యమని చెప్పలేదు. సత్యమనికూడ చెప్పలేదు.

కాని, ఐతిహ్యము కమ్మని కథలు చెప్పుచున్నది. తిక్కన ఆంధ్రకవి. ఆంధ్రమహాభారతములో శ్రీకృష్ణుని రాయబారమును అద్భుతముగా చిత్రించిన కవి. మంత్రి తిక్కన తానే రాయబారమును నెరపి, అల్లుడైన మనుమసిద్ధి ప్రభువును పునఃప్రతిష్ఠితుని సలుపుటకు గణపతిదేవచక్రవర్తికడకు వెళ్లినాడు. అతనికి భారతమును వినిపించి తత్సహాయముతో మనుమసిద్ధిని రాజ్యమున నెలకొల్పినాడు. ఇందు తిక్కనకవి రాయబారములో నెరపిన కౌశలము, ఆంధ్రచక్రవర్తియైన గణపతిదేవుని రసజ్ఞత, ఆంధ్రమహాభారతమునకు గల ఆధిక్యము వెల్లడియై కథ రక్తికట్టును. కాని ఈ కథ కల్పితమనుచున్నారు!

చారిత్రికముగ చూచిన, మనుమసిద్ధి కాకతిదేవుని కరుణను కాంక్షించుచున్నట్లు ఒక శిలాశాసనమువల్ల తెలియుచున్నది.౮ అక్కన్న బయ్యన్నలు మనుమసిద్ధి రాజ్యము నపహరించుట కూడ యథార్థసంఘటనమే. అక్కన్న బయ్యన్నలను గణపతిదేవచక్రవర్తి జయించి నెల్లూరును వశపరచుకొనినట్లు ఒక శిలాశాసనమువలన తెలియుచున్నది.౯ అందు గణపతిదేవుడు నెల్లూరురాజుతో చేసికొనిన ఒడంబడిక ప్రకారము నెల్లూరును తెగులబెట్టి అక్కన్న బయ్యన్నలను జయించినట్లు గలదు. కావున, సిద్ధేశ్వరచరిత్రములోని అక్కన్న బయ్యన్నల కథనము, ఐతిహ్యములోని మనుమసిద్ధి రాజ్యచ్యుతి పుక్కిటిపురాణములు గావని తేలినది. అయిన మహాకవి తిక్కన రాయబారము, భారతశ్రవణగాథయు అసత్యములని త్రోసివేయ గలమా? ఈ విషయమును ఐతిహ్యమేగాక సిద్ధేశ్వరచరిత్ర, సోమదేవ రాజీయమును గూడ పేర్కొనుచున్నవి.

అయిన భారతశ్రవణకథ, మనుమసిద్ధి రాజ్యచ్యుతి గణపతిదేవుని కాలములో క్రీ. శ. ౧౨౬౦ సం. పూర్వముననే జరిగియుండవలెను. నెల్లూరుమండలములోని పెంట్రాల శాసనములలో పూర్వాపర సంవత్సరములు మనుమసిద్ధి రాజ్యము సల్పుచుండగా "ఇమ్మడి విజయగండగోపాల దేవమహారాజుల పేర్కొను దానశాసన మొకటి కన్పించుచున్నది.౧౦ మనుమసిద్ధి రాజ్యకాలములో ఇమ్మడి విజయగండ గోపాలుడు చొచ్చుటకు కారణ మూహింపలేమని ఆసందర్భమున శాసనసంపాదకులు వ్రాసినారు.౧౧

ఈ శాసనములన్నియు మార్గనారాయణ పెరుమాళ్లనకు ఇవ్వబడినవి. శకసం. ౧౧౫౦ - ౧౧౫౩ మధ్యకాలము పరిశీలనార్హము.

---

౮. 580 of 1907.

౯. 769 of 1922 B.

౧౦. Nellore Inscriptions,
కందుకూరు 60, 61, 62, 63.

౧౧. Nellore Inscriptions Vol. ii పుట 606. శకసం. ౧౧౭౯ మనుమసిద్ధి దానశాసనము. ౧౧౫౦ శాసనము. మనుమసిద్ధి రాజ్యాభివృద్ధికి. ౧౧౫౧ శాసనము. ఇమ్మడి విజయాదిత్త గండగోపాల మహారాజుల రాజ్యాభివృద్ధికి. ౧౧౫౩ మనుమసిద్ధి రాజ్యాభివృద్ధికి.

కావున శక ౧౧౮౧, అనగా క్రీ.శ. ౧౨౫౮-౫౯ ప్రాంతమున మనుమసిద్ధి రాజ్యభ్రష్టు డయ్యెనని ఊహింపవచ్చును. ఈ విషయమునే వేరొకవిధముగా సాధింపవచ్చును. తెలుగుచోడులు దక్షిణచోళులకు సామంతులు. దక్షిణచోళుడైన వీరరాజేంద్రచక్రవర్తికి మనుమసిద్ధి సామంతుడైయున్నట్లు శిలాశాసనము గలదు.౧౨ ఆ శిలాశాసనము వీరరాజేంద్రుని ౧౩-వ రాజ్యసంవత్సరము. అతడు క్రీ. శ. ౧౨౪౬ లో రాజ్యమునకు వచ్చెను. ౧౩-వ రాజ్యసంవత్సరము క్రీ. శ. ౧౨౫౮ వరకు మనుమసిద్ధి దక్షిణచోళులకు సామంతుడు. కావున మనుమసిద్ధి క్రీ. శ. ౧౨౫౮-౫౯ లో రాజ్యభ్రష్టు డయ్యెననియు, తిక్కన మంత్రి రాయబారియై గణపతిచక్రవర్తికి భారతమును విని పించి ఆ చక్రవర్తిని మెప్పించి అక్కన్న బయ్యన్న లను ఓడించి మనుమసిద్ధిని రాజ్యమున తిరిగి నెలకొల్పె ననియు విశ్వసింపవచ్చును. కాని, క్రీ. శ. ౧౨౫౮-౫౯ నాటికి తిక్కన భారతము నారంభించెనా? లేకపోయిన "భారతార్థమును విస్మృత ధర్మాధర్మ పద్ధతుల"ను వినిపించె నను సోమదేవ రాజీయములోని పలుకులకు—

"అగు భారతాఖ్యాన మావీరవరులు
తగ జేసినట్టి యుద్ధప్రకారంబు
వినియె సంతోషించె గనినట్లు జెప్ప."

అను సిద్ధేశ్వరచరిత్రములోని పంక్తులకు అర్థ మేమి? ఒకవేళ తిక్కన వినిపించినది సంపూర్ణ భారతముగాక తా నారంభించిన మహాభారతములో తాను వ్రాయసంకల్పించుకొనిన కొన్ని ఘట్టములు గావచ్చును. లేక భారతార్థమును ప్రపంచించిన ఉపో ద్ఘాతపూర్వకమైన ఉపన్యాసము గావచ్చును. భార తము ఆ నాటికి తిక్కన రచించలేదను ఊహ ఐతి హ్యములోని అక్కన్నబయ్యనల కథనమును, తిక్కన కాకతిగణపతి చక్రవర్తికొలువునకు నెరపిన రాయ బారమును అసత్యము లనిపించుటకు పూర్వపక్షము కానేరదు.

౧౨. 580 of 1907.






# వినువీధిలోని విచిత్రరేడియో

## అనంతపద్మనాభస్వామి అద్భుత వృత్తాంతము

చూడండి! ఈ ఎగువ నున్న చిత్రమును జాగ్రత్తగా గమనించండి! చిత్రముయొక్క మీది భాగమందు ఎడమప్రక్క నక్షత్రములతో కూడుకొనిన ఏనుగుతొండము, ఆ క్రిందనే నక్షత్రరూపమైన ఎలుక రూపము కానవచ్చుచున్నవి. అవి మూషకవాహనుడైన విఘ్నేశ్వరుని రూపవివరములను తెలియజేయుచున్నవి. వానికి ప్రక్కనే బండిగూడువలె నాలుగు చుక్కలును, కొంచెముగా వంగిన కాడివలె నున్న మూడు చుక్కలును మొత్తము ఏడుచుక్కలున్నవి. వీరే సప్తమహాఋషులు.


= శ్రీ గొబ్బూరు వెంకటానంద రాఘవరావు =

ఆప్రక్క దిగువనున్నది చక్కని కోతిరూపము. ఆ రూపముమధ్య మెఱయుచున్న పెద్దనక్షత్రము స్వాతి. స్వాతి వాయుదైవత్యము. వాయుదేవుని అంశమున జనించినవాడు హనుమంతుడు.

సప్తఋషులకును, స్వాతికిని ప్రక్కనున్న సర్పరూపము—ఏడుపడగలతో ఒప్పుచున్న రూపము—శయ్యవలె చక్కగా అమరిన పామురూపము—శేషునిది. మహనీయఫణిఫణాత్మకమైన ఈ శేషుని దివ్యరూపమునే మన నన్నయభట్టారకుడు—

చ. “బహువనపాదపోద్ధరుల
పర్వతపూర్ణసరస్సరస్వతీ
సహితమహామహీభరము
జస్రసహస్రఫణాళి దాల్చి మ
స్నహితరమూర్తికిన్ జలధి
శాయికి పాయక శయ్యయైన య
య్యహిపతి ముఖ్యతాంశరు ప
నంతుడు మాకు ప్రసన్నుడయ్యెడున్”

అను పద్యరాజములో అనన్యసామాన్యముగ వర్ణించి ధన్యుడైనాడు.

ఇంకా చూడండి: “పాలమున్నీటిలో ఫణిరాజశయ్యపై యోగనిద్రాలీల నున్నవాని”-చతుర్బాహుని-శంఖ, చక్ర, గదా, పద్మధారిని-హార, కేయూర, కిరీట, కౌస్తుభ, మాణిక్యభూషణభూషితుడైనవానిని - హస్తమందున్న లీలాకమలమునకు ముసరుకొను తేనెటీగలతో నొప్పువానిని-అనంతపద్మనాభుని కనులకరువు దీర కాంచగను.

ఈ మహనీయమూర్తి “దయాంబుధి; యోగిబృందముల్ డెందమునందు కోరెడి కడింది నిధానము” నని మహాత్ముడైన బమ్మెరపోతరాజుగారు వర్ణించినారు.

ఈ శేషశాయి నాభికమలమునుండి బ్రహ్మ జన్మించినాడు. జన్మించినతరువాత—

“తస్యాం సచాంభోరుహకర్ణికాయా
మవస్థితో లోక మపశ్యమానః
పరిక్రమన్ వ్యోమ్ని వివృత్తనేత్రః
చత్వారి లేభేను దిశాఙ్ముఖాని.”

బ్రహ్మ ఆ కర్ణికపై కూరుచుండి నాలుగుప్రక్కలను చూచెను. అట్లు చూచుటవలన తూర్పు, దక్షిణము, పశ్చిమము, ఉత్తరము నాలుగు దిక్కులకును నాలుగు శిరస్సులు ఏర్పడినవి. ఆ బ్రహ్మముఖమునందు సకలవిద్యాస్వరూపిణి-సర్వశుక్ల-వీణాధారిణి-సరస్వతి ఉన్నది. నక్షత్రమండలములో ఈ భాగమునకు వీణామండల మని పేరు. పాశ్చాత్యులుకూడ ఈ మండలమును Lyra-the Lyre అనగా వీణామండల మనియే వ్యవహరించుట విశేషాంశము.

వీణామండలములో విశ్వమంతటను విద్యుత్తరంగములను వ్యాపింపజేయు సెలెస్టియల్ బ్రాడ్కాస్టింగుస్టేషను ఉన్నట్లు పాశ్చాత్యశాస్త్రజ్ఞులు ఈమధ్యనే తెలుసుకొన్నారు. బ్రహ్మసరస్వతీమండలమునకు తూర్పుగా, మన కతిశ్రేష్టమైన హంసస్వరూప-మున్నది. దీనిని పాశ్చాత్యులు Cygnus అని వ్యవహరించుచున్నారు. ఆదినుండ శ్రవణనక్షత్రరూపుడై గరుడాళ్వారు (Aquila) కానవచ్చుచున్నాడు. శ్రవణమునకు తూర్పుగా అష్టవసుదేవతాత్మకమగు ధనిష్ఠ నక్షత్ర మున్నది. అక్కడనే గోలోకముకూడ కలదు. అక్కడ పెద్దకొమ్ములు గల గోవు లున్నవి. “యత్ర గావో భూరిశృంగా అయాసః” అని వేదము.

ఈసరిహద్దులమధ్య - విశ్వమంతట గల సమస్తభువనములకు గోప్తయై-జగద్రక్షకుడు “విశ్వమయుడు, విభుడు, విష్ణుండు, జిష్ణుండు” అగు నారాయణుడున్నాడు. ఆకాశరంగమునకంతకును ఇది కన్నువంటి ప్రదేశము. కనుకనే సూరిజనులు ఎప్పుడును దీనిపై నొక కన్ను వేసియున్నారు. అదే విష్ణుదేవుని పరమపదము.

“ఎవ్వనిచే జనించు జగము ?
ఎవ్వనిలోపల నుండు లీనమై

ఎవ్వనియందు డిందు ? పర
మేశ్వరు డెవ్వడు ? మూలకారణం
బెవ్వడు ? అనాదిమధ్యలయు
డెవ్వడు? సర్వము తానయైనవా డెవ్వడు?"

అను ప్రశ్నలకు జవాబు "ఆత్మభవుడు. ఈశ్వరుడు" ఇక్కడనే వేంచేసియున్నా డని తెలిసికోవలెను.

ఈచిత్రపటమునకు డిశోట్లు అడుగుభాగమున నలుగురు మహాఋషుల రూపము లున్నవి. వీరు వరుసగా విశ్వామిత్రుడు, వశిష్ఠుడు, దీర్ఘతముడు, మేధాతిథి అను వేదఋషులు. విశ్వప్రాదుర్భవస్థాన మిది యని నిర్ణయించిన మహాఋషులు వీరే.

ఋషుల దిగువను అమ్ములపొదితో దిగ్భ్రాంతుడై చూచుచున్న రాజకుమారుని రూపము పటములో చూపెనగుచున్నది. భారతయుద్ధము ప్రారంభము కాకముందు విశ్వరూపసందర్శనము చేసి చకితుడైన అర్జునుడాతడు. భారతయోధులను యుద్ధమిషమున దగ్ధ్రమించుచున్న కాలపురుషుని చూచి వణుకుచున్నాడు అర్జునుడు.

పటముదిగువభాగమున మన ఎడమతట్టున టెలిస్కోపుయంత్రముతో ఆకాశవేధ చేయుచున్న వైజ్ఞానికుడు సర్ విలియమ్ హెర్షెల్ దొర. ఏబదిసంవత్సరములకాలము ప్రతిరాత్రియు నీదొర నక్షత్రవేధ చేసి చేసి తుదకు మన సూర్యుడు సకుటుంబముగా క్షణమునకు ౧౨ మైళ్ల చొప్పున నిమిషమునకు ౭౨౦ మైళ్లు; గంటకు ౪౩,౨౦౦; దినమునకు పదిలక్షలమైళ్లచొప్పున Hercules మండలమును చేరబోవుచున్నాడని ఋజువు చేసెను. మరి నూరేండ్లకు ఈవిషయమై విశేషకృషి చేసిన మరొక వైజ్ఞానికుడు-అమెరికాదేశస్థుడగు సైమన్ న్యూకూంబ్ (Simon Newcomb)అను దొరరూపము మూలను కానవచ్చుచున్నది. సూర్యకుటుంబము ఉత్తరాభిముఖముగా బ్రహ్మమండలమునకు పోవుచున్నదని ఇతడు ఋజువు చేసినాడు. ఈనాటి సిద్ధాంతులందరును మన సూర్యకుటుంబము బ్రహ్మమండలమునే చేరుచున్నదని అంగీకరించినారు.

పటముఅడుగున మధ్యభాగమునందు (Radio Receiving Set) నిస్తంత్రీయోగముచే విద్యుత్తరంగాళిని ప్రోసుచేసి శబ్దరూపమున వెలువరుచు యంత్ర కూట మున్నది. సరస్వతీపీఠామండలమునుండి వెడలు విద్యుత్తరంగాళికూడ ఇందు అందుకోబడుచున్నది. శబ్దరూపమున వెలువడుచున్నది.

ఒక సూర్యకుటుంబమే కాదు. విశ్వమునందుగల సమస్తమును విష్ణుస్థానమునుండియే వెలువడి, తుదకు విష్ణుస్థానమునే చేరుకొనునని మన మతము. విజ్ఞాన మభివృద్ధియైనకొలది ఈయంశము స్థిరపడుచున్నది.

నదులన్నియు సముద్రమును చేరుకొనునట్లు విశ్వమునందు గల సమస్తమును విష్ణువునే చేరుకోగలదు. మతదృష్టిలోనేకాదు, వైజ్ఞానికదృష్టిలోకూడ ఇదే సత్యము. పరమసత్యము.

"యోऽసౌ సర్వగతో విష్ణుః
చిత్స్వరూపీ నిరంజనః"

ఈపటవిశేషములను ఇపుడు అర్థముచేసుకోగలము. ఇంకొక్కొక్కవిషయమునుగూర్చియు వేదవాఙ్మయసాహాయ్యముతోను, ప్రాక్ప్రతీచీమతవిజ్ఞానసమన్వయదృష్టితోను పరిశీలన పరమావశ్యకము.

# లోకలిపి



= శ్రీ రాయసం వెంకటరావు =

భాషాసమస్యయే పరిష్కారముకాలేదు, లిపి విషయ మేల యని కొందరికి శంక కలుగ వచ్చునుకనుక లిపియే ముఖ్యముగాని భాష కాదని ప్రప్రథమమున స్పష్టపరచుట మంచిది. భాష దాని కదే స్వాభావికముగ జన్మించి వృద్ధిజెంది ఫలించును. భాషలో కృత్రిమత అరుదు. భాష కోట్లకొలది జనసామాన్యముజిహ్వలపై నడిచి తన స్వాభావికమైన రూపమును గ్రహించును. అసలు భాషాస్వరూపమే పూర్తిగా భిన్నమైనది. లిపిమాత్ర మట్లు కాదు. ఇది పూర్తిగా కల్పితము. ఎప్పుడును లిపి ఒకానొక వ్యక్తి యొక్క విశేషబుద్ధిప్రభావమువలన పుట్టుచున్నది. భాష కృత్రిమ మగుచున్నదనగా, అది లిపియొక్క కల్పితప్రభావమువలననే. భాషాలిపులు పరస్పర విరోధకవిషయములు. భాష ప్రవాహమును కోరును. అంతేకాదు. ప్రవాహమే దాని స్వభావము. లిపి దానిని అరికట్టుటకు ప్రయత్నించును. దీనివలననే భాషలో కృత్రిమత వచ్చుచున్నది కృత్రిమత దోషమేకాని అది అనివార్యమైన, ఆవశ్యకమైన దోషము. భాష కృత్రిమమగుట అనివార్యమైనట్లే వీలైనంతవరకు స్వాభావికత లిపికి ఆవశ్యకగుణము కావలెను. జనసామాన్యము నుద్దేశించి మానవస్వభావ మును గుర్తించినచో లిపియందు స్వాభావికత తీసికొని రానగును.

## —భాషాలిపుల విషయములలో భేదము—

భాషయొక్క స్వాభావికతయే భిన్నభిన్న భాషల పుట్టుకకును, పెంపొందుటకును కారణము. ఈకారణమువలన దేశమంతటికి ఒక వ్యవహారభాష యుంచవలెనను విషయము వచ్చినప్పుడు తదితరభిన్న భాషల ఉనికిని స్వీకరించుటయేకాక వాటి పురో వృద్ధికి పూచీ యివ్వవలసియుండును. కాని లిపివిషయమో, అట్లు కాదు. ఒక లిపి స్వీకరించినప్పుడు ఇతరలిపు లన్నింటిని తీసివేయవచ్చును. భాషావిషయములో విద్వాంసులు జనసామాన్యముముందు లొంగవలసివచ్చును. లిపివిషయమున జనులు విద్వాంసుల సమ్మతిని ఆదరింతురు. ఈకారణమున లిపిసమస్యను లేవనెత్తి, దానిని పరిష్కరించుట విద్వాంసులకును, దేశనాయకులకును కర్తవ్యమగుచున్నది.

## -దేశమునకంతకును ఒకేలిపి-

దీని ఆవశ్యకతను పూర్వకాలమునందు కూడ గుర్తెరిగియుండిరి. అశోకుని కాలములోకూడ దీని కుదాహరణము చూపనగును. అశోకచక్రవర్తి దేశ మంతటను శిలాలేఖనములద్వారా ఒక లిపిని ప్రచారము గావించెను. ఆ కాలములో ఇతరలిపులుకూడ ఉన్నట్లు నిదర్శనము లున్నవి. తమిళనాడుతప్ప దేశమంతయు అశోకుని లిపినే స్వీకరించినది. ఇక్కడ మహత్వము లిపిదికాని అశోకునిది కాదు. వంగ, గురుముఖి, గుజరాతి, మరాఠి, తెలుగు, కన్నడము—వీటి అన్నిటి వర్ణమాల ఒక్కటే. అది దేవనాగరి. తెలుగుకన్నడములకు దేవనాగరితో సంబంధము కలుపుటకు వెనుదీయుదురేమో. కాని ఈ పై అన్నిభాషల వర్ణమాలలలోను (తెలుగు, కన్నడములుకూడ) రమారమి అన్ని అక్షరములు దేవనాగరిరూపాంతరము లని రుజువుచేయనగును. రాజకీయ అవ్యవస్థ, ప్రాంతీయసాంకర్యముల ఫలితముగా నేడు ఇన్నిలిపులు మనయెదుట కానబడుచున్నవి. మరియొక బలమైన కారణముకూడ కలదు. శీఘ్రముగా వ్రాయుటకును, అందముగా వ్రాయుటకును

అప్పుడప్పుడు లిపులయందు సంస్కరణలు కలుగుచు వచ్చినవి. మౌర్యరాజ్యపతనముపిమ్మట ఏకచ్ఛత్ర రాజ్యము లేనికారణమువలన అప్పుడప్పుడాయా ప్రాంతీయప్రభుత్వము లుద్భవిల్లి, తమతమ రాజ్యములలో ఆయాలిపిసంస్కరణలను అమలులో పెట్టినవి. ఈ విధముగా తమతమ మార్గములలో స్వతంత్రించుట చేతగాని, ఒకరినొకరు అనుసరించుటచేతగాని కాలాంతరములో హిందూదేశములో ఇన్ని లిపులు కలిగినవి. చిన్న పెద్దరాజ్యముల ఉత్థానపతనముల ఇతిహాసములు ఈ లిపులయందు ఇమిడియున్నవి. బ్రిటిషురాజ్యములో కూడ ఆంగ్లభాషను ప్రచారముచేయుటకు ప్రయత్నములు జరిగినవి. కాని దాని విదేశీయతవలన హిందూదేశములో రోమనులిపి పాదుకొనజాలకపోయినది.

స్వరాజ్యకాంక్షతోపాటు ఒకేభాషవిషయము కూడ జనుల నాకర్షించినది. దానితోపాటు ఒకే లిపి విషయముకూడ పైకిరావలసియుండవలసినది. కాని ఈ విషయములో ఎక్కువ వరవడి లేదు. అదియు స్వాభావికమే. ఇతర తాత్కాలికవిషయములముందు లిపికి ప్రాముఖ్యత కలుగలేదు. లిపిసంస్కరణ శాంతికాలములో అధికముగ జరుగును. కాని దానికి బీజములు అంతకు చాలముందే నాటబడియుండవలెను. లిపిసంస్కరణక్షేత్రమందు లోకులు బొత్తిగా ప్రయత్నము చేయకుండ ఉండలేదు.

—సంస్కరణ పరిమితి—

గతించిన హైందవమహమ్మదీయ రాజ్యముల యొక్కయు, బ్రిటిషు ప్రభుత్వముయొక్కయు గుణదోషములు మన జాతి అలజడులయందు తమ ప్రభావమును చూపుచున్నవి. ఆ ప్రభావమునుండి మన లిపిసంస్కరణకర్తలు తప్పించుకొనజాలకపోయిరి. ఈ కారణమువలననే ఇప్పటివరకు ఏ లిపిసంస్కర్తకును మాన్యత అబ్బినది కాదు. కొందరు దేవనాగరియొక్క వైజ్ఞానికత గుణగానముచేయుదురు. కొందరు ఫార్సీ శీఘ్రలేఖనమును మోహింతురు. మఱికొందరు రోమను లిపియొక్క సార్వభౌమత్వమునకు ముగ్ధపడుదురు. దీనిఫలిత మేమన, నేటి ఆవశ్యకతలను పరికింప ఏ లిపులు పూర్తిగా నిరర్థకములని రుజువుపడినవో నాటియందే కొద్దిమార్పులను గావించి సంస్కర్తలు సంస్కరణను చాలింతురు. వీటివలన మన లిపు లిన్నియుండియు పనికిమాలినవి. వీనిలో కొద్దిమార్పులుచేయుట నిష్ప్రయోజనమని జనులు అనుకొందురు. దీనితో రోమను లిపికి ఇప్పుడున్నదానికంటె ప్రశస్తమార్గము ఏర్పడును. మఱికొందఱు సంస్కర్తలు అధికముగా పాటుపడలేక రోమనులిపినే ఆశ్రయింతురు. రోమను అక్షరములకు పైన గీతయో, చుక్కయో ఉంచి, దాని అసంపూర్ణతను పోగొట్టుటకు ప్రయత్నింతురు. ౨౬ ఆంగ్ల అక్షరములతో ౫౦-౬౦ భారతీయ అక్షరములు కల్పించుటలో రోమనుకు హిందూస్థానీ వేషము వేయవలసివచ్చును. ఈ రోమనుభారతీకరణము త్రిశంకుస్వర్గమువలె ఉభయభ్రష్టత్వ మగును.

—ఈ సమస్యపై మూలకందమైన దృష్టి—

నిజముగా మనము మన లిపిని సర్వాంగసుందరమయినదానినిగా చేయవలెనన్న అన్ని బంధనముల నుండి విడిపడి ఈ ప్రశ్నను మూలకందమైన సహజరూపమునుండి విచారించవలెను.

లిపి ధ్వనులను ప్రకటించును. పిల్లనగ్రోవినుండి ఏవిధముగా ధ్వనివెడలునో, అదేవిధముగా కంఠమునుండి ధ్వని వెడలును. పిల్లనగ్రోవిలోనికి గాలి నూది దాని రంధ్రములపై చేతివ్రేళ్లనుంచి ఆగాలినినొక్కుచు వదలుటచే భిన్నభిన్నస్వరములు వెలువడుచున్నవి. అదేవిధముగ మనుష్యుడు తన కంఠద్వారమునుండి గాలిని వెలువరించి నాలుకతో దానిని ఆపుచు, వదలుచు వేఱువేఱుధ్వనులను పలుకుచున్నాడు. కంఠమును, నాలుకను, పిల్లనగ్రోవిని, చేతివ్రేళ్లను ముందుంచుకొని లిపిని కల్పించినచో దానిలో అధికసాఫల్య ముండునని ఆశయున్నది. ఆవిధముగా తయారైన లిపి అధికస్వాభావికముగను, శాస్త్రీయముగను ఉండును. దేవనాగరి మున్నగు భారతీయ లిపులయొక్క శాస్త్రీయత ఉచ్చారణమట్టుకే. అదై

నను పూర్ణముకాదు. లిపిలో ఆ శాస్త్రీయత పేరుకైన లేదు. అది శాస్త్రయుక్తమని నిర్ధారణచేయుటకు చేయు ప్రయత్నములు కేవలము బలవంతములు గాని స్వతస్సిద్ధములు కావు. అక్షరముల స్వాభావిక స్వరూప మేదో తెలుపుటకు నా పిన్ననాటిసంగతి ఒకటి చెప్పుచున్నాను. కొద్దివయస్సుమీఱినతర్వాత నేను పాఠశాలలో చేరినాను. అంతకుపూర్వముకూడ నేను పాఠశాలకు వెళ్లి ఇతరపిల్లలు వ్రాయుట, చదువుట చూచువానిని. నాదృష్టి విశేషముగా వ్రాయువారిపై ఉండెడిది. ఇంటికి వచ్చి నేనుకూడ నాపలక మీద వ్రాయుచుండువాడను. అన్నిగీతలు గుండ్రగుండ్రముగా వచ్చుట నాకు బాగుగా జ్ఞాపకము. ఇదేకాక, కొన్నిదినములక్రిందవార్ధాయందు నేనుచదువు చెప్పు రాత్రిబడిలో పిల్లలు, వృద్ధులు అందఱును వచ్చువారు. మూడుసంవత్సరములపిల్లవాడుకూడ నా వడిలో వచ్చి కూర్చొనువాడు. ఒకరోజున ఆఅబ్బాయి చేతికి పలక, బలపము ఇచ్చితిని. వాడుకూడ గుండ్రగుండ్రముగా వ్రాయుట కారంభించినాడు. కావున వలయము లిపియొక్క స్వాభావికరూపమని నిర్ధారణ చేయుట యైనది.

— లోకలిపి —

కంఠము, జిహ్వా, పిల్లనగ్రోవిరంధ్రములు, చేతివ్రేళ్లు, వ్రాయుటలో చేతికి గలుగు స్వాభావికగతి-వీనిని దృష్టియందుంచుకొని ఈనవ్యలిపి సృజింపబడినది. దీనిని సృజించుటలో ఇది యావద్భారతకోటానుకోట్ల జనులను అక్షరజ్ఞానులనుగా జేయుటకు సాహాయ్యముగ నుండవలెనని నాఉద్దేశ్యము. ఈ నవ్యలిపిద్వారా నిరక్షరాస్యత నశించునని నానమ్మకము. కనుకనే దీనికి 'లోకలిపి'యని పేరు.

ప్రక్కపుటలలో ఇవ్వబడిన వర్ణమాలపటము నాలుగు భాగములుగ విభజింపబడియున్నది: ౧. వ్యంజనములు, ౨. అకారముయొక్క భిన్నభిన్నరూపములు, 3. స్వరములు, ౪. టైపురైటరు, అచ్చుపెట్టె. ఇచ్చట ఈ నాలుగింటి విశదీకరణమునకు చోటులేదు. కేవలము సంక్షిప్తముగా విశదీకరించుటకు ప్రయత్నింతును. సులువుగా అర్థమగుటకై, వివరించేటప్పుడు క్రొత్తలిపికి బదులు ప్రాత అక్షరములే ఉపయోగింపబడినవి.

౧. వ్యంజనములు:—(i) ఇవి పూర్వమున్న కవర్గాది ఐదువర్గలలోనే విభజింపబడినవి. కాని వాటి క్రమముమాత్రము మార్చబడినది. కవర్గ తరువాత టవర్గను, ఆపిమ్మట చవర్గ, తవర్గ, పవర్గలను కూర్చితిని. ఈ క్రమమే అధికశాస్త్రీయము. ధ్వనులు కంఠోష్ఠములమధ్య ఒకటి తర్వాత మరియొక స్థలము నుండి క్రమముగా వెలువడును. నాలుక కంఠములో తట్టినచో కవర్గాక్షరములు వెలువడును. కొద్దిగముందుకు వచ్చి మూర్ధమున తగిలిన టవర్గాక్షరములు వెలువడును. ఇంకకొద్దిగ ముందుకువచ్చి నాలుక చిగుళ్లకు తగిలినప్పుడు చవర్గాక్షరములు వెలువడును. దంతములతో తవర్గయు, పెదవులతో పవర్గయు కలుగుచున్నవి. దీనివలన కవర్గ తరువాత టవర్గమే కాని చవర్గము కాదని స్పష్టపడినది.

ఇక, అందలి అడ్డపంక్తులనుగూర్చియు, వాటిలోని నిలువుపంక్తులనుగూర్చియు వివరింతును.

(ii) ఉచ్చరించుసమయమున సమానప్రయత్నముతో వెలువడిన అక్షరములు ఒకే నిలువుపంక్తిలో కూర్చబడినవి. ఒకే స్థానమునుండి వెలువడిన అక్షరవర్గలను అడ్డపంక్తుల నుంచుటచేత ఐదువర్గము లేర్పడినవి. ఆయావర్గములయందు క్రమక్రమముగా సమానప్రయత్నమున ఒకటి తర్వాత నొకటి వెలువడిన అక్షరములు క్రమక్రమముగా నిలువుపంక్తులలో వ్రాయబడినవి. దీనిలోకూడ పూర్వక్రమమును మార్చవలసివచ్చినది. అనుకూలమైనంతవఱకు నిలువుపంక్తులను రోమను అంకెలతో నిరూపించితిని. ఈ నిలువుపంక్తుల వర్గీకరణముచేత మఱియొక ప్రయోజన మేమన, ఏ భాషలో ఏ నిలువుపంక్తిలోని అక్షరములు లేవో ప్రప్రథమమున దానిని వదలివేయవచ్చును.

I, II—ఇవి పరుషసరళములు. 'క' తరువాత 'ఖ' యు, 'ట' తరువాత 'ఠ' యు ఉపయోగించక 'గడ'లు క్రమముగా వేయుటకు కారణము గలదు.

III, IV—తెలుగుభాషయందు చవర్గలో మాత్రము 'చ'నుండి 'చ'యు, 'జ'నుండి 'జ'యు ఉన్నవి కాని ఇతర మూడువర్గములలో అటువంటి రూపాంతరములు లేవు. ఇటులనే ఇతర భాషలలో కొన్నికొన్నిటియందు ఇదేమాదిరిగ ఇతరమూడువర్గ ములలో కొన్నికొన్ని రూపాంతరము లున్నవి.

V—ఇవి అనునాసికాక్షరములు. అనగా ముక్కుతో పలుకబడునవి. కనుక ఆయావర్గముల మొదటిఅక్షరములకు మధ్య చుక్క పెట్టి వాటి ధ్వనులను ముక్కున బంధించినట్లుగా రూపము కల్పింపబడినది.

VI—ఇవి అంతస్థములు; అనగా రొమ్ము నుండి వెలువడినవి. వీటికి, కవర్గాదులకు విశేషసంబంధమున్నది. అందుచేత వీటి క్రమముకూడ పూర్వపు య,ర,ల,వ క్రమమును వదలి వ,ర,య,ల-గా చేయబడినది. వ కారము (వ,బయో రభేదః)నకు, బకారమునకు భేదము లేకుండ వాడుటచేత వ కారము పవర్గ చతుర్థాక్షరముగా వేయబడినది. దాని రిక్తస్థానమున "ళ", "ల"కు సామీప్యము జేసి కూర్చబడినవి.

VII—ఇవి ఊష్మములు. వెనుక జూపిన కారణమువలననే ఈ క్రమమునకుగూడ మార్పుగలిగినది. ఊష్మములలో 'హ' కంటె 'ఖ' ఎక్కువ ఉపయుక్తముగా తోచుచున్నది. కకారషకారముల సంయుక్తమైన క్షకారము చివర పంక్తిపూర్ణమునకు, దానియొక్క ఉపయోగముకూడ ఎక్కువగ ఉండుటచేత కల్పింపబడినది.

(ఖ, ఘ మున్నగు మహాప్రాణములు పది మిగిలినవి. వాస్తవములో క, గ లకు 'హ'సంయోగమువలన క్రమముగ ఇవి కలుగునని నా యభిప్రాయము. అందుచేత మహాప్రాణములు పది సంయుక్తాక్షరములుగా లెక్కించి మూలవర్ణమాలనుండి, తీసివేసితిని.)

౨. 'అ' ఉచ్చారణముయొక్క భిన్నభిన్నరూపములను లిపిబద్ధము చేసి భారతలిపులయొక్క పెద్ద అసంపూర్ణతను పోగొట్టుటయైనది. "అం"ఇది అకార మకారములకును, అకారనకారములకును మధ్యగా అనునాసికముతో ఉచ్చరింపవలసినది. దీనికి ఇతరభాషలలో ప్రత్యేకప్రయోజన ముండుటచే కల్పింపబడినది.

3. అచ్చులను హ్రస్వదీర్ఘములుగా విభజించి హ్రస్వములక్రింద దీర్ఘములను వ్రాసితిని. ఇది నేర్చుకొనుటకు సులభమని అట్లు చేసితిని. సంపుటిపం లోనివి అన్నియు హ్రస్వములు; రెండవపంక్తిలోనివి దీర్ఘములు. ఉత్తర, దక్షిణ భారతదేశభాషల ననుసరించియు, ప్రాచ్య పాశ్చాత్యభాషల నన్నింటికి అనుకూలముగను ఈ అచ్చులన్నియు సృజింపబడినవి.

4. టైపురైటరు, అచ్చుపెట్టెయు సులభముగా తయారుచేయుటకు నానాపు ... సంజ్ఞలు సూచింపబడినవి. అనవసరమైన ఈ సంజ్ఞలను తొలగించుటయో, తగ్గించుటయో చేయవచ్చును. ప్రపంచములో ఇది అన్నివిధముల ఇతరలిపులకంటె సంపూర్ణమైన, సులభమైన అచ్చుగా స్థిరపడగలదు. దీనికి సందేహము లేదు. దీని స్వరూపమువలన సంయుక్తాక్షరములు ఒకదానిక్రింద మరియొకటి వ్రాయు బాధ తప్పినది. ఇచ్చట ఇచ్చిన ప్రత్యేకఅక్షరములో నిలువుగీత తీసివేసినచో అది సంయుక్తాక్షరమునకు ఉపయోగార్హమగును.

ఇది లోకలిపియొక్క సంక్షిప్తవివరణము. ఉచ్చారణశాస్త్రము ననుసరించి ప్రత్యేకఅక్షరముల ఆకారము నిర్ణయింపబడినది. ఏదృష్టికోణములచే గమనించినను ఈ లిపి సంపూర్ణము, స్వాభావికము. అందుచేతనే ఇది శాస్త్రసమ్మతమైన లిపి. ఈ ప్రపంచములో నున్న అన్ని భాషలు ఏవిధముగా ఉచ్చరింపబడునో అదేవిధముగా వ్రాయుటకు ఈ "లోకలిపి" అనుకూలమైనది. భాష రాకున్నను దాని సరియగు ఉచ్చారణ గుర్తింపనగును.

# నటీమణులవలె మీశరీరసౌందర్యమును కాపాడుకొనుడు!






కన్నాంబ

"నా చర్మరక్షణకు లక్సు సబ్బు వాడేపద్ధతిని అవలంభించెదను" అంటుంది కన్నాంబ. చాలమంది ఇండియను సినీమాతారలవలె ఆమె కూడా తన దేహమును మృదువుగాను అందముగాను మచ్చలులేకుండా వుంచుకొనుటకు ఈ సువాసనగల సబ్బు యొక్క చురుకైన నురుగుపై ఆధారపడవచ్చునని తెలుసుకొన్నది. లక్సు సబ్బును ఎల్లప్పుడు విడిచిపెట్టక వాడుచుండును.

## టాయిలెట్ సబ్బు

LTS. 132-50-40 TL.

LEVER BROTHERS (INDIA) LIMITED

# అతడు దృఢంగా వుండేటట్లు చూచుట నీ వంతు!




ప్రతి గృహిణి ఏ ఆహార పదార్థములు శక్తి నిచ్చునవో తెలిసికొన వలెను. డాల్డా పాకశాస్త్రమను పుస్తకము (ఇంగ్లీషులో అచ్చువేయ బడినది) 150 ఇండియన్ వివిధ తినుబండారములు తయారుచేయు పద్ధతులతో కూడినది. మిక్కిలి వుపయోగకరమైన విషయములు గలవు. మీకు ఒక కాపీ వుండుట ముఖ్యావసరము. 4 అణాల బిళ్లలు Dept. B110 P. O. Box No. 153, Bombay, పంపుడు.



తల్లులారా! మీ సంసారానికి వంట వండేటప్పుడు మీపైన యెంత బాధ్యత వున్నదో మీరు గ్రహించారా? మీరు తెచ్చిన వంట సామాగ్రిని వండే విధానంతో మీ పిల్లలకు మీరు శక్తిని ప్రసాదించి మంచి బలముగల వారినిగానైనా చేయగలరు — లేక ఎందుకూ పనికిరాకుండా వుండే దుర్బలులుగాను, నీరసంగా వుండే వారిలాగానైనా తయారు చేయగలరు.

ఆహార పదార్థములు "బలము నివ్వగలుగుటలో" అనేక రకములుగా వుంటవి — మీరు బాగా గమనించండి. కొన్ని మంచి పుష్టినివ్వగలవు. మరికొన్ని ఆకలిమాత్రం ఆపి, రుచికరంగా వున్నట్లుండి, బలముమాత్రం ఇవ్వలేవు. అందుచేతనే బాగా యింతో అంతో తిన్నప్పటికీ చాలా మంది నిస్సత్తువగా వుంటానికి కారణం. అయితే అన్ని ఆహారపదార్థములు ఎక్కువ సత్తువ నిచ్చునట్టివిగా చేయుటకు వీలున్నది. విటమిన్లతో నిండిన డాల్డాతో ఆహారంవండుట యీ విషయంలో తప్పక తోడ్పడును. ప్రకృతి సిద్ధంగా కావలసిన ముఖ్యమైనటువంటివన్నీ, శక్తినివ్వగలిగి వటువంటివన్నీ "ఆహార పదార్థములు" డాల్డా యివ్వగలదు.

డాల్డా ఆహారాన్ని ఎక్కువ బలమును యిచ్చునట్లు చేయగలదని మేము నిర్ధారణ చేసితిమి.



**విటమిన్లతో నిండిన**

**బలమునకు**

'సత్యం, శివం, సుందరం'—

ఈశ్వరునికై ఉపయోగింపబడిన ఈ ఆర్యోక్తి ప్రపంచములో ప్రతివస్తువునకుకూడ అనుకూలముగా ఉపయోగింపనగును. ప్రతివస్తువులో ఈశ్వరదర్శనము చేయనగును. పూర్ణత ఈశ్వరుని లక్షణము. సత్యం, శివం, సుందరం - ఇవి పూర్ణతయొక్క భిన్నభిన్న అంగములు. ఈ లక్షణములు ఏ వస్తువునందు ఎంత అధికముగా నుండునో అది అంత పూర్ణతకు సామీప్యము. సత్యం = స్వాభావికము, శివం = ఉపయోగకరము, సుందరం = కంటికింపైనది అని ఈ ఆర్యోక్తికి అర్థము చెప్పుటకు వీలున్నది. స్వాభావికము, ఉపయోగము, సౌందర్యము — ఈ త్రిగుణములు ప్రతిసమగ్రవస్తువునకును అనివార్యములు. ఇట్టి వస్తువే ప్రపంచకములో స్థాయినేర్పరచుకొనగలదు. కృతకము, నిరుపయోగము, కురూపియైన వస్తువులకు ప్రపంచములో స్థానము లేదు. ఇది లిపివిషయములో కూడ నిజమే. ఈ త్రిగుణములలో ఏ ఒక్కటి లోపించినను, తగ్గినను అది సర్వమాన్యమగుట సందేహము. ప్రాచీన, ఆధునిక లిపులయొక్క ఇతిహాసమే ఇందుకు ప్రమాణము. ఏ లిపియైనను దాని స్థానమున తుణ్ణముగా నుండుటకు ఈ పై చెప్పిన లక్షణములే గీటురాయి.

పై జెప్పిన మూడుగుణములలో స్వాభావికము, సౌందర్యతలనుగూర్చి ప్రప్రథమములో వ్రాసితిని. ప్రపంచము ప్రత్యక్షఫలితము లపేక్షించును గావున ఇప్పుడు ఉపయోగమునుగూర్చి కొంచెము విశదముగా చర్చింతము.

ఉపయోగత్రయము

౧. నేర్చుకొనుట, నేర్పుట.
౨. వ్రాయుట, చదువుట.
3. ప్రెస్సు (అచ్చు), టైపురైటరు.

ఈవిధముగా లిపియొక్క ఉపయోగమును 3 భాగములుగా విభజింపదగును. వీటిని వేరువేరుగా వివరణముచేయునప్పుడు తలక్రిందుగా మొదట 3-వ దానిని గూర్చియు, పిదప ౨-వ దానినిగూర్చియు ప్రసంగించెదను.

ప్రెస్సు, టైపురైటరు:—ఈ రెండు వస్తువులకును నేటిజీవితములో ప్రతిఅంశముపైనను భారీయైన ప్రభావముకలదు. ప్రెస్సు, టైపురైటర్లయొక్క అనుకూలములను గుర్తింపక నేడు ఏ క్రొత్తలిపినిగూర్చిగాని తలచుట శక్యముకాదు. రోమనులిపిలో ఈ రెండు అనుకూలములును ఎక్కువగా ఉండుటబట్టి దినదినము అధిక సంఖ్యాకులు దానిని అభిమానించుచున్నారు. ఈ రెండు అనుకూలములు అన్నిటికంటె ఎక్కువగా ఉండునట్లు ఈ లోకలిపియొక్క ఆకారము నిర్ణయింపబడినది. ఇంతేకాక రోమనులిపిలోని దోషములన్నియు "లోకలిపి"లో లేవు. ౪-వ నెంబరు పటములో ఇచ్చిన దాదాపు పాతికచిహ్నములతో ప్రెస్సు టైపురైటరుల ఆవశ్యకములన్నియు నెరవేరును. రోమను లిపికంటె కంటికి తక్కువ భారము కలుగునట్లు అక్షరముల ఆకారము నిర్మింపబడినది. సన్నని అక్షరములతో అచ్చువేసినప్పటికిని అదే సన్నని అచ్చులో ఉన్న రోమనులిపికంటె తక్కువభారము కంటికి కలుగును. దీనితో జాతీయశక్తి, ధనము, వీటిరూపములతో కలుగు ఆదాయము, రాష్ట్రములకు కలుగు ఉపయోగమునుగూర్చి అంచనా వేయుట కష్టము.

చదువు, వ్రాతలు:— మోటారు, విమానములు వచ్చిన తర్వాత కాలినడక పోలేదు. ప్రెస్సు, టైపురైటర్లు వచ్చినంతమాత్రమున చేవ్రాత మూలబడదు. లిపియందు ప్రెస్సు, చేవ్రాత—ఈ రెండు గుణములును సమానముగా నెలకొల్పబడవలయును. కొన్ని లిపులు శీఘ్రలేఖనమునకు పనికివచ్చినవై యున్నను, ఎంత శీఘ్రముగా వ్రాయుదుమో, చదువుటయందు అంత క్లిష్టమైయున్నవి. ఉర్దూ, మార్వాడీ భాషలేకాదు, ప్రశంసింపబడు ఇంగ్లీషు వ్రాతకూడ చదువుట క్లిష్టతరమేగాని సులభము కాదు. ఈ నెపమున శీఘ్రలేఖనము నుపేక్షించుటకు వీలులేదు. శీఘ్రలేఖనము, సులభపఠనము ఈరెండును లిపియొక్క ముఖ్యగుణములు. ఈ రెండుగుణములును లోకలిపిలో సంపూర్ణముగానున్నవి.

నేర్చుకొనుట, నేర్పుట:— ఈ శీర్షిక నంతయు నందు తీసికొనుట ఎందుకనగా, దీని మాహాత్మ్యముమీద సంపూర్ణమైన భారీబుద్ధితో విచారణచేయు ఉద్దేశ్యముతోనే. లిపిసృష్టి మొదలుకొని ఎవరును ఎప్పుడును ఈ దృష్టితో విచారించలేదు. కనీసము ఎవరయినను విచారించియున్నచో వారి సాఫల్యత మన కేమియు కానవచ్చుటలేదు. లిపి ఎటులున్నను నేర్చుకోవలసి వచ్చును. తేలికగా నేర్చుకొనుట దృష్టిలో నుంచుకొని ఏ పూర్వపులిపియు సృష్టింపబడలేదు. ఇక్కడ లిపియొక్క కృత్రిమత దాని చరమసీమ నధిష్ఠించినది. మామూలుగ అక్షరములు వ్రాయుట మొదటిలో రాక పోయినచో కొట్టి నేర్పుటయో, అప్పటికిని రాకపోయినచో జనత నందరిని మూర్ఖులని ఊరుకొనుటయో ఇప్పటివరకు బడిపంతుళ్ల నీతి యైపోయినది. శిక్షకులు తమ అసామర్థ్యమును కప్పిపుచ్చుటకు కోటానుకోట్ల ప్రజలను బుద్ధిహీను లనుటకు సాహసించిరి. కొందఱు హృదయము, సహానుభూతి కలవారు శ్రవణముచేయుటకు, స్తుతించుటకు ఉపదేశము చేసి చదువువ్రాతల కొఱతను తీర్ప ప్రయత్నించిరి. మహాత్ముల ఉపదేశము వినినచో చాల తరించెద రని ప్రబోధించిరి. వాస్తవముగా ఇది తమ అసామర్థ్యమును కప్పిపుచ్చుట కొనర్చిన ఉపాయము. ఇది అందరికిని విదితమే. మహాత్ములు శ్రవణమునకు ఏ విధముగా ఉద్బోధించిరో, అదేవిధముగా వ్రాయుటకును, చదువుటకును గూడ ప్రబోధించిరి. కాని యోగ్యతను ప్రసాదించుటయందు వా రసమర్థులైరి. పాపము, వారి దోష మేమి! చదువుట, వ్రాయుట ప్రతివారికిని అభ్యసించుట అలవికాదని వారు నమ్మిరి. ఒకవైపు ఇది. రెండవది ఏమనగా, లిపి ఉన్నదిఉన్నట్లు నేర్చుకొనుటకు ఇంత అధికసంఖ్యాకులు అసమర్థులైనారన్నచో అనేకకారణములు కలవు. నేడు సులభమార్గములు (Easy methods) అనేపేరిట చేయబడు అనేక కలగలపులను చూచి నేను చకితుడనగుదును. చదువుపేరిట సున్నితమైన బాలురపై బహుశః ఈరోజులలో కూడ చూపబడు కాఠిన్యము ప్రపంచములో నెలకొల్పబడే దౌర్జన్యరాజ్యములకంటెకూడ అత్యాచారము. నిజమేమిటనగా నేడుకూడ మన విద్యకు శ్రీకారము అవిద్యనుంచి అగుచున్నది. మూడవది: భాషాలిపులలో లిపి సరళము. లిపిలో కొద్ది చిహ్నములు నేర్చుకొనవలెను. భాషలో అనేకవేల మాటలు నేర్చుకొనవలసివచ్చును. మనుజులు పరదేశమునకు పోయి పరభాష కొలదిమాసములలోనే నేర్చుకొనెదరు. కాని చచ్చునంతవరకు తమ చేవ్రాలు కూడ చేయుట చేతగాదు. జనులకు చదువుటయందును, వ్రాయుటయందును రుచిలేదని చెప్పుటకు ఏమాత్రము వీలుగాదు. వాస్తవమేమిటనగా, ఇప్పటి లిపులు రుచిని పారదోలు నంతటి కఠినములు, కఠోరములు.

లిపులు ఎందుకు ఇంత కాఠిన్యమైయున్నవి? శీఘ్రముగాను, సరళముగాను జనులు నేర్చుకొనవలెనను దృష్టితో లిపిసృష్టికర్తలు లిపిని సృష్టించలేదు. లోకమంతయు సాక్షరము కావలెననే ఉద్దేశ్యముతోనే ఈ ప్రస్తుత లిపి నిర్మింపబడినది. అందుచేతనే ఇది లోకలిపి.

## సఫలప్రయోగములు

ఈ లిపిమీద అనేకచోట్ల సామూహిక ప్రయోగములను (Experiments) చేసితిని. సేవాగ్రామ విద్యాసంఘములో సమీపప్రాంతవిద్యార్థు లుండిరి. ఒకదినము వారి క్లాసును నేను తీసికొంటిని. రోజంతయు కష్టముతో అలసినతర్వాత సాయంకాలము ఆరుగంటలకు లోకలిపి నేర్పుట కారంభించితిని. ౬-౩౦ కు, అనగా ౩౦ నిమిషములలో నేర్పుట పూర్తి అయినది. దానితర్వాత అందరిని తమతమ భాషలను లోకలిపిలో తమ యిష్టమువచ్చినది వ్రాయుమంటిని. అందరును వ్రాసి తమ సంతోషమును ప్రకటించిరి. కొన్ని దినముల తరువాత వర్ధాలో "మహిళాశ్రమ"ములోకూడ ఇదే ప్రయోగము చేయబడెను. అదే విధముగా ౩౦ నిమిషములలో పాఠము పూర్తిఅయిన తరువాత సక్రమముగా పరీక్షలు జరిపితిని. అందరును కాగితములపై కొన్ని వాక్యములు వ్రాసిరి. ఎవ్వరికి

# భారత జాతీయ సైన్యము

'నేతాజీ' సుభాసచంద్రబోసు నాయకత్వమున 'ఆజాద్ హింద్ ఫౌజ్' అను పేరుతో

—సింగపూరులో శిక్షణపొంది సలక్షణముగా తయారైన దండిదండు—





౧, ౨. సైనిక దళముల పర్యవేక్షణ చేయుచున్న నేతాజీ సుభాసచంద్రబోసు.



3. ఢిల్లీ ఛలో, జైహింద్ అని వీరనినాదములు చేయుచు
ఢిల్లీవైపుకు పయనమై సాగుచున్న ఒక సైనికదళము.



౪. అదే జాతీయసేనలోని
ఝాన్సీరాణి
పటాలపు మేజరు డాక్టరు లక్ష్మి
(శ్రీమతి అమ్ముస్వామినాధన్ కుమార్తె.

కూడ నూటికి ౭౫ మార్కులకు తక్కువ రాలేదు. చాలమందికి ౯౦ కి పైగానే వచ్చినవి.

## సంవత్సరములో నూటికి నూరు అక్షరాస్యత

సాక్షరతకొరకై ప్రపంచములో ఎన్నియో ప్రయోగములు జరిగినవి. రష్యా అన్నిటికంటె ఎక్కువ ప్రయత్నించినది. ౨౫ ఏళ్లలో సుమారు ౯౦ % జనులను అక్షరాస్యులుగ మార్చగలిగినది. కాని లోకలిపిని ఉపయోగించినచో హిందూదేశము యొక్క ౪౦ కోట్ల జనము జాతీయప్రభుత్వముక్రింద ఒకే నెలలో సాక్షరులగుదురు. శిక్షితులు ఒకే ఒకగంటలో లోకలిపిమీద అధికారము పొందగలరు. ఒక శిక్షితుడు మరొక అశిక్షితునికి ఒకనికేకాదు, అనేక మందికి ఒకే ఒకరోజులో చదువువ్రాతలు నేర్పగలడు. శిక్షితసమాజము కేవలము వారములో ఒకరోజు—ఆదివారము నాడు సాక్షరతకు ప్రయత్నించినచో సంవత్సరమైనను పూర్తికాకమునుపే శిక్షితులకు మరి నేర్పుటకు అశిక్షితులు దొరకుట అసంభవము. ఇది నా మధురకల్పన కాదు. సుఖస్వప్నము కాదు. ప్రతిమాటయు అనుభవముమీద చెప్పుచున్నాను.

## అనుమానింపదగిన ఆక్షేపణలకు
## —సమాధానములు—

ఇచ్చట విమర్శకుల నెవ్వరిని వదలకూడదు. నిజాయితీగాను, సేవాభావముతోను చేయు విమర్శనకు విలువ లేకపోలేదు. అట్టి హృదయములలో ఆక్షేపణలకు బదులు వాస్తవమైన శంకలు రేకెత్తబడును. లోకలిపి సరళము, సుందరము. కాని అక్షరముల సామీప్యరూపత నేర్చుకొనువారలకు భ్రమకలుగజేయునేమోయని ఒక శంక కలుగవచ్చును. ఆచార్య నరేంద్రదేవ్ యొక్క మాటలను వింటిని. "ఆంగ్లేయులకు హిందూదేశములో నున్న అన్ని ముఖములు ఒక్కమాదిరిగనే కానబడును. గుంపులోనుండి ఎవ్వరినైనను గుర్తుపట్టవలెనన్నచో వారికి బహుకష్టము." తిరిగి నా బాల్యము జ్ఞాపకమునకు వచ్చినది. హిందూదేశములో చాల వెనుకబడియున్న ప్రదేశమున, భిల్లులమధ్య ఒక పేదయింట పుట్టిపెరుగు భాగ్యమో, అభాగ్యమో నాకు కలిగినది. గ్రామములో ఇతరపిల్లల యిండ్లలో చిన్నసవారీగుర్రము లుండెడివి. పగలు అడవిలో గుఱ్ఱములను వదలి, సాయంకాలము వాటిని యిండ్లకు తోలుకొనిపోవువారు. "మా యింటిలోకూడ ఒక గుర్రము ఉన్న బాగుండు"నని నామనస్సులో అనుకొనువాడను. కాని ఒక చకితమైన శంక వేసెడిది. ఏమిటనగా, నాగుర్రమును ఏవిధముగా గుర్తుపట్టుటాయని. ఏలనగా, అన్నిటి రంగురూపములును ఒక్కవిధముగానే ఉండును. కొద్దిదినములతర్వాత మాయింటిలోకికూడ ఒకగుర్రము వచ్చినది. దానిని మేయుటకు వదలిరి. దానిని గుర్తుపట్టుటకు నేను పగలు ఎన్నోసార్లు వెళ్లువాడను. కాని దానిని గుర్తుపట్టుటకు ఎప్పుడును బాధపడలేదు. శంకకు మందేమి? వస్తువులను మనము స్వంతపరచుకొనునంతవరకు శంకాస్పదముగుట సహజము.

## రోమనులిపియొక్క అంతర్జాతీయత —

రోమనులిపినిగురించి అన్నిటికంటె బలవత్తరమైన వాదము దాని అంతర్జాతీయత. అది ప్రపంచలిపి యని చెప్పనగును. దీనికి వ్యతిరేకముగ నూతనలిపులు సృష్టించినచో వానిని సంకుచితదృక్పథసూచకము లని దురారోపణ చేయబడును. కాని లోకలిపికల్పనలో సంకుచితదృక్పథము లేశముకూడ లేదని నేను ఘంటాపథముగా చెప్పగలను. కుతూహలముతో సుమారు ఒక డజను భాషలు, లిపులు నేర్చుకొనిన పిమ్మట ఈలోకలిపియొక్క కల్పన అంకురించినది. ఇదేకాక లోకకల్యాణభావనయే ఇందులో పనిచేయుచున్నది. దీనిని ఇక్కడ వదలి ప్రస్తుతము రోమనులిపిని గూర్చి విచారింతము. రోమనులిపియొక్క అసంపూర్ణతను పాశ్చాత్యులుకూడ అంగీకరింతురు. ఇదే కారణమువలన పశ్చిమములోకూడ కొందరు విజ్ఞానసంపన్నులు నూతనలిపిని కల్పించిరి. అయినప్పటికిని పాశ్చాత్యసంకుచితదృష్టివలన వారు సాఫల్యత నొంద

మూలకపోయిరి. 300 సంవత్సరములనుండి బైబిలు (క్రైస్తవధర్మగ్రంథము), Bottle(సారాసీసా), Battalion (సేనావిభాగములు)— ఈ బకారత్రయశక్తిసము సముచ్చయముతోకూడ రోమనులిపికి నామమాత్ర సాఫల్యమైనను ప్రాచ్యదేశములలో కలుగలేదు. ఇది దానియొక్క అంతర్జాతీయతకు నగ్ననిదర్శనము. భారతదేశము నేడు నూతనలిపియొక్క ఆవశ్యకతను గుర్తించి తీవ్రముగా పనిచేయుచున్నదని మనము ఒప్పుకొనక తప్పదు. చైనాజపానులకు మనకంటె ఎక్కువ ఆవశ్యకత ఉన్నది. ఇండియా చైనాదేశములవంటి ప్రాచ్యజగత్తుయొక్క జనాభా ప్రపంచపు జనాభామొత్తములో సగముకన్న ఎక్కువగును. లోకలిపిమాదిరి ఒక సుందరమైన లిపి ప్రాచ్యులందరికిని ఏకలిపియగుట నిశ్చయము. పూర్వసూర్యుడు పిమ్మట పశ్చిమములోకూడ తన కాంతిని ప్రసరింపగలడు.

## — నమ్ర నివేదనము —

నేను విద్వాంసుడను కాను. లిపియే కాదు, ఏవిషయమునుగూర్చియు విశేషపరిశ్రమ చేయలేదు. ఒక అకించనునివలె రాష్ట్రసేవలో కాలము గడిపితిని. నామనస్సులో పెద్దపెద్ద ఊహలు ఉత్పన్నమయ్యెడివి. వానిలో ఒకానొకటి మిక్కిలి రేకెత్తింపబడెడిది. లిపిసమస్య ఈవిధముగానే నామనస్సు కెక్కినది. ఎంత విచారించితినో, ఎన్ని ప్రయోగములు చేసితినో లెక్కలేదు. ఈలోకలిపి సుమారు ౧౮ సంవత్సరముల కృషిఫలితము. నేను నాభావనలో ఎచ్చటను విషయముయొక్క శాస్త్రీయతను వదలలేదు. Theory and Practice కు ఒక రూపమిచ్చుటకు ప్రయత్నించితిని. లిపివిషయములో ఒక సమగ్రదృష్టి అవలంబించుటకు ప్రయత్నించితిని. అయినప్పటికిని ఈ లిపి సమగ్రము అని నేను వాదించను. ఇంకను చాలపని మిగిలియున్నది. ఇది యొక నమోనా మాత్రమే. విద్వాంసులు ఈ వైపు పరికించి దేశమంతకును ఒక సర్వాంగసుందరమైన లిపిని త్వరలో నిర్మింతురుగాక! ముందు వచ్చే జనాభాలెక్కలకు పూర్వమే జనత నంతను అక్షరాస్యులను గావించి ప్రపంచమున కంతకును ఒక నూతనమార్గము ప్రదర్శింతురు గాక! ఇదియే నా నమ్రనివేదనము.

(అనువాదము : వి. వి. యస్. శర్మ)





# బిల్ల మొత్రాడు



[ కథ ]

= శ్రీ 'కరుణాకుమార'

పల్లిపోతువారిది చాలా ప్రఖ్యాతిచెందిన కుటుంబం. రామిరెడ్డితండ్రి పల్లిపోతు కృష్ణారెడ్డిని గురించీ, అతనితండ్రి వెంకురెడ్డినిగురించీ రెడ్డిగారి పల్లెలో ఇప్పటికీ కథలు చెప్పుకొన్నట్టు చెప్పు కుంటూఉంటారు. ధాతకరువులో వెంకురెడ్డి పేదలకు చేసిన అన్నదానం, గ్రామానికి ఆధారభూతమైన చెరువు వర్షాకాలంలో గండిపడి ప్రజలకీ, పైర్లకీ అపాయం కలిగే స్థితిలో ఆరెడ్డి ఒక్కడూ చెరువు కట్ట కాపాడడానికి చేసిన కృషీ, బాటసార్లు బసచేయ డానికి కట్టించిన ధర్మసత్రాలూ — ఏమేమిటో ఆరెడ్డినిగురించి రైతులు తలుచుకోని రోజుండదు.

కృష్ణారెడ్డికూడా అరవయినాలుగేళ్లు నిండిచి షష్టిపూర్తిఉత్సవం చేసుకొని తన హయాం గౌరవం గానే గడుపుకొన్నాడు. కాశీ, రామేశ్వరం వగైరా తీర్థయాత్రలు సేవించి గ్రామంలో రామలింగేశ్వర స్వామికి ఏకాదశరుద్రాభిషేకం చేయించి, అష్టాది వరానికీ బ్రహ్మాండంగా భారద్వాజవిందు చేశాడని అతన్ని బీదలు అమితంగా తలుచుకొని దణ్ణం పెట్టు కొంటూఉంటారు.

కృష్ణారెడ్డికి నలుగు రాడసంతానం తర్వాత కలిగిన పిల్లవాడు రామిరెడ్డి. తాను జీవించి ఉండం గనే నలుగురు కూతుళ్లనీ సంపన్న గృహస్థుల యిండ్లలో యిచ్చి వివాహాలుచేసి, తర్వాత కొడుకు రామిరెడ్డికి కూడా ఓ అయినయింటి పిల్లని పెళ్లిచేసి అయిదారేళ్ళ క్రిందటనే కాలంచేశాడు కృష్ణారెడ్డి. చిరకాలానికి కలిగిన మొగపురుసుకొడుకు రామిరెడ్డి అంటే ఆ తల్లికీ, ఆ తండ్రికీ అబ్బురంగా ఉండడంలో ఆశ్చర్యంలేదు. సాంప్రదాయికంగా వచ్చిన పల్లాల మాగాణీభూమి గాక, రామిరెడ్డికి పిత్రార్జితంగా సంక్రమించిన ఏభయ్యెకరాల మాగాణీ మెట్టలూ, పశువులబీడూ, ఆవులూ, కోడెలూ - సమస్తమూ అమిర్చి పెట్టినట్టు చేతిలోపెట్టి మరీ కాలంచేశాడు కృష్ణారెడ్డి. ఈఆస్తి గాక క్షేమయిన రెండు మండువాల లోగిలీ, ధాన్యపు కొట్లూ, దొడ్లో అరటితోటా, కొబ్బరితోటా, ఆడ వాళ్ల వంటిమీద బంగారునగలూ, వెండిసామానూ— ఒకటేమిటి, సిరి అందుకోసంతకాలమేగాని, అందు కొంటే ఆతల్లి అనంతమైన ఆకారాలతో అవతరి స్తుంది.

రెడ్డిగారి పల్లెలో గల నాటఏభయి తేతకాపుల కుటుంబాలలోనూ రామిరెడ్డికుటుంబం మకుటాయ మానంగా ప్రకాశించిపోతోందని ఇక వేరే చెప్పాలా! రామిరెడ్డికి ఇంటా, బయటాకూడాకావలసి నంత బలం, బలగమూను. ముప్ఫయ్యేండ్లయినా నిండని వయస్సూ, తండ్రి సంపాదించి యిచ్చిపోయిన ఆస్తీ, గ్రామంలోని రైతాంగం యావత్తూ తనకి బీరకాయ పీచుచుట్టరికం, పైగా వంశపారంపర్యంగా వస్తున్న గ్రామమునసబుఅధికారం — బంగారానికి వెలి గారం అతికినట్లు ఒక దాని కొకటి అతుక్కొని అతని జీవితాని కందమే కలుగచేస్తున్నవి.

తాత తండ్రులు సంపాదించియిచ్చిన ఐశ్వర్యం ఎంత ఉన్నప్పటికీ అసలు జన్మతః మనిషిలో ఒక

విశమైన తెలివి నేటా, రాబూ దర్పం ఉండకపోతే ఆ ఐశ్వర్యానికిగాని, అతగాడి జీవితానికిగాని రాణింపూ ఎన్నికా సిద్ధించదు. భగవంతుడు రామిరెడ్డికి ఆ కొరతా తీర్చాడు. ఆ మాటకి వస్తే అతగాడి చలాకీకీ, అతని ఆలోచనలకీ, దర్జాకీ తగిన ఆస్తి కానేకాదేమో ఆ తండ్రియిచ్చిన ఐశ్వర్యం.

వాళ్లువిరుచుకొని పెద్దచదువులు చదివి ఉద్యోగాలూ ఉద్యోగాలూ అవసరంగల కుటుంబం కాదు కాబట్టీ, ప్రస్తుత కాలమానాన్ని బట్టీ, సంప్రదాయాన్ని బట్టీ స్కూలుఫయినలు వరకూ మాత్రమే చదివి పరీక్షకు కూర్చొని ఫేలయి ఊరుకున్నాడు రామిరెడ్డి. ఫేలయిన పరీక్ష ఎంగిలికూడువతుగా కోతనిపించి దానిని కాలిచెప్పును విసర్జించినట్లు విసర్జించి, తండ్రి గతించినవెనుక సంక్రమించిన సంసార భారాన్ని భుజాన వేసుకొని ఈదులాడుతున్నాడు.

ఈదులాడడానికి-రామిరెడ్డికి సంసారం ఒక లెఖ్ఖా, జమా, ఖర్చా? అందులో యుద్ధంవచ్చి బ్లాకుమార్కెట్టులో పుట్టి నాటువీభయి, రెండువందలూ వడ్లు అమ్మే రోజులేమో—అతను పట్టినదల్లా బంగారముద్దయిపోతోంది. చేటలో వడ్లగింజ పడవేస్తే బంగారాన్ని బలికోరుతోంది. ఏరువాక తిరిగి ఏరువాక అందుకొనేసరికి, కుప్పలమీదనే బేరం తెగ్గొట్టి సంవత్సరానికి హీనపక్షం ఇరవయిమూడు వేలదాకా ఇనప్పెట్టెలో విసిరిపారేస్తున్నాడు.

పేరుకు పెద్దకుటుంబం అన్నమాటేగాని, ఇంట్లో తినేవాళ్లు మాత్రం ఎవరున్నారు? తనూ, తన భార్యా, తల్లీని. ఒక కొడుకూ, ఇద్దరు కూతుళ్లూ తనకి కలిగారుగాని, వాళ్లింకా కసుగాయలు. ఎటువచ్చీ ఈ రెండువందలెకరాల కమతమూ, సేద్యం నాద్యం, గొడ్డూ గోదా, దూడా దుడికీ—వీటిమీద అజమాయిషీచేసుకొంటూ కయ్యలో పండిన ధాన్యం గడపలో చేరేవరకే అతగాడికి తాపత్రయం. ఈ తాపత్రయం కూడా లేకుండా కరుణించి యానాది సుబ్బడిని రామిరెడ్డికి ప్రసాదించాడు భగవంతుడు.

ఇంతలావు కమతంమీదా సుబ్బడు, అహోరాత్రశ్శ్వా, కంటిలో వత్తివేసుకొని, గడ్డిపోచకూడా అన్యాక్రాంతం గాకుండా కాపాడుతున్నాడు. సుబ్బడు రామిరెడ్డికి సుండెకాయ అయిపోయినాడు.

సుబ్బడు మంచియానాదివాడు. యానాదులలో మంచి యానాదులనీ, చల్లాయానాదులనీ రెండు తెగలు. చల్లాయానాదులు ఎంగిలివిస్తరాకులలో పారేసిన కూడు తింటారు—మంచియానాదులు తినరు.

సుబ్బడి తండ్రి పాపడు కృష్ణారెడ్డితండ్రి హయాంనుండీ ఆకుటుంబాన్నే అంటిపెట్టుకొని జీవించాడు. చిన్నతనంలో పాపడు వెంకురెడ్డి ఎక్కే తెల్లగుర్రాన్ని మేపుతూ, మాలీసుచేస్తూ నౌకరీచేసేవాడట. వెంకురెడ్డి ఆగుర్రం ఎక్కి ఏ ముసాఫరుకు వెళ్లినా ఆగుర్రంవెంబడే పాపడుకూడా వెళ్లవలసినదేనట. గుర్రంనడకతో నడకా, తరటుతో తరటూ, గాలపుతో గాలపూ—దానితోక పట్టుకొని ఎంతదూరమైనా కూడా పరుగుతో పోయేవాడట పాపడు. వెంకురెడ్డి గతించినతర్వాత కృష్ణారెడ్డి గుర్రపుస్వారీ చేసే రోజులలోకూడా పాపడు అదేప్రకారం ఖామందువెంట పోయేవాడటగాని, కొంతకాలం గడిచేసరికి పాపడికి ఈపరుగువల్ల గుండెజబ్బు ఏర్పడి ఖాయిలాతో మంచానబడేవరకు, కృష్ణారెడ్డికి మనస్సు కరిగి, ఇంక తాను గుర్రం ఎక్కడం లేదని వొట్టుపెట్టుకొని ఆగుర్రాన్ని అయినకాడికి అమ్మిపారేశాడని అనుకొంటా రాగ్రామంలో. మొత్తానికి పాపడు జీవించి నన్నాళ్లూ పల్లిపోతువారి కుటుంబాన్నంటిపెట్టుకొనే జీవించి కృష్ణారెడ్డికంటే పదేళ్లు ముందుగా వాడు చనిపోయినాడు. పాపడు జీవించిఉండంగనే కలరా చనిపోయింది వాడి భార్య చెంచి. చెంచి చనిపోయేవరకు సుబ్బడి కయిదోఏడు.

పాపడికీ, చెంచికీ కలగడానికి ఓ అయిదారుగురుపిల్లలు కలిగారుగాని ఏంక్రియ? చెంచి చని

పోయేవరకు పాపడికి దక్కిన బిడ్డడు సుబ్బడొక్కడే. తల్లిలేని ఆ అయిదేళ్ల పిల్లవాడుకూడా గతించిన సంతానంలాగునే తనకు దక్కడని పాపడు నిరాశ చేసుకొని వాడిని పెంచడానికి చేతగాక ఒకమారూ, కష్టమనిపించి ఒకమారూ సుబ్బడివిషయమై తాను తాపత్రయపడేవాడే కాదు. రాత్రిగాని, పగలుగాని తనేదయినా పనిమీద పోవలసిఉంటే, సుబ్బడిని ఏ గడ్డివామిలోనో పండబెట్టి గడ్డికప్పి వెళ్లిపోతుండే వాడు. పెంచి గతించిన తర్వాత సుబ్బ యోగ క్షేమాలు కృష్ణారెడ్డిభార్య లక్ష్మమ్మ వాపన్న అప్పుడప్పుడు విచారిస్తూ ఉండినప్పటికీ, ఆ కుర్ర కుంక గడ్డివాముల్లో పెరుగుతుండినట్లు ఆమెకు తెలియదు. తన దొడ్డిలో అరటితోటలోని గుడిశలో పాపడిచేతుల్లో పెరుగుతున్నాడనే ఆమెగమనం.

ఒకనాడు ఉదయం లక్ష్మమ్మ తన పశువుల దొడ్డిలో ఆవుపాలు తీయించడానికి పోగా, గుంజకు ఆవు మేతమేయడం చాలించి కొమ్ములతో ఆ తట్టుగా లాక్కొని బుస్సుమంటూ మీదపడుతోంది. మళ్లా అంతలోనే గడ్డివేసిన గాటిలో దేనినో నాలుకతో నాకుతోంది. లక్ష్మమ్మకి అర్థంగాక సమీపించి చూచేసరికి, ఆ తట్టు నల్లని కృష్ణసర్పం ఒకటి గజంఎత్తున పడగఎత్తి చీలిన నాలుకలు చాచి బుస్సు కొట్టుతూ తల నేలనేసికొట్టుతోంది. ఆవు తిరిగీ కొమ్ములతో కుమ్మబోయి గాటిలో నాలుకతో నాకుతోంది. పామును చూచేసరికి 'అమ్మో'అని అరిచింది లక్ష్మమ్మ. ఎత్తిన పడగ దించి పడమటగా పాకిపోయింది సర్పం. గాటిలో ఆవు నాకుతూ ఉండిన అయిదేళ్ల పిల్లవాడు- సుబ్బడు - కళ్లు నులుముకొంటూ లేచికూర్చున్నాడు. ఆమె గుండెలు కొట్టుకొని వాణ్ణి ఇంట్లోకి తీసుకొనిపోయి, ఆ క్షణంలగాయతు సుబ్బడు తన తండ్రితో ఉండడానికి వీలులేదని, వాణ్ణి తన యింటిలోనే పెట్టుకొని, కొడుకు రామిరెడ్డితో సమానంగా పెంచుతూ వచ్చింది లక్ష్మమ్మ. తనకి సగంపీడ వదలిందని తల తడుముకున్నాడు పాపడు.

సుబ్బడికి పదేళ్లు వచ్చేవరకూ బ్రతకాడు పాపడు. వాడు గతించిన తర్వాత సుబ్బడికి కృష్ణారెడ్డి తండ్రీ, లక్ష్మమ్మ తల్లీ, రామిరెడ్డి అన్నా అయిపోయినారు.

ఆ సంసారంలో తన కేమికొరత? వేళకు పిడికెడు మెతుకులు. కాస్త గ్రాహ్యం తెలిసే ఈడు వచ్చేవరకు, ఇంట్లో పాడిపశువులను బయటకు తోలుకొనిపోయి మందబయట తిప్పుకొనివస్తుంటే మధ్యాహ్నాలా కడుపునిండా అన్నం పెట్టుతూనే ఉన్నది లక్ష్మమ్మ. రామిరెడ్డి బడికి పోతుంటే సుబ్బడు అతగాడి పుస్తకాలు బడికి తీసుకొనిపోయి, తాను బర్రెగొడ్లను బయటికి మళ్లవేసుకొని వస్తున్నాడు.

కాలం పెరిగినకొద్దీ పిల్లలు రామిరెడ్డీ, అటు సుబ్బడూకూడా పెరుగుతున్నారు. ఇద్దరి వయస్సులో నాలుగయిదేళ్లు తేడా ఉండినప్పటికీ, యుక్తవయస్సు వచ్చేసరికి పొడగట్టిన యౌవనంలో మాత్రం తేడాలు కనిపించడంలేదు. రామిరెడ్డి కేమి-మహారాజు బిడ్డ. ఇరవయ్యేళ్లు నిండకుండానే తండ్రి బంగారువంటి పిల్లని పెండ్లిచేసి పెద్దవాణ్ణి చేశాడు.

ఒకఏడుమీద మరొక ఏడు పడేవరకు, సుబ్బడు, పద్దెనిమిదేళ్లకే పాతికేళ్ల మనిషిలా తయారయినాడు. వీధినబడి పోతూంటే వాణ్ణి చూస్తే దిష్టి తగులుతుందేమోనన్నంత భయం కలుగుతోంది. నల్లని జీడిగింజరంగు శరీరం నిగనిగ మెరిసిపోతోంది. సృష్టిలోని యౌవనం కరిగించి పోసిన విగ్రహం—ఉక్కుగుండులా బిర్రుతేలింది ఆకారం. రెండు హస్తాలూ జోడించి పట్టినగాని అందడంలేదు కండలు తిరిగిన దండలు. ఆ యీడుకే ఆరడుగుల ఎత్తు-ఆజానుబాహువయిపోయినాడు సుబ్బడు. మూతిమీది నూనూగు మీసం, కళ్లమీది కనుబొమలు సన్నని నల్లమొఖమల్ పట్టుల్లా నిగారింపుతో మిరుమిట్లు గొలుపుతున్నవి. ఆ ముఖవికాసంలో తెల్లని నేత్రాలు వాని ఆకారానికి ఎంతశోభ తీసుకొనివచ్చినవి! పురుషునికిగాని, స్త్రీకిగాని నవయౌవనంకంటె మించిన ఐశ్వర్యం మరొకటేమున్నది?

తన చేతుల్లో స్వయంగా పెంచిన లక్ష్మమ్మకే గాదు, అసలు గ్రామంలో అశేషజనానికీకూడా సుబ్బడు యానాదివాడన్న సంగతి విస్మృతిలో పడి పోయింది. అటువంటి మనిషి యింట్లో తిరుగుతుంటేనే చాలునన్నంత మోహనంగా ఉన్నది వాడి మోహనాకారం. అటువంటి సుబ్బడు తనకు బానిసీడు, తన బంటు అయినాడంటే రామిరెడ్డి కెంత గర్వం!

సుబ్బడిమీద పెరిగిన ప్రేమవల్ల లక్ష్మమ్మ వాణ్ణి 'సుబ్బులూ' అని ముద్దుగా పిలుచుకోవడమేగాని 'సుబ్బా' అని పిలవడం కొన్ని ఏళ్లుగా మరచిపోయింది. అదిగాక వయస్సువచ్చి పెద్దవాడవుతుండినందువల్లా, వానియందు పొడగట్టిన పెద్దగుణములవల్లా, లక్ష్మమ్మకే గాదు గ్రామస్థులకు కూడా వానియందు గౌరవమూ, ప్రేమా ఏర్పడి, ఎవరు పిలిచినా 'సుబ్బులూ' అనే పిలుస్తూ వస్తున్నారు.

సుబ్బులుది మొండిధైర్యం. వదురులేదు, బెదురు లేదు. రాత్రి ఎరగడు, చీకటి ఎరగడు. పామెరగడు, పురుగెరగడు. అర్ధరాత్రి జోరున పిడుగులుపడే వర్షంలోనయినా పొలం పోవలసిఉంటే ఒక్కడూ ఆపనిమీద పోవలసినదే. రెండేళ్లక్రిందట రాత్రిపూట పొలంలో వడ్లకళ్లందగ్గర ఒంటరిగా పండుకున్నప్పుడు, ప్రక్కన కాపలాకాచే కుక్కని పట్టుకోను వచ్చిన చిరతపులిని చేతిబరిశె తీసుకొని పొడిచిన పోటుకు, అంతలావు పులీ అవులించి ప్రాణంవిడిచింది. బరిమీద పరుగుపెట్టే తాచుపామును తోకపట్టుకొని నేలకేసి కొట్టుతానని బయలుదేరుతాడు. అట్లతద్ది పండగకి, అమ్మవారి దేవళాని కెదురుగా మర్రిచెట్టు కొమ్మకు కట్టిన ఉయ్యాల ఊగడానికి వచ్చిన అట్లతద్ది ఆడపడుచులను ఉయ్యాలలో కూర్చోబెట్టి జనపనార మోకు పట్టుకొని ఊపడంలో, ఉయ్యాలతో గూడా ఆకాశంవరకూ లేచి సుబ్బులు క్రిందికి మోకుతుంటే ఢణా ఢణా అని అదిరిపోతుండేది భూమి. వానిచేత ఉయ్యాల ఊపించుకోను అవూరి కాపుపడుచుల కెంత మనసు!

వ్యవసాయకృషిలో సుబ్బులుకు తెలియని పనిలేదుగదా! అటు వడదుక్కిలోగాని, ఇటు రొంపిదుక్కిలోగాని, వాడు కయ్యలోదిగి నాగేటి మేడితోక పట్టుకొంటే, పదేసినందల రూపాయలు కిమ్మతుచేసే రెడ్డిగారి పెద్దఎద్దుల జతకూడా గడగడ లాడి పోవలసిందే. వాడి చేత్తో గుంటక తోలి, నల్లమానూ, కర్రలమానూ ఒక్కసారి అట్లా ఆడిస్తే చాలు — నుసుకు అంతా పోయి కయ్య అలాఉండవలసిందే. నాగేలిఅర్రు మీదపెట్టి, వార్ణిబిగించి, పణతకొయ్య ఆరుపట్టుకొని, వాడు చాలు దోలితే, ఒక్క మడకతోనే కయ్య పదును తేలి చాడవేసుకో వచ్చు. విత్తనం ఏ అదున్న చల్లాలో, ఏ అదునులో యారాలుకట్టి పులకవామడుతీసి కయ్య ఆరగట్టాలో- సుబ్బులుకు తెలిసినట్టు మరొక సేద్యగాడికి తెలియదని అనుకొంటారు. సరిగదా, ఏరువాక వచ్చి, విత్తనాల పట్టులో గింజ చల్లాలంటే, వినాయకుడికి పెట్టుకొని ముందు సుబ్బులుచేత్తో గింజ చల్లిస్తుంది లక్ష్మమ్మ. వాడిచెయ్యి పట్టితే బంగారుపండుతుందని గ్రామంలో ప్రతీతి.

పుట్టుకలగర కట్టి మిట్టలుం తేలబెట్టుతాడు. మోపు పైకిలేచేసరికి రెండు, మూడు కలగరలు పెట్టి నీళ్లు నిలవేస్తాడు. వ్యవసాయంపను లారంభించిన గడియ మొదలుకొని, ఆపైరు ఫలితానికి వచ్చి, పండిన గింజలు ఇంట్లోకి చేరేవరకూ సుబ్బులుకు నిద్రపట్టదు. ఎక్కడెక్కడ ఏయే కయ్యలో నీళ్లు పులక జేలి పోయాయో, ఏ కయ్య ఆరగట్టాలో, ఏకయ్యకు నీళ్లు ఎద్దడయినాయో — అబ్బ!, సుబ్బులుకున్న మెలకువ రామిరెడ్డి కేదీ! మొలకచేనుమీద రాత్రిళ్లు చిలవ పక్షులు వాలకుండా కిరసనాయిలుడబ్బా చేతపట్టుకొని తెల్లవారులూ అట్లా రాంభజన చేస్తూనే ఉంటాడు సుబ్బులు.

ఒక్కటేమిటి - వరినాట్లు అయిన క్షణంలగాయతు సుబ్బులుకు కయ్యలోనే కాపరం. రెడ్డిగారి చేలో ముళ్లపాచి కెనిపించిందంటే వానికి వంటిమీద ముళ్లుగుచ్చుకొన్నట్టుంటుంది. తుంగా, గాబా,

పాదరా కోయించి, కలుపు తీయించేవరకూ ఊరు

కయ్యలో పైరు పాలుపోసుకొని, సుంకు మీద పొట్టతేలి, కరుగు మోపించేవరకు - ఇక సుబ్బులుసంతోషం చెప్పలేము. కరుగు మోపిన పైరు ఎర్రబారి, అరుదెంచిందనంగనే - మంచిరోజు చూచుకొని, రెడ్డిగారిచ్చే కొత్త పంచలు కట్టుకొని, ముఖాన్న కుంకుమ అద్ది, కయ్యలో వంగి, మూడు పిడికిళ్లు పిడితరిగి, వినాయకుడికి వోదెవెయ్యడం ఎప్పుడబ్బా అని వాడికి ఒకటే కలవరింపు. పైరు కోతకి వచ్చిందనేసరికి, వర్లాబత్తుడు అచ్చయ్య కొలిమి కాడికి పోయి, దగ్గర ఉండి ముందు తన కొడవలికి చందనపు పిడి, ఇత్తడిపొన్ను తరిమిణి పట్టించి కక్కుకోసి సరిపించేవరకూ వాడికి స్తిమితమేదీ? పొలం పని అంటే ఆ సంతోషమేమో చెప్పలేము. పుష్య మాసంలో పెద్దపండగ చేసుకొని, వరికోతలకు జనం నొంగుతున్నారనంగనే - ఎప్పుడు చేయించిపెట్టాడో వెయ్యిపనకట్టలు పేడించిపెట్టాడు సుబ్బులు. అట్లాకోసిన పన, వోదలేసేవాళ్లు వేస్తుంటే, ఇట్లా కుప్పలు వేసే వాళ్లు వేస్తుండవలసినదే. ఇంతలావు కమతంమీదా ఎక్కడుంటాడో, పనివాళ్లని వెయ్యికళ్లతో కని పెట్టుకుంటాడు. కుప్పవేయడంలో పనివాళ్లు బద్ధకించి ఎగాదిగా వేసినట్లు కనిపించినా—చేతిలో తట్టు పలకా, తనూ తయారు. కరుగూ, అద్దా, పూరూ_ తను స్వయంగా వచ్చి, తట్టితేనేగాని వానికి తృప్తి లేదు. సుబ్బులు కప్పిన కుప్ప ముద్దులుమూటకట్టుతుందని ఆవూళ్లో పెద్దపెద్ద ఖామందులే వాడికి కితాబులు చెల్లించారు.

కమతంలో ఉంపేడాని కింకా ఉన్నారు తలమనుష్యులూ, సేద్యగాళ్లూను. కాని వాళ్లందరికీ సుబ్బులంటే సింహస్వప్నం. వొళ్లుదాచి పనిచేయడానికి వాళ్లకి గుండెలేవీ? ఒకానొక పట్టులో రామిరెడ్డి నయినా కళ్లుగప్పడానికి వీలున్నదిగాని, సుబ్బులుని మరిపించడానికి వాళ్లకు వీలేదీ ?

## 3

సుబ్బులుకు పాతికేళ్లు నిండిపోవి. తనపనేమో— అంతే. ఇక రెండో ప్రసక్తి అతగాడికి కొబట్టదు. తనతో సమానంగా పెరిగిన రామిరెడ్డి పెళ్లి చేసుకొని అప్పుడే ముగ్గురుబిడ్డల తండ్రి అయినాడు. తన జీవితంలో యౌవనం వికసించి విజృంభిస్తోంది. సుబ్బులుకుకూడా వివాహం జరగవలసిన రోజులు.

"పిల్ల చదువు చాలించి యింటికాడనే ఉంటున్నది. ఇప్పటికే ఇద్దరికీ పెళ్లి ఈడు తప్పింది. రెడ్డిగారి మాట తీసుకొని తొందరగా వచ్చి పెళ్లి చేసుకొని వెళ్లవలసిం"దని ఏటిఅవతల కమ్మవారిపాలెంనుండి సుబ్బులు మేనమామ జువ్వడు కబురుచేశాడు. ఇంక ఆలస్యం చేయడానికి వీలులేదని, లక్ష్మమ్మదగ్గరికి పోయి, "అమ్మా!"అని పిలిచాడు సుబ్బులు.

"ఏమి నాయనా."అన్నది ఆఅమ్మ.

"ఏటిఅవతలనండి, మా మామ నన్ను రమ్మని కబురు పంపాడు. పోయివస్తాను."అన్నాడు సుబ్బులు.

"అక్కడ మీవాళ్లందరూ బాగున్నారేనా ?" అని బంగారుపడుతూ అడిగింది లక్ష్మమ్మ.

"అందరూ బాగానే ఉన్నారు. పిల్లకి పెళ్లి చేయాలి, ఒకసారి వచ్చి మాట్లాడిపొమ్మని కబురు చేశాడు మామ."అన్నాడు సుబ్బులు.

"మేనమామకూతుర్ని పెళ్లి చేసుకోంటావుటరా! నాతండ్రే. తప్పక వెళ్లి, తొందరగా రా. పెళ్లికొడుకుని చేసి పంపుతా"నని సుబ్బుల్ని దీవించి పంపింది లక్ష్మమ్మ.

సుబ్బులుమేనమామ జువ్వడు మొదటినుండీ కమ్మవారిపాలెంలోనే కాపరం. రెడ్డిగారిపల్లె రెడ్డి కాపుల కెట్లా ఆటపట్టయిందో, కమ్మవారిపల్లె కమ్మవారి కావిధంగా ఆలవాలమైపోయింది. ఆవూరికీ ఈవూరికీ నడుంగా చిలకలేరు అడ్డం. ఎన్నడో ఇక్ష్వాకుల కాలంలో ఆవూరి కమ్మవారికీ, ఈవూరి రెడ్లకు సయోధ్యత కలిగి మమేకంగానే ఉంటూవచ్చారట గాని, ఇటీవల పాతిక, ఇరవయ్యేళ్లనుండి మనస్పర్థ లేర్పడిపోయినవి. పాతికేళ్ల క్రిందట, ఎందుకు వచ్చిందో—ఈరెండుఊళ్లకీ నడుంగా ఉండవలసిన పొలిమేరనిర్ణయంవిషయంలో వారికీ వీ( పెద్ద తగాదా పడిందని అంటారు. చిలకలేరు ఇవతలగట్టువరకూ

మాపొలిమేరే అంటారు కమ్మవారు. అట్లా కాదు, అవతల గట్టువరకూ రెడ్డిగారిపల్లెపొలిమేరే అంటారు కాపులు. చిలకలేరునదిని పూర్తిగా తమతమ పొలిమేరల్లో చేర్చుకోవాలని ఆ ఇరుపక్షాలవారికీ పట్టుదల. ఇంతకీ, ఈపొలిమేరతకరారు రావడానికి కారణమేమిటంటే- ఇటు రెడ్డిగారిపల్లెలో ఒక చెరువూ, అటు కమ్మవారిపాలెంలో ఇంకో చెరువూ ఉన్నవి. ఈ రెండు చెరువులకూ కూడా, ఊరికి పడమరగా, రెండుమైళ్లదూరంలో చిలకలేరులో ఆనకట్ట కట్టించి, ఆ చెరువులోనికో కాలవా, ఈ చెరువులోనికో కాలవా — రెండు ఫస్లయి కాలవలు నదిలోనుంచే తవ్వించారు సర్కారువారు. ఆనకట్టకట్టు దిట్టంగా ఉండిన రోజుల్లో ఏటికి నీరు తగిలినవెంటనే ఈ రెండు చెరువుల్లోకీ నీళ్లు ధారాళంగా పోయి, సకాలంలో చెర్వులు నిండుతూవచ్చినవి. మరి రానురాను, ఆనకట్టకి మరమ్మతులు లేక శిథిలమే అయిపోయిందో, లేక అసలు వరవకాలవల అంజీపని రైతులు సరిగా చేసుకోనందువల్ల అవి పూడిపోయిన కారణంచేతనో — ఇటీవల ఏటికి ఎంతెంత వరద వచ్చినా పూర్వం నిండినట్లు చెరువులు సక్రమంగా నిండడంలేదు. దానితో నీళ్లకు ఎద్దడయి, వచ్చిన నీళ్లన్నీ తమ చెరువుకు గానీయకుండా వాళ్ల చెరువుకే పెట్టుకొంటున్నారని కాపులూ, మా చెరువుకు అసలే నీళ్లు రానీయడం లేదీరెడ్డిగాళ్లని కమ్మవారూ — ఒకరిమీద ఒకరు నేరారోపణలు చేసుకొని అధికార్లకు అర్జీలూ పిటీషనులూ పంపుకొన్నారు. అధికార్లు చేసిన ఉత్తర్వులు ఉభయులకూ తృప్తికరంగాక-చివరకు వాళ్లూ వీళ్లూ ఏటికడ్డంగా కలియబడి కొట్టుకొని రైటింగులూ, ఖూనీలూ చేసుకొన్నారని ఏనాటి గాథలో చెప్పుకొంటుంటారు. దానిమీద సర్కారువారేమో రెండు గ్రామాలకీ పొలిమేర సరిహద్దు ఏటికి నట్టనడుంగా పోవాలని తీర్మానించి, ఆనకట్ట దగ్గర ఏటికి నడుంగా ఒక లంకగా కట్టించి, పైనవచ్చిన నీళ్లు ఏటిలోనే రెండుభాగాలుగా పంపకం అయేటట్టు చేసి రహితపెట్టారని అంటారుగాని — ఆనాడు రగుల్కొన్న అగ్ని ఇప్పటికీ చల్లారలేదు. తదుపరి-జిల్లా బోర్డులకీ శాసనసభలకీ ఎన్నికలంటూ రావడం-వాటిలో రామిరెడ్డి ఒక పార్టీ తరఫున నిలబడితే కమ్మవారు కాంగ్రెసుతరఫున పోటీచేయడం - ఇట్లనే కావిష్యాలు పెరిగిపోయినవి. చివరకు కమ్మవారిపాలెం కాంగ్రెసు గ్రామం, రెడ్డిగారిపల్లె ఇంకోపార్టీ గ్రామం అయి, వారిని వీరూ, వీరిని వారూ పబ్లికుగా దూషించుకోవడంలోకి దిగింది.

పాతికేళ్ల క్రిందట జరిగిన కొట్లాటకేసులో జువ్వడుకూడా కమ్మవారితరఫున గలాటాలో ఉన్నాడని వాడిమీదకూడా పోలీసులు కేసుపెట్టితే, సెషన్సు కోర్టులో అయిదేళ్ల శిక్షపడి, శిక్షానంతరం విడుదల అయి యింటికి తిరిగివచ్చాడట. తమ తరఫున నిలబడి కాపులమీద తిరగబడడమే కాకుండా, ఆ గలాటాలో తలమీద బలమైన గాయంకూడా తిన్నాడని కమ్మవారికి వాడిమీద అభిమానం కలిగి, వాడు తిరిగిరావడంతోటే, ఏటివొడ్డున మంచి వొనరయిన స్థలంలో వాడికోయిల్లు కట్టించి, రెండెకరాల మాగాణీ కయ్యకూడా తీసియిచ్చారు. వాడి కొడుకు-సుబ్బులు ఈడువాడే-యిటీవలదాకా ఇంట్లోనే ఉండి ఆ కయ్య దున్నుకొని తండ్రినీ, తల్లినీ పోషిస్తూఉండేవాడు. కాని యుద్ధంవచ్చిన కొత్తల్లో వాడు ఎవరితోనూ చెప్పకుండా చెన్నపట్నంవెళ్లి మిలిటరీలో చేరిపోయాడు. జువ్వడికి ఆ కొడుకు తర్వాత ఒక్కతే ఆడపిల్ల-రమణి. మిలిటరీలోకి పోయినకొడుకు నెలకు పదీ పదిహేనూ ఇంటికాడ తండ్రికి పంపుతూనే ఉన్నాడు. అయితేనేం-జువ్వడు పెద్దవాడయిపోయి కళ్లు కనిపించక, సేద్యం నాద్యం చేసుకోలేక, కూతురు రమణిని మేనల్లుడు సుబ్బులు కిచ్చి వివాహంచేసి, వీలయితే వాణ్ణి కమ్మవారిపాలెం పిలిపించుకొందామని ఆశపడ్డాడు.

జువ్వడికొడుకు మిలిటరీకి పోకపూర్వమే, కమ్మవారిపాలెంలోని కాంగ్రెసునాయకులు ఆ గ్రామంలో హరిజనులకు, కేవలం పతితులయిన యానాదులకు కాలనీలు కట్టించి, వాండ్ల విద్యాభివృద్ధికి పాఠశాలలు నిర్మించి, సర్కారువారివల్ల అంగీకారమూ

గ్రాంటూ సంపాదించిపెట్టారు. నలుగురితోపాటు రమణికూడా ఆ పాఠశాలలో ప్రవేశించి చదువుకొన్నది.

ఇప్పుడు రమణికి పదునిమిదేండ్లుంటాయి. యుక్తవయస్సు వచ్చింది. ఎనిమిదో తరగతి పేసయింది. చదువుతోపాటు పాఠశాలలో అల్లికా, కుట్టూ, రాటంమీద నూలుతీయడం, పాటా పద్యం నేర్చుకొన్నది.

౪

లక్ష్మమ్మ దగ్గర శెలవుతీసుకొని సుబ్బులు కమ్మవారిపాలెం బయల్దేరివెళ్లాడు. పిల్ల రమణిని చూచుకొన్నాడు. అదివరకు అప్పుడప్పుడు మేనమామగారింటికి వెళ్లి ఒకపూటో అరపూటో ఉండడం, మంచి శబ్బరలు మాట్లాడుకొని తిరిగిరావడం జరుగుతూనే

సుబ్బులు కమ్మవారిపాలెం వెళ్లి ఆరునెలలయినట్టయింది. ఇంతకాలం చూడక ఎడమయిన కారణం వల్లనో ఏమో-ఇప్పుడు చూచుకుంటే అతని కళ్లకి విస్తుకలిగిస్తోంది రమణి. తనకంటె ఏ డెనిమిదేళ్లు చిన్నవయస్సయినప్పటికీ ఆపిల్ల తన భుజాలు దాటి చెవిగూబలవరకూ పోటీచేసేటట్టు ఏపుగా పెరిగిపోయింది. మనిషిలో పూర్వపు పసితనపు పచ్చివదలి నేవళం కమ్ముకొని, చామనచాయ చెక్కిళ్లలో కొత్తరక్తం ఉబికి పన్నీరుపుష్పాన్ని ప్రతిఫలింపజేస్తోంది. మెడ బోసిమెడ అయినా, ముతకఖద్దరు చీరమాటున కంటిమెడజాకెట్టువలయంలో, కంఠంలో రేఖ తేర్పడి ముద్దులుమూటకట్టుతున్నవి. సన్నని ఎర్రజీర ఏర్పడిన ఆమెవిశాలమైననేత్రాలలో, యౌవనపు సిరి పరిపూర్తి చెంది తొణికిసలాడుచున్నది. ఆరమణికి ఇంక అలంకారము లెందుకు, నగ లెందుకు? ఆమె మనోహరరూపము చూచేసరికి సుబ్బులుకు ఒక్కపెట్టున అనంతమైన కొత్తకోరిక లుబికి, పొంగి పొర్లిపోతున్నవి. సుబ్బులు గడపలో కాలిడిన వెంటనే—

"మామా! కాళ్లు కడుగుకో!"అని మట్టిముంతతో నీళ్లుతెచ్చి దగ్గర పెట్టింది రమణి.

వెళ్లి నాలుగుమాటలు మామతో మాటలాడి రాత్రికే యింటికి తిరిగిరావాలని వెళ్లాడుకాని, వెళ్లినతర్వాత ఆరాత్రి నిలబడి, మామతోనూ, అత్తతోనూ, రమణితోనూ సావకాశంగా ముచ్చటించనిది, వదలిరా బుద్ధిపుట్టలేదు సుబ్బులుకు. రాత్రి అన్నాలవేళ ముసలివాడు పెండ్లిమాట తలపెట్టి, పిల్లని ఇక నిలపడానికి లేదు, తొందరగా పెళ్లి చేసుకొని, కమ్మవారిపాలెం లేచి రావలసిందని ఆరంభించాడు. పెండ్లిచేసుకోడానికి మాత్రం వెంటనే అంగీకారాన్ని తెలుపుతూ, రెడ్డిగారి పల్లె విడిచిపెట్టి రావడంమాత్రం తనవల్ల కాదని స్పష్టంగాచెప్పేడు సుబ్బులు. వాడు కమ్మవారిపాలెం కాపరంరాకపోతేమాత్రం తన కూతుర్ని సుబ్బులుకివ్వడం తప్పుతుందా? "వెంటనే వెళ్లి పెళ్లికి లగ్నం రెడ్డిగారిపల్లెలోనే ఖాయపరచుకొని రావలసిం"దని కోరాడు ముసలివాడు.

ఆరాత్రి భోజనాలయినతర్వాత పొద్దుపోయే వరకూ ఏవో యుద్ధపుగొడవలూ, వ్యవసాయపు ముచ్చటలూ మాట్లాడుకొన్నారు మామాఅల్లుళ్లు. బయట వెన్నెట్లో నులకమంచంమీద రమణి వేసిన పక్కమీద పండుకున్న సుబ్బులుకుగాని, లోపల ఈతాకుచాపమీద పండుకున్న రమణికిగాని నిద్రపట్టనేలేదు. అర్ధరాత్రి అయినది. అర్ధచంద్రుడు నెత్తిమీది కెక్కికూర్చున్నాడు. ముసలివాళ్లిద్దరూ బర్రెగొడ్డుదగ్గర ఎడంగా కాళ్లమంచాలు వేసుకొని వొడళ్లుమరచారు. మొగకుక్క ఒకటి ఆడకుక్కను వెంబడించి సుబ్బులుని రాసుకొంటూ వేపచెట్టుక్రీనీడకు తరుముకొనిపోయింది. చెట్టుమీద కూర్కుచెందే రెండు పాలపిట్టలు అదిరిపడి లేచి కువకువమని గోలచేస్తున్నవి. శరీరానికి ఉక్కతగిలి మంచంమీదనే లేచికూర్చున్నాడు సుబ్బులు. "మంచినీళు కావలెనా?" అని లోపలనుంచి లేచివచ్చి అడిగింది రమణి. జవాబివ్వకుండగనే, సుబ్బులామెరెండుచేతులూ పట్టుకోగా ఆమె వెనక్కిమొఖంతిప్పి వొరిగింది. ఆవెంటతో లేచినిలబడి ఇద్దరూ పక్కనే చిలకలేరుకు పరుగుపెట్టారు.

వరదకు కొట్టుకొనివచ్చి కరడుకట్టిన యిసుకతిప్పపై బరువుగా పడే చిక్కని చంద్రకాంతి కరడుగట్టుతోంది. తిప్ప ఎక్కి ఒకరి చేతు లొకరు పట్టుకొని, ఎదురుముఖమై, "రమణీ!........"అని పిలిచి ఏమిటో చెప్పబోయాడు సుబ్బులు.

అదివర కెన్నిసారులు చూచుకోలేదు ఆ రమణి తన మామను! కాని ఆరాత్రి వెన్నెలకళలలో వెలిగిపోయే మామ రమణికి ఒక దేవతాపురుషుడులా ప్రకాశించిపోతున్నాడు. ఒక సన్నని లేతకిరణం అత

గాడి చిరునవ్వు పెదవులపై లేతమీసంమీదుగా పసిరిక పాములా పాకిపోయింది.

"మామా! ఎంతకాలమని అక్కడ నీవూ, ఇక్కడ నేనూ ఇట్లా పడివుండడం?" అని అడిగింది రమణి.

పాప మెరుగని వయస్సులో రమణి సుబ్బులు పెండ్లామై పుట్టిందని వరసయినవాళ్లు పరియాచకాలు పలుకుతుంటే, లేగదూడవలె నిష్కపటపుచూపు చూచి తెల్లబోయేవాడు. కాని, ఈనాడు రమణి సుబ్బులుభార్యగా పుట్టినమాట నిజమేనని ఘట్టి చేసుకొన్నాడు సుబ్బులు.

రమణి యానాదిసంఘాల ప్రాపకంచేత ఇంత కాలం చదువుకొని డొక్కశుద్ధిలేని తనని పెండ్లిచేసుకొంటుందా అని అప్పుడప్పుడు తనకి దిగులుపుట్టి, అంతలోనే ఆ దిగులు ఆరిపోతూండేది. తనవద్దనుండి ప్రస్తావన లేకుండగనే, మేనమామే కబురుచేసే వరకు సుబ్బులుకు మేరువు దొరికినట్లనిపించి ఇంటికాడ నిలవలేక ఎగిరివచ్చిపడ్డాడు. అట్టి పర్వదినం నాటి రాత్రి, ఏకాంతంలో రమణే వచ్చి తన చేతులలో కరిగిపోతున్నది. చిలకలేరులో అననుభూతమైన ఒక ఆనందమయ ప్రవాహం గట్లు తెగ్గొట్టుకొని ప్రవహించి, సుబ్బుల్ని ముంచెత్తి వేస్తున్నది.

"రమణీ! నువ్వు చదువుకొన్నావు. నాకు చదువురాదు. నన్ను నీవు పెండ్లిచేసుకొంటావా?" అని దీనంగా అడిగేడు సుబ్బులు.

"మామా, నేను చదువుకొన్నది నిన్ను పెళ్లి చేసుకొనేందుకే. నా చదువులో నేను మననం చేసింది నీస్వరూపమే." అన్నది రమణి.

ఆమె రెండుచేతులూ ఎత్తి పెదవులతో స్పృశించి కళ్లు మూసుకొన్నాడు సుబ్బులు. ఆస్పర్శ సుఖానుభూతికి కన్ను లరమోడ్పు మూతపడి తన ప్రియుని వక్షస్థలంపై వాలిపోయింది రమణి.

చంద్రుడు మబ్బుచాటుకు పోయి క్రింది వాళ్లకు తెరగప్పేవరకు, తెరమాటున రమణీ సుబ్బులు చిలకలేరు ఇసుక తిప్పనే ఆశ్రయించుకొని, సృష్టిలోని నిశ్శబ్దం భయంకరమనిపించేవరకు "ఇంక ఇంటికి పోదామ"ని లేచి రమణి తన యింటికీ, సుబ్బులు రెడ్డిగారి పల్లెకూ పయనమై వెళ్లి పోయినారు.

౫

ఎప్పుడు తిరిగి యింటికి చేరుకొన్నాడో సుబ్బులు— తెల్లవారి లక్ష్మమ్మ నిద్రలేచేసరికి, పడమటావుకు దాణాపెట్టి, దూడనివిడిచి, వెనక కాళ్లకు బందం వేసి, మోకాళ్లసందున మానికతప్పెలా పెట్టుకొని, తేనెటీగల మోతగా, జుంయ్యి జుంయ్యిమని పిండుతున్నాడు పాలు.

"రాత్రే వచ్చావేమిటిరా కమ్మవారిపాలెం నుండి? మరి రాత్రి అన్నానికి రాలేదేం?" అని అడిగింది లక్ష్మమ్మ.

"వేకువజామున లేచివచ్చాను. రాత్రి అక్కడనే ఉండిపోయాను." అన్నాడు సుబ్బులు.

"పెండ్లిమాట ఏమయింది?"

"రెడ్డిగారిపల్లె వెళ్లి లగ్నం పెట్టించుకొని రమ్మన్నాడు మామ." అంటూ నురుగునిండిన మానికతప్పెలా చేతపట్టి, బందంవిప్పి, దూడని విడిపించాడు సుబ్బులు.

పాలచెంబు చేతిలోకి అందుకొని, "అయ్యగారిని పిలిపించి, లగ్నం పెట్టిస్తానుండు." అని లక్ష్మమ్మ యింట్లోకిపోయింది. చద్దినీళ్లు త్రాగి సుబ్బులు పొలం పోయి పైటన్నానికి ఇంటికి రాంగనే—

"సుబ్బులూ! రేపు పున్నమివెళ్లిన దశమికి మంచి లగ్నం ఉన్నదటరా. అయ్యగారు వచ్చి లగ్నం కాగితంమీద వ్రాసి కోడలికిచ్చిపోయాడు." అని సుబ్బులుతో చెప్పింది లక్ష్మమ్మ.

సుబ్బులుశరీరం తేలికయిపోయి, "ఇంకెన్నాళ్లున్నదో?" అని అడిగాడు.

"ఆరోజూ, ఈరోజూగాక నడుంగా పదిహేను రోజు లున్నదని చెప్పాడు అయ్యగారు." అన్నది లక్ష్మమ్మ.

అన్నం తిని వెళ్లిపోయాడు సుబ్బులు.

రమణిని పెళ్లిచేసుకోవాలని సుబ్బులు ఎంత ఆత్రంగా ఉన్నదో, వాడు పెండ్లిచేసుకొని, పెళ్లి కూతురుని ఇంటికి తీసుకొనిరాగా చూడాలని లక్ష్మమ్మకూ అంత ఆత్రంగా ఉన్నది. మళ్లా తన రెండో కొడుకు పచ్చనిగుడ్డలు కట్టుకొని ఇంకో

ల్ని ఇంటికి తీసుకొనివస్తున్నట్టే ఆయిల్లాలి ఆనందం.

పెళ్లిరోజు ఎప్పుడు వచ్చినా అన్న ఆత్ర గాని—ఆపెళ్లి కేయే సంభారాలు కావాలో, నేమేమి తీసుకొనిపోవాలో, తనకు డబ్బెంత కావాలో, ఆకావలసిన డబ్బు లక్ష్మమ్మనే అడగాలో, రామిరెడ్డినే అడగాలో — ఈ ఆలోచనే తట్టలేదు సుబ్బులుకు. వీడి పెళ్లితాపత్రయం అంతా లక్ష్మమ్మ మాత్రం ఆక్షణం లగాయతు నెత్తిన వేసుకొని అదే ప్రయత్నంలో పడిపోయింది. "పెళ్లిచేసుకొ వస్తే, ఈ యానాదివాడు ఆ పిల్ల నెక్కడ పెట్టేం?" అని లక్ష్మమ్మకు ఆలోచన పుట్టింది. పాపడుండంగా అరటితోటలో కాపరం చేసే చుట్టుగుడిశ వాడు చని పోయిన తర్వాత ఏనాడో శిథిలమై పోయింది. అది లగాయతు సుబ్బులు రెడ్డిగారింట్లోనే తిని తిరుగు తుండినందున, వాడికి ప్రత్యేకంగా గుడిశవేసు కోవాలన్న ఆలోచనా కలగలేదు, అవసరమూ కని పించలేదు. తను ఏకాకి. చీకటిపడితే రాత్రిపూట ఏపొలంలోనో, రెడ్డిగారి ధాన్యపు కొట్లదగ్గరనో, పశువులసాలలోనో ఎక్కడ పండుకుంటే తెల్ల వారదు. కళ్లమీది రెప్పలు బరువెక్కితే ఆసమయా నికి తలమీద గుడ్డ తలకింద పెట్టుకొని వీరాంజనేయస్వామి దేవళంఅరుగుమీదనో పండుకొని నిద్దరపోతూ వుంటా న్నాడు సుబ్బులు.

భార్యను తీసుకొని వచ్చేలోపల సుబ్బులుకు ప్రత్యేకంగా ఒక "ఇల్లు"అని ఏర్పాటుచేస్తేనేగాని వీలులేదని, ఆరాత్రి భోజనాలవేళ ఈసంగతి రామి రెడ్డితో ప్రస్తావన చేసి, అరటితోటకి తూర్పుగా ఆను కొనిఉన్న కొబ్బరితోటలో ఈశాన్యమూలన ఓ రెండు దూలాల పూరికొట్టం వేయించడానికి నిశ్చయించు కొన్నది లక్ష్మమ్మ. సుబ్బులుతోనే చెప్పి తన తాటి తోపులో చేవగల రెండు తాటిమానులు నరికించి, వడ్డె వాళ్లను పిలిపించి తాను దగ్గరఉండి గుణావర్ధనం త్రవ్వించి, కట్లు తీయించి మట్టిగోడలు పెట్టించింది. కంసాలిబత్తుణ్ణి పిలిపించి పశువులకొట్టంలో అటకమీద ఆరబెట్టిన పాత వేపకొయ్యలు క్రిందికి దింపించి, తలు పూ, ద్వారబంధం, రెండు కిటికీలూ చేయించి, గోడ లికి బిగించింది. తనదగ్గర సమయానికి నిలవలో లేకుంటే, మిట్టమీది పల్లెకు బండ్లు పంపించి రెండుబళ్ల సజ్జ చొప్పా, విడవలీ, రెండుబళ్ల అడివివాసాలూ తెప్పించి, పైకప్పూ, చూరూ కప్పించి, మొత్తానికి పెళ్లి అయిదురోజు లుండనంగా సుబ్బులుకాపరానికి యిల్లు కట్టించి వాణ్ణి పిలిచి, "సుబ్బులూ! ఈఇల్లు నీదిరా" అని చెప్పి కప్పగించింది లక్ష్మమ్మ.

ఏమిసమాధానం చెప్పాలో వాడి కర్థంగాక, "నీచలవ తల్లీ."అని దణ్ణం పెట్టి ఊరుకున్నాడు.

రామలింగేశ్వరస్వామిఆలయానికి సంబంధించి కమ్మవారిపాలెంలో ఉన్న ఏభయ్యెకరాల మాన్యం విషయమై ఇటీవల ఆవూరుకమ్మవారికీ, దేవళం ధర్మ కర్తఅయిన తనకూ దావాలూ తగవులూ పడి, ఆసంద ర్భంలో హైకోర్టులో వాయిదాఉండినందున వారం రోజులక్రిందటనే చెన్నపట్నం వెళ్లిపోయాడు రామి రెడ్డి. "తెల్లవారితే మూడురోజులే ఉన్నది పెళ్లికి గడువు. మేము సర్వసిద్ధం చేసుకొన్నాం. తెల్లవారితే అనగానే యిక్కడికి చేరుకోవా"లని కబురు చేశాడు మేనమామ జువ్వడు. తనపేరిట యిల్లని ఒకటి ఏర్పడింది గదా, తనుకి వస్తే గృహప్రవేశం కావడమే తరవాయి అని ఉరకలువేస్తున్నాడు సుబ్బులు.

"రామిరెడ్డి పట్నంనుండి రాలేదని కూర్చుంటే అయినట్టే"నని అంటూ ఎప్పుడు తెప్పించిపెట్టిందో-తెల్లవారితే పెళ్లి అనగా ఈరోజు ఉదయం సుబ్బు లుకు తలకు నీళ్లు పోయించి, కొత్తపంచెల జామారు కట్టబెట్టి, కాళ్లకు పసుపూ పారాణీ పూయించి, ఆ నాడు పప్పూ పరమాన్నం వండి పండగచేసింది లక్ష్మమ్మ. మధ్యాహ్నం తరలివెళ్లేటప్పుడు సుబ్బుల్ని లోపలికి పిలిచి "ఇదిగో, ఈపాతికరూపాయలూ దగ్గర ఉంచుకో. అవసరమైతే ఖర్చుపెట్టుకో. ఈచీర తీసు కొనివెళ్లి పెళ్లికూతురుకు కట్టబెట్టు"అని సుబ్బులుచేతి కిచ్చింది.

మొలకి కొత్తపంచె, పైకి కొత్త ఉత్తరీయం-ఏమి! సుబ్బులుజాతకం! ఆగడ్డమీద ఆజివర కే యానాదివాడికి పట్టింది ఈమహద్దశ! తనపాలిట ప్రత్యక్షదైవమువలె గోచరిస్తోంది లక్ష్మమ్మ. సుబ్బు లుకు జొటజొట కన్నీరు కారి, గద్గదం పడి, నోట మాట రాక, నిలువునా మోకాలిమీద వొంగి, లక్ష్మమ్మ పాదాలు కళ్లకద్దుకొని నిలబడ్డాడు.

రెండుచేతులూ అతని చెంపలమీదుగా తిప్పి, తనచెంపన పెట్టుకొని వేళ్లు విరిచి, "నాయనా!

వెయ్యేళ్లు వర్ధిల్లు. తొందరగా పెళ్లి చేసుకొనివచ్చి బిడ్డల తండ్రివి కా" అని దీవించి, "ఆ మహారాజు ఉంటే చూచి ఎంత ఆనందించేవాడో! 'సుబ్బులంటే యానాదివాడటే! వాడు రత్నం' అని, ఊఁ, పొంగిపోయేవాడు." అని తన భర్త కృష్ణారెడ్డిని తలుచుకొని కళ్లు తుడుచుకొన్నది లక్ష్మమ్మ.

సుబ్బులు లేచి నిలబడ్డ తర్వాత—"ఇదిగో! చెయ్యి పట్టు ముందుగా యిస్తే మరచిపోతావని ఇవ్వలేదు. ఈ కొను తీసుకొని వెళ్లు. రాత్రి గదిలో, పెళ్లికూతురుచీర చెంగుకు కట్టిరా." అని నవ్వుతూ తనతాలూకు పాతసొమ్ముల బాపతు కాసుల పేరులో ఒక బంగారుసవర మెరుగుపెట్టించి, పెళ్లికొడుకుచేతిలో పెట్టింది లక్ష్మమ్మ.

నల్లని తన చేతిలో మెరిసిపోయే ఆ బంగారు సవర సుబ్బులుకళ్లల్లో తళుక్కుమని చీకట్లుకమ్మేసింది. "రాత్రి", "గది" అని లక్ష్మమ్మ అనేసరికి నల్ల మాలిన సిగ్గుపుట్టి, కళ్లు నేలచూస్తూ తలకాయ వంచి అట్లానే నిలిచిపోయాడు సుబ్బులు.

"భద్రం: జాగ్రత్తగా పెట్టుకో: మరిచేవు సుమా." అని పదేపదే హెచ్చరించి సాగనంపింది లక్ష్మమ్మ.

౬

లక్ష్మమ్మదీవెన లందుకొని పెండ్లికొడుకు రాత్రికే కమ్మవారిపాలెం చేరుకొన్నాడు. మామ ఎప్పుడు గుమ్మంలో అడుగుపెట్టుతాడా అని ఎదురు తెన్నులుచూచే రమణమ్మకు సుబ్బులురాక బ్రహ్మానందమైపోయింది. ఆ యిరువురి జీవితాలలో సర్వోత్కృష్టమైన ఘడియ లవి.

తన తండ్రి ముసలివాడు, కళ్లు కనిపించక బయటకు పోయేస్థితిలో లేనందున ఎంత స్వల్పంగా చేసుకొందామనుకొన్నా, పెళ్లికార్యాలన్నీ రమణీ, ఆమె తల్లీ స్వయంగా చూచుకోవలసివచ్చింది. ఆమె అన్న ఉండికూడా మిలిటరీలో చేరి సమయానికి అక్కరకు రాకుండాపోయినాడు. ఆ పూరికొంపకే లోపలా బయటా మట్టిపూతా, పేడపూతా తల్లీకూతుళ్లే స్వయంగా పూసుకొని, సున్నం కొట్టించుకొన్నారు. ఇంటివాకిట పందిరిపై ఎండిపోయిన పాతబందేడు తడికలు తీయించివేసి, పచ్చని కొత్తతడికలు కప్పి పందిరి బాగుచేయించింది రమణి. ఒక అయ్యను బ్రతిమిలాడి ఇన్ని మామిడాకులు తెప్పించి, తోరణం కట్టించింది పందిరికీ, వాకిలికీని. బడిలో చదువుకొనే హరిజన పిల్లకాయలనూ, యానాదిపిల్లకాయలనూ పెళ్లికి వచ్చి అన్నం తినిపోవలసిందని స్వయంగా పిలిచింది రమణి. ఆ తాలూకాయానాదిసంఘాల కార్యదర్శి అయిన రాఘవయ్యగారిని పెళ్లికి తప్పక రావలసిందని జాబు వ్రాసి పంపింది. ఆ పాలెంలో చదువుకొన్న యానాది పిల్లకు పెళ్లికావడం యిదే మొదటిసారి అయినందువల్ల సంతోషంకొద్దీ పెళ్లికూతురుకోరికప్రకారం హాజరయ్యాడు రాఘవయ్యగారు.

పాఠశాలప్రధానోపాధ్యాయుడు వివాహాని అధ్వర్యం వహించి మంత్రాలు చదివి శుభలగ్నాన రమణిమెడలో సుబ్బులుచేత మంగళసూత్రధారణ చేయించాడు. పాఠశాల అయ్యవార్లు పెంగా ఆడా అందరూ వచ్చారు. గ్రామంలో కాంగ్రెసునాయకులు నలుగురూ వచ్చి రమణీసుబ్బుల్ని దీవించి అక్షతలు చల్లి వెళ్లిపోయారు. పెద్దఅయ్యగారమ్మ—గాంధీగారి ఆశ్రమంలో ట్రెయినింగయివచ్చిన ఆమె – మహాత్ముని ఆత్మచరిత్ర పెళ్లికూతురుకు కానుకనందించింది. శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారి "మాలపల్లి"ని రాఘవయ్యగారు చదివించారు.

ఇప్పటి కొరుమాసాలుగా తాను స్వయంగా రాటంమీద వడికిన నూలుతో మామకు కోపంచా ఉత్తరీయం, తన కోచీరా రవికా నేయించి నెలరోజులక్రిందటనే తయారుగా పెట్టుకొన్నది రమణి. రాత్రి ఏకాంతంలో మామకి కొత్తపంచలు తను స్వయంగా కట్టబెట్టి, కొత్తచీర తాను ధరించింది. తనకు లక్ష్మమ్మ పంపిన కానుక అని చెప్పుతూ బంగారుసవర రమణి చేతిలో పెట్టాడు సుబ్బులు.

మూడు నిద్రలూ అయిన తర్వాత పిల్లని తీసుకొని రెడ్డిగారిపల్లె వచ్చాడు. వచ్చీరావడంతోనే కొత్తగుడ్డలతో ఇద్దరూ వెళ్లి ముందు లక్ష్మమ్మకీ, తర్వాత ఆమెకొడుకికీ కాళ్లకి మ్రొక్కి వారి దీవెన లందుకొన్నారు. అప్పటి కింకా పెన్నపట్నంనుంచి రానేలేదు రామిరెడ్డి.

లక్ష్మమ్మ దగ్గరఉండి, సుబ్బుల్నీ, రమణినీ కొత్తఇంట్లో గృహప్రవేశం చేయించి, వారి సంసారానికి కావలసిన అన్ని సహాయాలూ చేసి పెట్టింది.

# బిళ్లల మొలత్రా

రమణికీ సుబ్బులుకీ చిరకాలం చేసుకొన్న తపస్సు ఫలించిన ట్లనిపిస్తోంది. స్వంతయిల్లు. రమణి తన భార్య; సుబ్బులు రమణిభర్త. ఆమె అతని ప్రియురాలు; అతడు ఆమెప్రియుడు. ఇంట్లో కాపరానికి లోటు లేకుండా సమస్తమూ సప్లయి అయే రెడ్డిగారి ప్రాపకం. ఆహా! ఏమి అదృష్టం!

పూరిల్లు రెండుదూలాల కొత్తం అయినందువల్ల మూడు అంకణాల కొంప. తూర్పుతట్టు అంకణంలో వంటచేసుకోడానికి కేటాయింపుగా మూలంకింద పొడుగునా మేదరతడిక అదివరకే అల్లించి పెట్టించింది లక్ష్మమ్మ. పడమటితట్టు అంకణంలో నాంక్లు నిద్ర చేయడానికి ఒక సులకమంచంకూడా కొత్తది సప్లయి చేసింది ఆయిల్లాలు. ఇంక ఆ సంసారానికి కావలసిన పెద్ద హంగులుమాత్రం ఏమున్నవి? పెట్టుకొంటే ఎన్ని హంగులయినా పెరుగుతూనే ఉంటవి. రామిరెడ్డి పెండ్లికి — ఆ రోజుల్లో, మామగారు అయిదు కావిళ్లతో రూపాయలూ, వెండి బంగారుసామానూ అల్లుడికి కట్నంచదివించి, కూతుర్ని అత్తవారింటికి పంపేటప్పుడు పందిరిపట్టెమంచం, చాందినీ, పరుపులూ, దిండ్లూ, అద్దాలూ, బీరువాలూ, పేకుపెట్టెలూ, అలమరలూ, గుండిగలూ, అండాలూ, బిందెలూ, మరచెంబులూ, గ్లాసులూ, పళ్లేలూ — ఒకటేమిటి, కొత్తసంసారానికి కావలసిన వన్నీ, పూచీపుల్లతో సహా అయిదుబళ్లమీద గొప్ప సారె పెట్టి పంపించారట పుట్టింటివారు. ఆ దిగిన సామాను పెట్టుకోను ఇల్లు చాలక, నిత్యసంసారానికి అంత సామానుతోనూ అవసరం కనిపించక, దానిలో ముప్పాతిక సామాను అటకమీది కెక్కించి ఇల్లు ఖాళీ చేయించిందట లక్ష్మమ్మ. రమణి కంత సారె పెట్టడానికి ఆతల్లిదండ్రులకు శక్తిలేదు, ఈ సంసారానికి అవసరమూలేదు. ఎటువచ్చీ రమణి తనతో తెచ్చుకొన్నది తన గుడ్డలూ, పుస్తకాలూ పెట్టుకొనే జాజిచెక్కల పెట్టె ఒకటీ, ఒక రాటమూ, ఏకుల బుట్టాను.

గృహప్రవేశం అయినవెంటనే గుమ్మానికెదురుగ్గా కొంచెం పడమటి వాలుగా గోడకి గాంధీ మహాత్ముని పటం తగిలించి, దానికి ఒక ప్రక్క టంగుటూరు ప్రకాశంగారి పటం, రెండోప్రక్క పట్టాభి సీతారామయ్యగారి పటం కొట్టింది రమణి. ఆప్రక్కనే తగిలించింది యానాది సంఘాధ్యక్షుడు రాఘవయ్యగారి పటం. ఇంతకుమినహా ఆమెతోకూడా తెచ్చిన సామానేమీ లేదు. ఇంతా చేస్తే, ఒక్క మహాత్ముని పటానికి తప్ప మిగిలిన పటాలకు వొట్టి చట్రాలేగాని, అద్దాలు లేనేలేవు. వేయించుకొందామంటే వాళ్ళకు శక్తి లేకపోయింది; అసలు అద్దం పెంకు కరువూ అయిపోయింది

ఇంట్లో ఉండేది ఇద్దరు మనుష్యులు. ఉదయం మోఅర్ధశేరూ, రాత్రి కోఅర్ధశేరూ బియ్యంనూకలు ఉడకవేసుకొంటే ఎక్కితిక్కలు. అన్నం వండుకొనేందుకు ఒక కుండా, కూర ఒక అటికా, పులుసుకాచుకోను ఒక ముంతామాత్రం తెప్పించింది రమణి. ఇత్తడిపాత్రలు తెప్పించియిస్తానని లక్ష్మమ్మ తొందరపెట్టిందిగాని వాటితో వంటచేయడం తన కలవాటులేదని వద్దని చెప్పింది. ఆఖరుకి మంచినీళ్లు త్రాగడానికి రెండు కంచుగాసులయినా తీసుకొంటేనేగాని వీల్లేదని, రమణి వద్దంటున్నా, రెండు గ్లాసులూ, ఒక యిత్తడిచెంబూ కొనిపంపించింది లక్ష్మమ్మ. లోపల మంచినీళ్ళ కోబుంగా, ఒకకడవాను. బయట స్నానాల కొక బానా, నోరువెడల్పు తొట్టినీ. దానితో రమణీసుబ్బుల సంసారం కొలబోతున్నది. "ఇంకేమీ వద్దు. మా విషయమై మీరు శ్రమపడకండత్తా" అని రమణి లక్ష్మమ్మని గడ్డంపుచ్చుకొని బ్రతిమిలాడింది.

వ్యవహారం పనిమీద రెడ్డి చెన్నపట్నం వెళితే మట్టుకు వ్యవసాయపు జవాబ్దారీ సుబ్బులుకు తప్పుతుందా? ఆమాటకి వస్తే, రామిరెడ్డి ఊళ్లోలేనపుడే సుబ్బులుకు జవాబ్దారీ ఇబ్బడయిపోతుంది. పుష్యమాసంలో పెద్దపండగ వెళ్లిపోయిన వెంటనే కోతలందుకొంటేనేగాని చేలన్నీ నిండుపంటమీద ఉన్నవి పాడయిపోతవి. కోతలనాటికయినా రెడ్డి వస్తాడో రాడో! ఆయన లేకుండానే తాను స్వతంత్రించి రమణిని పెళ్లిచేసుకొని కాపరానికి తీసుకొని వచ్చినందుకే సుబ్బులుకు గుండెలు పీచుపీచుమంటున్నవి. కొడుకు నడిగే యిల్లు కట్టించియిచ్చానని లక్ష్మమ్మ ధైర్యం చెప్పుతున్నదిగాని తాను ఆయింట్లో ప్రవేశించే నాటికయినా రెడ్డి వచ్చి ఉంటే ఎంత బాగుండేది అని వాడి కదే ఆలాపన. అయినా లక్ష్మమ్మ కష్టసుఖాలు తెలిసిన పెద్దవరస మనిషిగాని చిన్నపిల్ల కాదుగదా! ఇంటిపెత్తనం తనమీద ఉన్నప్పటికీ, ఈవిషయంలో లక్ష్మమ్మ

మాట కాదనడానికి రెడ్డికి నోరెట్లావస్తుంది? మరేమీ భయంలేదులే అని గుండెనిబ్బరం చేసుకొన్నాడు సుబ్బులు. ఇంతలోనే, తాను పట్నంనుండి యింకా పదిహేనురోజులవరకూ రావీలులేదనీ, సుబ్బులునే కూలీలను మాట్లాడి కోతలు పట్టించవలసినదనీ రామిరెడ్డి జాబు వ్రాయనే వ్రాసేడు. ఇంక నేంభయం!

పెద్దపండగ వెళ్లి, కనుమూ, ముక్కనుమూ గడచినమరునాడే సుబ్బులు కోతలారంభించి, మామూలుప్రకారం ఏ రోజే చేలో వేయవలసిన కుప్పలు ఆరోజే చేలో వేయించి, పదిపది హేనురోజులకే సొప్పసీదా పంటఅంతా ఒబ్బిడిగా అమర్చిపెట్టేశాడు. తాను పగలూ రాత్రీకూడా కుప్పలూ, కయ్యలూ అజమాయిషీ చేసుకొనివస్తున్నాడు. కోతలు కోయడంతోటే, కయ్యల్లో తడి ఆరకుండా కొన్నిట్లో ఉలవా, కొన్నిట్లో జనుమూ, మరికొన్నిట్లో పిల్లిపెసరా-పశువుల మేతకు కొయ్యకాలుమీదనే విత్తనాలు చల్లించివేశాడు. అక్కడక్కడ చవిటికయ్యలు కొన్ని ఏర్పడి కొత్త సత్తువ పెట్టినగాని పనికిరావని కనిపించే కయ్యల్లో సత్తువ కోసరం నీలివిత్తనాలూ, వెంపలాకూ చల్లించి, మొక్క మొలిచేవరకూ, ఒకటి రెండు తళ్లు నీళ్లుకూడా పెట్టించి, కట్టుదిట్టం చేశాడు. సుబ్బులు కీనాడు కొత్తగా నేర్పవలసిన విద్యగనకనా! కంట్లో వత్తి వేసుకొని ఖామందుకమతం కనిపెట్టుకురావడం వాడికి వెన్నతో బెట్టిన విద్య.

రమణి కాపరానికి వచ్చి నెలరోజు లయినది. కొత్తకాపరం. ఎంతకాలంగానో తపస్సు చేసి చేసుకొన్న పెనిమిటి సుబ్బు లన్నమాటేగాని, రెడ్డిగారి పల్లెలో కాలుపెట్టినదిలగాయతు చూస్తుందిగదా, తన మామకు తీరికే కనిపించదు. వేకువన కోడికూతత్తో లేచివెళ్లిన వెళ్లడం, పొలంనుండి రెండు జాముల పొద్దెక్కేవరకూ సద్దన్నానికే రాడు. చద్ది నీళ్లు త్రాగి మళ్లా వెళ్లితే మైటన్నానికి ఒకరోజు ప్రాప్తిఉంటే ఇంకోరోజు ఉండనేఉండదు. అందులో వరికోతలు కూడా వచ్చిపడ్డాయోఏమో, చిక్కంగా చీకటిపడి గూటిలోని పక్షులు కూర్కపెట్టినగాని ఇంటికి చేరలేకపోతున్నాడు. పగలంతా ఎండా, గాలీ అతగాడి పాలయిపోతున్నది. ఇంటికి చేరి ఉడుకునీళ్లు పోసుకొని నులకమంచంమీద నడుమువాలిసే మళ్లా కూతతోనే మెలకువ అతనికి. తన తండ్రిగారింటికాడ వాళ్లుకూడా వొళ్లు అమ్ముకొని బ్రదికేవాళ్లయినా, ఈవిధంగా నెత్తురూ మాంసం హరించిపోయేటట్టు కష్టపడగా తానుచూచిన గుర్తులేదు రమణికి.

"ఏమిటేది మామా ఈ పనీ? వేళకు కూడూ నీళ్లూ అమరకపోతే వొళ్లు చెడిపోదూ?" అని తను అంటే-"ఎద్దులకు గాలికుంటు తగిలినందువల్ల వైద్యుడి కోసరం పొరుగూరు వెళ్లివచ్చాననో, రెడ్డిగారింట్లో పొయ్యిలోకి కట్టెలు లేకుంటే తోపులో తాటిమట్టలు కోయించి యింటికి తోలిస్తున్నాననో, లేక రెండెద్దులబండికి ఇనపపట్టాలు వొదులయి తొలిగిపోతే కమ్మరికొలిమికాడ కాపించివస్తున్నాననో—" ఒకటేమిటి, ఎప్పటికప్పుడే ఏదో సాకు చూపించి ఆమె నూరటపెట్టుతున్నాడు సుబ్బులు.

పెనిమిటి కష్టపడుతుంటే గా చూడలేకపోతున్నది ఆ పసియిల్లాలు. తానుకూడా పెనిమిటితోపాటు పోయి, సమానంగా కాయకష్టం చేసి అతనిలో భాగం పంచుకొంటే బాగుండును. ఇంటిపట్టున తాను రాణివాసం చేయడం, తన భర్త చెమట ఊడ్చి కష్టం చేయడమూనా? పెనిమిటితోకూడా వేకువనేలేస్తుంది. మెడలోని పుస్తె కళ్ల కద్దుకొంటుంది. గాంధీగారి పటందగ్గరకు పోయి మోకరించి నమస్కరిస్తుంది. ముఖం కడుక్కొని పాచిపని చేసుకొంటుంది. సుబ్బులుకి చద్దన్నంపెట్టి, తానింత తిని, అతను వెళ్లిన తర్వాత వాకిలి బిగించి ఒకసారి రెడ్డిగారింటికి వెళ్లి అక్కడ చెంబు ఇక్కడా, ఇక్కడ బిందె అక్కడా పెట్టి పనికల్పించుకొంటుంది. రెడ్డిగారి పిల్లలకు తల దువ్వి జడలేసి స్నానం చేయిస్తుంది. రెడ్డిగారి భార్యకు భావిలో నీళ్లు తోడిచ్చి, ఆమెస్నానం అయ్యేవరకూ అక్కడనే ఉంటుంది. లక్ష్మమ్మదగ్గరకు పోయి కూరానారా తరిగియిచ్చి ఏవేవో ముచ్చటలు చెప్పతుంది. పొద్దు నెత్తిమీదికెక్కేవరకు ఇంటికి వచ్చి వంటచేసి పెనిమిటి వచ్చేవరకూ ఏ పుస్తకమో, ఏ రాటమో పెట్టుకొని కూర్చుంటుంది. చీకటిపడగానే ప్రమిదలో వేపచమురుదీపం వెలిగించి గాంధీగారిదగ్గర పెట్టి ఏవో వెర్రిమొర్రిపాటలు పాడుకుంటుంది. పెనిమిటి ఇంటికి రాంగనే అతగాడికి వేడినీళ్లతో స్నానంచేయించి అన్నం పెట్టుతుంది. ఇదీ ఆమెదినచర్య.

[తరువాయికథ తరువాతి సంచికలో]




# సంకామపకియ

= శ్రీ వేలూరి తారకం =

గద్వ్యాప్తమై విధి అనే ఒక అనతిక్రమ్యశక్తి కలదనిన్నీ, ఈ విధిచే పూర్వనిర్ణీతమైన మార్గంలోనే ప్రతివ్యక్తియొక్క జీవితస్రవంతీ ప్రవహిస్తుందనీ మనము చాలామందిమి నమ్మతున్నాము.

ఈ భావము ఆధునికులలోనేకాక ప్రాచీన ప్రపంచసంప్రదాయంలో కూడా నెలకొని ఉన్నది. గ్రీకు లీవిశ్వాసాన్నే ఆధారంచేసుకొని గాఢమైన విషాదాంతనాటకాలు చాలా రచించారు.

ఈ నమ్మకము కేవల మొక మూఢవిశ్వాసమా, లేక వాస్తవికజగత్తులో దీని కాధార మున్నదా

తన మానసికప్రవృత్తికీ, తన దైహికప్రకృతికీ ప్రతివ్యక్తి స్వయంగా ఎంతవరకు బాధ్యుడు? పూర్వాగతంగాకాక స్వయంకృషిఫలితంగా మన మార్జించుకొన్న సుగుణదుర్గుణాలు, రోగఆరోగ్యాలు మన సంతానానికి సంక్రమించునా?

నేటి జీవశాస్త్రము (Biology) ఈ ప్రశ్నలకు కొంతవరకు సమాధానాలు సూచించగలదు. జీవశాస్త్రదృష్ట్యా ఈ సమస్యలను సమగ్రంగా అవగాహనచేసుకొనదలచినట్లయితే, జీవినిర్మాణప్రక్రియను మనము సంపూర్ణంగా తెలుసుకోవాలి.

## జీవి-జీవకణములు

ఏ విధంగా ప్రతిపదార్థమూ కొన్ని అణువుల సమూహమో, అదేమాదిరిగా ప్రతిజీవీ కొన్ని కణాల (Cells) వ్యూహము.

ఇటుకలతో ఇల్లు కట్టినట్లే దేహసౌధంకూడా జీవకణాలతో నిర్మితమైనది.

ఈ జీవకణాలలో చాలా రకాలున్నవి. ఉదాహరణకు అస్థికణము, నాడీకణము, రక్తకణములను పేర్కొనవచ్చును.

జీవకణాలు చాలా సూక్ష్మమవడంచేత అవి మనకు యంత్రసాయం లేకుండా గోచరించవు; సూక్ష్మదర్శినిద్వారా । ఆకారాన్ని మనం విశదంగా చూడగలము.

ప్రతిజీవకణాన్నీ ఒక గదికి పోల్చవచ్చును. గదిచుట్టూ గోడలున్నట్లే జీవకణంచుట్టూ ఒక సన్నని పొర ఉంటుంది. ఈ గది అంతా కొన్ని ఘనపదార్థాలయొక్కయు, కొన్ని ద్రవపదార్థాలయొక్కయు సంమిశ్రణతో నిండిఉంటుంది. ఈ సంమిశ్రణపేరు జీవపదార్థము (Protoplasm). నీళ్లల్లో బిరడా తేలిఉండేట్లుగా ఈ సంమిశ్రణలో గోళాకారం కల ఒక

కణకేంద్రము (Nucleus) తేలుతూ ఉంటుంది. కణకేంద్రము జీవపదార్థంకంటె పల్చనైన ఒక ద్రవ పదార్థంతో నిండిఉంటుంది. చిక్కుపడిపోయిన దారపుఉండలాగా కనిపించే ఒక తంతుజాలము ఈ ద్రవపదార్థంలో మునిగిఉంటుంది. ఈ తంతువులలో ఒకదానిని తీసుకొని దాని నొక నిశిత సూక్ష్మదర్శిని గుండా పరీక్షించినట్లయితే అది ఒక గుళ్లపేరులాగా కనిపిస్తుంది గుళ్లపేరులో గుళ్లు ఒకదానితరువాత ఒకటి గుచ్చబడి ఉండునట్లుగానే, ఈతంతువులోకూడా కొన్ని గుళికలు ఒకదానితరవాత ఒకటి వరసగా ఏర్పరచబడి ఉంటయ్. ఈగుళికలను మనము 'సంక్రామ గుళిక'లని (జెనేస్) పిలువవచ్చును.

పైన పేర్కొన్న అన్నిభాగాలూ జీవకణాలన్నింటిలోనూ ఉంటయ్. ఇవికాక ఒక్కొక్క రకపు జీవకణంలో కొన్నికొన్ని ప్రత్యేకపదార్థాలు కాని, కొన్నికొన్ని ప్రత్యేకవ్యూహాలుకాని అదనంగా ఉంటయ్. ఉదాహరణకు: కొన్నిజీవకణాలలో కొవ్వు పేరుకొనిఉంటుంది; జీవపదార్థాన్నీ, కణకేంద్రాన్నీ ఈకొవ్వు ఒకపక్కకు తోసిపట్టి ఉంచుతుంది (౧వ పటం చూడండి). ఇక నాడీకణం



(A)
కొవ్వు కణము (ఫాట్ సెల్)

౧-వ పటము (ఎ)



నాడీకణము (నెర్వ్‌సెల్) (బి)

౧-వ పటము (బి)

చుట్టూ కొన్ని నాడికొనలు సన్నని వేళ్లలాగా అన్నివైపులకూ వ్యాపించిఉంటై.

ఈ విభేదాలు స్వల్పమూ, అప్రధానమున్నూ. ప్రధానాంశాలలో వివిధజీవకణాలకూ సంపూర్ణ సాదృశ్యమున్నది.

## పునర్నిర్మాణము, సృష్టి

పునర్నిర్మాణము (Growth):—ప్రతి శరీరంలోనూ సతతమూ కొత్త జీవకణాలు నిర్మితమౌతూ ఉంటై. శరీర మెదుగుతున్నప్పుడుకాని, గాయం తగిలి మానుతున్నప్పుడుకాని ఇది జరుగుతూఉంటుంది. శరీరంలో అంతకుమును పున్న జీవకణాల్లోంచే ఈ కొత్త జీవకణాలు పుట్టుకొస్తయ్. ఒక జీవకణము రెండు లఘుతరజీవకణాలుగా విభక్తమౌతుంది. ఈ జీవకణనిర్మాణప్రక్రియయొక్క వివరాలు తెలుసుకోటం అవసరం. ఎందుచేతనంటే, మన విచారణ చాలావరకీవివరాలమీదనే ఆధారపడి ఉన్నది.

విభజనకు ప్రాతిపదికగా, కణకేంద్రాన్ని ఆవరించి ఉండే పొర చినిగిపోతుంది. అప్పుడు కణకేంద్రంలోని తంతుజాలము గట్టిపడి ముడుచుకొనిపోయి

కొన్ని లావుపాటి భిన్నభిన్న తంతువులుగా విడిపడిపోతుంది. ఇంతలో కణకేంద్రంబైట జీవకణంలో ఉండే ఒక ఘనపదార్థము (Granule) రెండు సమ భాగాలలోకి ముక్కలౌతుంది. నక్షత్రాలనుంచీ కిరణాలాగా, ఈ రెండుముక్కలనుంచీ ఘనీభూతమైన జీవపదార్థము అన్నివైపులకూ కిరణరూపకంగా ప్రసరిస్తుంది (౩ వ పటము చూడండి). అప్పుడీ రెండు ముక్కలూ జీవకణముయొక్క ఇరుపక్కలకు చేరుకుంటయ్. ఇంతలో తంతువులు ఒకటికింద ఒకటి వరసగా కణమధ్యభాగాన బారుగా నిలబడతై (f). ఆ తరువాత కిరణాలింకాముందుకు ప్రసరించి, ప్రతి తంతువును రెండుకిరణాలీవైపునా, రెండుకిరణాలావైపునా పట్టుకొంటయ్ (g). ఆపైని ప్రతి తంతువూ పొడుగునా రెండు సమానభాగాలలోకి చీలిపోతుంది (h). ఇక కిరణాలన్నీ హ్రస్వమవడానికి ప్రారంభిస్తయ్. దీనికి ఫలితంగా, తంతువుల్లో ఒక శ్రేణి ఈ వైపుకూ, రెండో శ్రేణి ఆ వైపుకూ లాక్కొనిపోబడతై (i). ఈ విధంగా విడిపడిపోయిన ఒక శ్రేణి తంతువులు పరస్పరం పెనవేసుకొని ఒక ముద్ద అవుతై. ఈ ముద్దచుట్టూ ఒక సన్నని పొర మొలుచుకొవస్తుంది; అనగా ఈ తంతుశ్రేణి ఒక కణకేంద్రంగా మారుతోందన్నమాట. ఇదేవిధంగా రెండో తంతుశ్రేణికూడా ఇదేసమయంలో మరో కణకేంద్రంగా తయారౌతుంది. ఈ విధంగా ఒక కణకేంద్రమీ వైపునా, ఒక కణకేంద్రమా వైపునా జన్మిస్తయ్ (j, k). ఇంతలో జీవకణంమధ్యభాగాన నడుములాగా ఏర్పడి, ఈ నడుము క్రమంగా సన్ననై, చిట్టచివరకక్కడ రెండుముక్కలుగా తునిగిపోతుంది. కాబట్టి ఈ విభజనవలన ప్రతిభాగానికీ ఒకొక్క తంతుశ్రేణీ, ఒకొక్క గ్రాన్యూలూ పంపిణీఅయినై. అంటే ఈ రెండుభాగాలూ రెండు సంపూర్ణజీవకణాలన్నమాట. వీటికీ, మూలజీవకణానికీ ఉన్న భేదం కేవలం పరిమాణంలోనే; ఇవికూడా కొద్దికాలంలో ఎదిగి మూలజీవకణమంత పెద్దవీ అవుతై.



౨-వ పటము

సృష్టి (Reproduction):— జీవకణపునర్నిర్మాణంలో ఒకే జీవకణము రెండు జీవకణాలుగా విభక్తమౌతుంది. కాని నవ్యజీవి సృష్టిఅయ్యేటప్పుడు పరస్పరభిన్నమైన రెండు ప్రత్యేకజీవకణాలు సమ్మిళితమౌతై; ఈసంయోగఫలితంగా రెండు నవ్యసజాతీయ జీవకణాలు జన్మిస్తయ్. సంయోగంలో పాల్గొనే

రెండు జీవకణాలలోనూ ఒకదాని పేరు 'బీజము' (Sperm); రెండవదాని పేరు 'గర్భబీజము'(Ovum). బీజంలోనూ, గర్భబీజంలోనూ ఉండే తంతువుల సంఖ్యలు సరిసమానంగా ఉంటై. కాని ఈ సంఖ్యకూ, దేహంలోని ఇతరజీవకణాల తంతుసంఖ్యకూ ఒక నియతమైన వ్యత్యాస ముంటుంది. మొదటిసంఖ్య రెండవసంఖ్యలో సరిగ్గా సగము. ఉదాహరణకు మనుష్యజాతిలో ఉండే సాధారణజీవకణాల్లోని తంతువుల సంఖ్య ౪౮. కాబట్టి మనుష్యబీజంలోనూ, గర్భబీజంలోనూ, ఉండే తంతువుల సంఖ్య ౪౮/౨ = ౨౪.

జీవియొక్క జాతినిబట్టి తంతుసంఖ్య మారుతూ ఉంటుంది; అంటే ఒక్కొక్కజాతికి ఒక్కొక్క ప్రత్యేకతంతుసంఖ్య ఉంటుంది. కుక్కజాతిలో తంతుసంఖ్య ౨౨; కాబట్టి వీటి బీజ, గర్భబీజాల్లో పదకొండేసి తంతువు లుంటై.

(i) ఏజీవికి చెందినప్పటికీ సాధారణజీవకణాల్లోని తంతుసంఖ్య ఎప్పుడూ సరిసంఖ్యగానే ఉంటుంది; ఏజాతిలోనూ ఇది బేసిసంఖ్యగా ఉండదు. (ii) సాధారణజీవకణంలోని ప్రతితంతువుకూ వేరే ఇంకోతంతువుతో ఆకారంలో సాదృశ్య ముంటుంది. కాబట్టి జీవకణంలోని సంక్రామతంతువు లన్నిటినీ అన్యోన్యము పోలిక కల కొన్ని జతలుగా ఏర్పరచవచ్చును.

బీజ,గర్భబీజాల్లోని తంతుసంఖ్యకూ, సాధారణ జీవకణాల్లోని తంతుసంఖ్యకూ పైన చెప్పిన వ్యత్యాస మేవిధంగా ఏర్పడింది?

బీజము కొన్ని సాధారణజీవకణాల్లోనుంచి వుత్పన్నమాతుంది. అ, ఇ, ఆ, ఈ-లు సాధారణజీవకణములోని నాలుగు తంతువు లనుకొందాము. వీటిని అన్యోన్యము పోలిక కల రెండు జతలుగా ఏర్పరచవచ్చును. అవి:—(i) అ, ఆ; (ii) ఇ, ఈ. బీజము ఉత్పన్నమయేముందు జీవకణములోని అ-తంతువు ఆ-తంతువుతోనూ, ఇ-తంతువు ఈ-తంతువుతోనూ జతపడి పెనవేసుకుంటయ్. చివరకు ప్రతిజతలోనుంచీ ఒక తంతువు చొప్పున ఎన్ని జత లుంటే అన్ని తంతువులు వేకవర్గంగా విడిపడతై. ఉదాహరణకు (అ, ఆ) జంటలోనుంచి 'అ', (ఇ, ఈ) జంటలోనుంచి 'ఇ' కలిసి అ, ఇ-వర్గంగా విడిపడవచ్చును. ఈ తంతువర్గంతో కలిసి పృథక్కృతమయ్యే వ్యూహామే 'బీజము'. అ, ఇ, ఆ, ఈ-లనే తంతువులు కల జీవకణాలలోనుంచీ అ, ఇ-లు కల బీజమేకాక ఈ కిందిబీజాలుకూడా ఉద్భవించవచ్చును: (అ, ఈ); (ఆ, ఇ); (ఆ, ఈ).

గర్భబీజము ఉత్పన్నమయ్యే పద్ధతికీ, బీజం పుట్టే పద్ధతికీ కొంచెం భేదం ఉంది; కాని ఫలితమొక్కటే. గర్భబీజాల్లోకూడా తంతుసంఖ్య సగమాతుంది. అ, ఆ, ఇ, ఈ అనే తంతువులు కల స్త్రీలో జన్మించే గర్భబీజాలు:—(i) (అ, ఇ); (ii) (అ, ఈ); (iii) (ఆ, ఇ); (iv) (ఆ, ఈ).

మనుష్యబీజ, గర్భబీజాల ఆకారాలు 3-వ పటంలో చిత్రింపబడినవి. బీజానికి తల, తోక ఉంటయ్. తోక నటూ ఇటూ కొట్టుకుంటూ వేవేగంగా బీజము ముందుకు ఈదుకొనిపోతుంది. కోట్లకొలది బీజాలు ఈ విధంగా గర్భబీజంవైపుకు అతి వేగంతో ఈదుకొనిపోయి దానిచుట్టూ మూగుతై. కాని ఈ కోటానుకోట్ల బీజాలలోకీ ఒక్కటిమాత్రమే గర్భబీజంలోకి చొచ్చుకొనిపోగలదు. బీజము గర్భబీజములోనికి ప్రవేశించినవెంటనే గర్భబీజము మిగిలిన బీజాలన్నిటినీ వికర్షిస్తుంది. ఇవన్నీ అటూ ఇటూ లక్ష్యవిహీనంగా ఈదుకుంటూపోయి, తుట్టతుదకు నిష్ప్రయోజనంగా చచ్చిపోతై. ఒక బీజము సఫలమైతే, కోటిబీజాలు వ్యర్థమాతై.

బీజము గర్భబీజములోకి చొచ్చుకొనిపోగానే తోకను బైట విడిచేస్తుంది. గర్భబీజములోకి చేరుకున్న పిమ్మట బీజముతల ఉబ్బి, చిట్టచివరకు సాధారణ కణకేంద్రంగా మారిపోతుంది. ఇక ఈ కణకేంద్రమూ, గర్భబీజంలోని కణకేంద్రమూ పరస్పరమూ సమీపించుకొంటివి. ఇంతలో రెండు గ్రాన్యూలులు కిరణాలతో




3-వ పటము

సహా గర్భబీజముయొక్క రెండువైపులా సాక్షాత్కరిస్తవి. ఆపైన రెండు కణకేంద్రాల పైపొరలూ చినిగిపోయి లోపల ఉన్న తంతువులు ఒకదానికింద ఒకటి శ్రేణిగా నిలువబడతయ్.

ఆతరువాతి ప్రక్రియ అంతా లోగడ వర్ణించిన పునర్నిర్మాణపద్ధతినే అనుసరిస్తుంది (౨-వ పటము చూడండి). బీజంలోని తంతువులూ, గర్భబీజంలోని తంతువులూ పొడుగునా చీలి రెండు శ్రేణులుగా విడిపడతై. ఒకశ్రేణి ఒక జీవకణంలోకీ, రెండవ శ్రేణి రెండో జీవకణంలోకీ పోతై. జీవకణానికి ఈవిధంగా ఒక తంతువర్గము గర్భబీజంనుంచి, ఇంకో తంతువర్గము బీజంనుంచీ లభించినై. అనగా సాధారణజీవకణానికి ఉండవలసిన తంతువులన్నీ లభించిన వన్నమాట.

ఉదాహరణకు అ,ఇ-తంతువులు కల బీజము ఆ,ఈ-తంతువులు కల గర్భబీజంతో సంయుక్తమైతే అ,ఇ,ఆ,ఈ-లు కల రెండు జీవకణాలు జన్మిస్తవి. అ, ఇ,ఆ,ఈ-లలోని ప్రతిఒక్క తంతువూ పొడుగునా రెండు చీలికలై, తంతువు కొక చీలికచొప్పున ఒక్కొక్క జీవకణానికి నాలుగేసి చీలికలు సంక్రమిస్తయ్. అనగా ప్రతితంతువునుంచి ఒక భాగము ఒక జీవకణానికీ, రెండవ భాగము రెండవ జీవకణానికీ లభిస్తుంది. ఈవిధంగా ప్రతితంతువుకూ రెండు జీవకణాలలోనూ ప్రాతినిధ్య మున్నది. నవ్యసృష్టమైన ఈ రెండు జీవకణాలూ ఎదిగి, విభజనవలన వృద్ధిఅయి చివర కొక నూతనజీవి జన్మిస్తుంది.

(i) గుళ్లపేరులో గుళ్లు ఒకదానితరువాత ఒకటి వరసగా గుచ్చబడిఉన్నట్లు 'తంతువు'లోకూడా సంక్రామగుళికలు ఒకటితరువాత ఒకటి వరసగా ఏర్పరుపబడిఉండుననీ;

(ii) 'పునర్నిర్మాణం'లోనూ, 'సృష్టి'లోనూ కూడా ప్రతితంతువూ పొడుగునా చీలి ఒక చీలిక ఒక జీవకణానికీ, రెండవ చీలిక రెండో జీవకణానికీ లభిస్తుందనీ ;

(iii) జీవకణంలోని తంతువులను పరస్పర సాదృశ్యం కల రెండువర్గాలుగా ఏర్పరచవచ్చుననీ ;

(iv) ఈ రెండువర్గాలలోనూ ఒకటి జనకబీజం నుంచీ, రెండవది జననీగర్భబీజంనుంచీ సంక్రమించిన వనిన్నీ

మన మింతవరకూ తెలుసుకొన్నాము. జీవకణ తంతువులే జీవిగుణనిర్ణేతలనీ, బీజ-గర్భబీజాలలోని

సంక్రామక గుళికలద్వారా సంతానానికి గుణాలు సంక్రమిస్తయ్యనీ నేటి జీవశాస్త్రజ్ఞులు సిద్ధాంతీకరిస్తున్నారు. ఈ సిద్ధాంతాన్ని సమర్థించడానికై రెండు ముఖ్యమైన ఆధారా లున్నై:—(౧) మెండెల్ అభ్యూహాలు; (౨) మార్గన్‌మార్లంగ్ ప్రభృతుల ఆధునికపరిశోధనలు.

## మెండెల్ అభ్యూహాలు

మెండెల్ ౧౯-వ శతాబ్దపు జర్మనీదేశస్థుడు; ఇతడు గుణసంక్రామ విధానాన్ని తెలుసుకోడానికై మొక్కలతోనూ, జంతువులతోనూ అనేక ప్రసూతి పరిశోధనలు కావించాడు.

ఒక పక్షిజాతిలో నలుపుతెలుపుతెగ లున్నవి. నలుపుతెగపక్షి తెలుపుతెగపక్షితో సంయుక్తమైతే నీలవర్ణపు సంతానం జన్మిస్తుంది.

కాని ఈ నీలవర్ణపు పక్షులు పరస్పరం సంయుక్తమైతే మూడురకాల పక్షులు జన్మిస్తవి: (i) తలితండ్రులవలె నీలపురంగు కలవి కొన్ని; (ii) కొన్ని నలుపు; (iii) కొన్ని తెలుపు. ఈ చివరి రెండూ మొదటితరపు రంగులు. 'మూడోతరంలో మొత్తంమీద నూరు పక్షులు 'పుడితే, నూటిలోనూ పాతిక నలుపుగా ఉంటై; ఇంకోపాతిక తెలుపువి; మిగతా యాభై నీలంగా ఉంటై.'

— మెండెల్ మొక్కలతో ఇటువంటి పరిశోధనలనేకం చేశాడు; ఫలితాలుకూడా ఇల్లాంటివే వచ్చినై. మొదటితరంలో రెండు వేరువేరు గుణా లుంటే, రెండవతరముయొక్క ప్రతివ్యక్తిలోనూ ఆ రెండు గుణాలూ సంమిశ్రణగా ఆవిర్భూతమౌతవి. కాని మూడవ తరంలో ఈరెండు గుణాలూ వేరువేరుగానూ, సంమిశ్రణగానూకూడా అభివ్యక్తమౌతవి. మూడవ తరంలో నూరు వ్యక్తులు జన్మిస్తే, ఇరవైఅయిదింటిలో ఒకరకం గుణం వ్యక్తమౌతుంది; ఇంకోపాతికలో రెండోరకపు గుణము; మిగిలిన యాభైలోనూ ఈ రెండురకాల సంమిశ్రణా అభివ్యక్తమౌతుంది.

(i) జీవిలో ఆవిర్భూతమయ్యే ప్రతిఒక్క గుణానికీ బాధ్యతవహించవలసిన రెండు అంతర్నిహిత ద్రవ్యా లుంటై.

(ii) ఈ జీవియొక్క సంతానానికి ఈ రెండు అంతర్నిహితద్రవ్యాలలోనుంచీ ఒక్కటిమాత్రమే సంక్రమిస్తుంది. ఈ రెండు అభ్యూహాలనూ ఆధారంచేసుకొని మెండెల్ తన పరిశోధనాఫలితాలకు సమన్వయం చెప్పాడు.

తెలుపుపక్షిలో తెలుపుగుణానికి బాధ్యత వహించవలసిన రెండు ద్రవ్యాలు అంతర్నిహితమై ఉంటై. ఈ రెండుద్రవ్యాలూ 'తె, తె' అనకుందాము.

ఇక నలుపుపక్షిలో రెండు వేరే ద్రవ్యా లుంటై. వీటిని 'న, న' అని పేర్కొందాము. తెలుపునలుపు పక్షులకు పుట్టే సంతానానికి రెండోఅభ్యూహ ప్రకారం ఒక 'తె', ఒక 'న' సంక్రమిస్తయ్. 'తె, న'ల సంమిశ్రణవల్ల అభివ్యక్తమయే రంగు నీలము. ఇది రెండవతరంసంగతి.

ఇక రెండోతరంలోని రెండుపక్షులు సంయుక్తమైతే జన్మించే పిల్లల రంగేమిటి?

మెండెల్ రెండవఅభ్యూహప్రకారం మూడోతరానికి తండ్రివైపునుంచి 'తె, న'లలో ఒకటి—అనగా 'తె'కాని, 'న'కాని సంక్రమిస్తుంది; అదేవిధంగా తల్లివైపునుంచికూడా 'తె'కాని, 'న'కాని సంక్రమిస్తుంది. కాబట్టి (i) తండ్రివైపునుంచి 'తె', తల్లివైపునుంచి 'తె' సంక్రమిస్తే 'తె, తె'పక్షి జన్మిస్తుంది. అంటే తెలుపుపక్షి; (ii) కాని తండ్రివైపునుంచి వచ్చిన 'తె' తల్లిద్వారా వచ్చిన 'న'తో కలిస్తే 'తె, న'-అనగా నీలపుపక్షి జన్మిస్తుంది. అదేవిధంగా తండ్రినుంచి వచ్చిన 'న'తో తల్లినుంచి వచ్చిన 'తె' కలిస్తే మరో నీలంపక్షి జన్మిస్తుంది.

(iii) తరువాత తల్లినుంచీ, తండ్రినుంచీకూడా 'న' సంక్రమిస్తే 'న, న'-అంటే నలుపుపక్షి జన్మిస్తుంది.

కాబట్టి మెండెల్ అభ్యూహాల ననుసరించి మూడోతరంలో తెలుపు, నలుపు, నీలంపక్షులు పుట్టాలి; అదీకాక ప్రతినాలిగింటిలోనూ ఒకటి తెలుపు, ఒకటి నలుపు, రెండు నీలమూ ఉండాలి. అనగా, వంద సంతాన ముంటే పాతిక నలుపూ, పాతిక తెలుపూ, మిగతా యాభై నీలమూ ఉండాలి.

వాస్తవంగా జరిగేదికూడా ఇంతే; అనేక ఇతర ప్రయోగఫలితాలుకూడా ఈ అభ్యూహాలు యథార్థమే అని నిరూపించినై.

గుణకారకద్రవ్యాలు - రెండురకాలు : -ఒక జాతిబటానీమొక్కలో రెండు తెగ లున్నయ్. ఒకటి పొడుగు; ఒకటి పొట్టి. ఈ రెంటికీ పుట్టిన సంతతి మధ్యరకంగా ఉండక అన్నీ పొడుగువే పుట్టినై. ఈ రెండవతరంవాటికి కొన్ని పూర్తిగా పొట్టివీ, కొన్ని పూర్తిగా పొడుగువీ పుట్టినై; మధ్యరకం మూడో తరంలోకూడా కనిపించలేదు.

పొడుగుగుణానికి కారకమైన ద్రవ్యము (అ) పొట్టితనాన్ని సృష్టించే ద్రవ్యం (ఆ) కంటె బలవత్తరమైనదనీ, అ, ఆ-ల సంమిశ్రణ తటస్థించినప్పుడు 'అ' గుణము ప్రత్యక్షమై 'ఆ' గుణము ప్రచ్ఛన్నమౌతుందనీ అభ్యూహిస్తే, దీనికి సమన్వయం కుదురుతుందని మెండెల్ చూపించాడు.

రెండవతరానికి సంక్రమించిన ద్రవ్యాలు అ, ఆ. ఈ సంమిశ్రణలో 'ఆ' ప్రచ్ఛన్నగుణాత్మక మైనది; అందుచేత మొక్కలన్నీ పొడుగ్గానే ఉంటై.

మెండెల్ అభ్యూహాలప్రకారం మూడోతరంలో పుట్టాలిసిన రకా లివి:—(i) ఒక (అ, అ); (ii) ఒక (ఆ, ఆ); (iii) రెండు (అ, ఆ). ఒక (అ, అ)=ఒక పొడుగు; ఒక (ఆ, ఆ)=ఒక పొట్టి ('ఆ' లు రెండు ఉండడంచేత 'ఆ' గుణము ప్రత్యక్షమౌతుంది); రెండు (అ, ఆ)=రెండు పొడుగు, 'అ' ప్రత్యక్షగుణాత్మక మవడంచేత.

కనుక మూడోతరపు ప్రతి నాలుగుమొక్కల లోనూ మూడు పొడుగువీ, ఒకటి పొట్టిదీ ఉండాలి. మూడోతరంలోని పొట్టిపొడుగుమొక్కలను లెక్క పెట్టి చూసేసరికి ఈ ఊహ యథార్థమేనని తేలింది.

(i) ఆవిర్భూతమయే ప్రతి ఒక్క గుణానికీ కారకమైన రెండుద్రవ్యాలు జీవిలో అంతర్నిహితమై ఉంటవి;

(ii) సంతానానికి ఈ రెండు అంతర్నిహిత ద్రవ్యాలలోనుంచీ ఒక్క గుణకారకద్రవ్యంమాత్రమే సంక్రమిస్తుంది.

మెండెల్ యొక్క ఈ రెండు అభ్యూహాలనూ ప్రయోగరీత్యా కనుగొనబడిన ఈ రెండు విషయాల తోనూ సరిపోల్చిచూద్దాము :

(౧) జీవకణంలోని తంతువులను పరస్పర సాదృశ్యం కల కొన్ని జతలుగా ఏర్పరచవచ్చును.

(౨) జత కొక్కటిచొప్పున ఈ తంతువులు జనకబీజమునుంచి సంతానానికి సంక్రమిస్తయ్; అదే విధంగా జననీగర్భబీజంనుండిన్నీ.

(i) ని (౧) తోనూ, (ii) వ అభ్యూహను (౨) వ సత్యంతోనూ పోల్చిచూచినట్లైతే తంతువులోనే మెండెల్ చెప్పిన అంతర్నిహితద్రవ్యాలు ఉండవలెనని తేలుతుంది. కాబట్టి జీవిలో కనిపించే అన్ని గుణాలకూ 'తంతువులే' బాధ్యతవహించవలసిఉంటుందని విశదమైంది.

## ఆధునిక పరిశోధనలు

మార్గన్ అమెరికన్ వైజ్ఞానికుడు; ఇతడు డ్రాసొఫైలా (ఒక జాతి ఈగ) యొక్క సంక్రామ ప్రక్రియను సంపూర్ణంగా పరిశోధించాడు.

డ్రాసొఫైలాకు బహుసంఖ్యాకమైన సంతతి కలుగుతుంది; అదీకాక వీటిలో రెండువారాల కొక కొత్తతరం పుట్టుకొస్తుంది. ఈ రెండు సౌకర్యాలవల్లా మార్గన్ తన పరిశోధనలకై డ్రాసొఫైలానే తీసుకొన్నాడు. ఇతడు డ్రాసొఫైలాయొక్క ౨౦౦ గుణాలు తీసుకొని ప్రతిఒక్కదాని సంక్రామవిధానాన్నీ సమగ్రంగా పరిశోధించాడు. ఈ పరిశోధన

ద్వారా డ్రాసొఫైలావిరిలిస్‌లోని గుణకారకద్రవ్యా లను ఆరువర్గాల్లోకి విభజించవచ్చుననీ, ఒకేవర్గంలోని ప్రతివ్యష్టీ విడివిడిగా సంక్రమించక, ఆ వర్గమంతా (తరుచుగా) ఏకసమష్టిగానే సంతానానికి సంక్రమిస్తుందనీ మార్గన్ కనిపెట్టాడు.

ఇక డ్రా. విరిలిస్ యొక్క బీజంలోని తంతువుల సంఖ్యకూడా ఆరే.

ఒక్కొక్క గుణకారకద్రవ్యవర్గానికీ ప్రతిగా బీజంలో ఒక్కొక్క తంతు వున్నది. కాబట్టి ఆయా వర్గంలోని గుణకారకద్రవ్యాలన్నీ ఆయా తంతువులో ఇమిడి ఉండవలెను. కాని తంతువులో సంక్రామగుళికలు ఒకటి తరువాత ఒకటి వరసగా ఏర్పరచబడి ఉండునని మనం లోగడనే తెలుసుకొని ఉన్నాము. కనుక, సంక్రామగుళికలే ఈ గుణకారకద్రవ్యాలని ఊహించవచ్చును. ఈ ఊహ నిజమే అయితే వర్గంలోని గుణకారకద్రవ్యాల సంఖ్య హెచ్చినకొద్దీ ఆవర్గానికి ప్రతిగా ఉండే తంతువు పొడుగుకూడా ఎక్కువాతూఉండాలి. సూక్ష్మదర్శిని ఈ ఊహ వాస్తవమే అని నిరూపించినది. ఇతరపరిశోధనలుకూడా ఈ ఊహానే బలపరుస్తున్నయ్.

మెండెల్ చెప్పిన గుణకారకద్రవ్యాలు జీవకణాలయొక్క తంతువులయందుండే సంక్రామగుళికలే అని ఆధునికపరిశోధనలవల్ల విశదమాతోంది.

కాబట్టి సంక్రామగుళికలే జీవిగుణనిర్ణేతలనిన్నీ, బీజ-గర్భబీజాలలోని ఈ సంక్రామగుళికలద్వారానే సంతానానికి జననీజనకుల గుణాలు సంక్రమిస్తయ్యనిన్నీ విస్పష్టము.

వెనకటిప్రశ్నలకు సమాధానాలు :— జీవిలో కనిపించే గుణాలన్నీ చాలావరకు స్వార్జితమైనవి కావు; ఇవి అన్నీ ఆజీవికి తన పూర్వులనుంచీ సంక్రమించినవే.

అనేకజీవులలో రంగు, ఆకారము, జీవితపరిమితి, వ్యాధినిరోధకశక్తి మొదలైన అనేకగుణాలు సంక్రామసిద్ధాంతాన్ని అనుసరించే సంతతికి ప్రదత్తమవుతయ్యని ప్రయోగాలవలన నిరూపించబడింది. డ్రాసొఫైలాలో మార్గన్ పరీక్షించిన ४०० గుణాలు ఇదేపద్ధతిన సంతానానికి సంక్రమిస్తయ్యని కనుగొన్నాడు.

పూర్వాగతమైన గుణాలను ప్రతిజీవీ తన సంతతికి సంక్రమింపజేయగలదనే విషయం నిస్సందేహము.

మనుష్యజాతిలో కొన్ని వ్యాధులు సంక్రమించే విధానాన్ని ఇక్కడ మనం పరిశీలిద్దాము. వ్యాధికారకమైన సంక్రామగుళికను 'కా' అనీ, వ్యాధివిహీనద్రవ్యాన్ని 'వి' అనీ పేర్కొందాము.

వ్యాధిసంక్రామము :— వ్యాధి సంక్రామంలో రెండురకా లున్నయ్: (i) బలహీనసంక్రామము, (ii) బలిష్ఠసంక్రామము.

బలహీనసంక్రామంలో వ్యాధికారకద్రవ్యాలు తల్లివైపునుంచీ, తండ్రివైపునుంచీకూడా సంక్రమిస్తేనే వ్యాధి అభివ్యక్తమాతుంది. అనగా (కా,వి)లు,కల దేహిలో వ్యాధి కనుపించదు. ఏలన, వ్యాధికారకద్రవ్యము తల్లితండ్రులలో ఒక్కరివైపునుంచే వచ్చింది. ఇక్కడ 'కా' ప్రచ్ఛన్నగుణాత్మకము; 'వి' ప్రత్యక్షగుణాత్మకము. మన అదృష్టవశాత్తు సాధారణంగా అన్నివ్యాధుల 'కా'లూ ప్రచ్ఛన్నగుణాత్మకాలే. అనగా జీవకణంలో రెండు'కా' లుండనిదే జీవి వ్యాధిపీడితుడు కాడు.

బలిష్ఠసంక్రామంలో వ్యాధికారక ద్రవ్యము తల్లితండ్రులలో ఒక్కరివైపునుంచి వచ్చినప్పటికీ వ్యాధి అభివ్యక్తమాతుంది. అనగా ఇక్కడ 'కా' ప్రత్యక్షగుణాత్మకం; 'వి' ప్రచ్ఛన్నగుణాత్మకం.

బలహీనసంక్రామము:—వ్యాధికల పురుషుని, వ్యాధిలేని స్త్రీని తీసుకుందాము. పురుషుడికి వ్యాధి ఉందికాబట్టి ఇతడి జీవకణాలలో రెండు 'కా' లుంటయ్; బీజంలో ఒక 'కా' ఉంటుంది. స్త్రీ గర్భబీజంలో ఒక 'వి' ఉంటుంది. [illegible]

యొక్క జీవకణాల్లో 'కా' 'వి' రెండూ ఉంటై. ఒకే జీవకణంలో రెండు 'కా'లు లేకపోవడంచేతనూ, 'కా' ప్రచ్ఛన్నగుణాత్మక మవడంచేతనూ సంతతి అంతా వ్యా హీనంగానే ఉంటుంది. కాని వీరిలో, ండ్రిలోలాగా, రెండు 'కా'లు లేవు; తల్లిలోలాగా రెండు 'వి'లూ లేవు. ఈ సంతతియొక్క జీవకణాలు 'సంకీర్ణజీవకణాలు'. ఈవిధంగా ప్రతిజీవకణంలోనూ వ్యాధికారకద్రవ్యము నివిష్టమైయున్నప్పటికీ, సంతానం సంపూర్ణారోగ్యంగానే ఉంటుంది.

తాము వ్యాధిపీడితులు కాకపోయినప్పటికీ, జీవకణాలు 'సంకీర్ణజీవకణా' లవడంచేత వీరు కొన్ని పరిస్థితుల్లో తమ సంతానానికి ప్రత్యక్షరూపాన ఆవ్యాధిని సంక్రమింపజేయగలరు. 'సంకీర్ణజీవకణాలు'కల వ్యక్తి శుద్ధజీవకణాలుకల వ్యక్తితో సంయుక్తమైతే సంతానమంతా వ్యాధివిహీనంగానే ఉంటుంది. ఎందుచేతనంటే—సంకీర్ణజీవకణాలు కల ఈ వ్యక్తి పురుషుడైనట్లైతే కొన్ని బీజాల్లో 'కా' ఉంటుంది; మరి కొన్ని బీజాల్లో 'వి' ఉంటుంది. ఇక జీవకణాల్లో రెండు 'వి' లుండటంచేత గర్భబీజా లన్నింటిలోనూ ఒక 'వి' ఉంటుంది.

'కా'కల బీజము 'వి' కల గర్భబీజంతో మిళితమైతే 'కా, వి' జీవకణాలు కల శిశువు జన్మిస్తుంది; అనగా శిశువు కావ్యాధి ఉండదు. కాని తండ్రివలె శిశువుయొక్క జీవకణాలుకూడా సంకీర్ణజీవకణాలు.

ఇక 'వి' కల బీజము 'వి' కల గర్భబీజంతో సంయుక్తమైతే (వి, వి) జీవకణాలు కల శిశువు జన్మిస్తుంది; అనగా శిశువుకు సంపూర్ణారోగ్యము; శిశుజీవకణాలు తల్లిజీవకణాలవలె విశుద్ధమైనవి.

కాబట్టి సంకీర్ణజీవకణాలు కల వ్యక్తి శుద్ధజీవకణాలు కల వ్యక్తితో సంయుక్తమైనప్పుడు జన్మించే సంతతి అంతా వ్యాధివిహీనంగానే ఉంటుంది.

కాని సంకీర్ణజీవకణాలు కల వ్యక్తి సంకీర్ణజీవకణాలు కల వేరొక వ్యక్తితోనైనా, లేక వా వ్యక్తితోనైనా సంయుక్తమైతే సంతతియందు కొంతమందిలో వ్యాధి ప్రత్యక్షమౌతుంది.

(౧) సంకీర్ణ జీవకణాలు కల స్త్రీ పురుషులు:—సంకీర్ణజీవకణాలు కల పురుషుడికి బీజాలు రెండు రకాలుగా ఉంటయ్: (i) 'కా' కల బీజాలు; (ii) 'వి' కల బీజాలు. అదేవిధంగా స్త్రీ గర్భబీజాల్లో కూడా రెండురకా లుంటై: (i) 'కా' కల గర్భబీజము; (ii) 'వి' కల గర్భబీజము.

(i) వ బీజము (i) వ గర్భబీజంతో కలిస్తే రెండు 'కా' లు కల శిశువు జన్మిస్తుంది; అనగా ఈ శిశువులో వ్యాధి అభివ్యక్తమౌతుంది. (ii) వ బీజము (ii) వ గర్భబీజంతో సమ్మిళితమైతే రెండు 'వి' లు కల, అనగా శుద్ధజీవకణాలు కల శిశువు జన్మిస్తుంది; వ్యాధి ఉండదు.

(i) వ బీజము (ii) వ గర్భబీజంతోనూ, (ii) వ బీజము (i) వ గర్భబీజంతోనూ సంయుక్తమైతే ఇద్దరు (కా, వి) లు కల, అనగా సంకీర్ణజీవకణాలు కల శిశువులు జన్మిస్తారు. ఇద్దరు శిశువులూ కూడా వ్యా

కనుక వీరికి పుట్టే ప్రతినలుగురు బిడ్డలలోనూ ఒక బిడ్డకు వ్యా ఉంటుంది.

కాబట్టి, సంపూర్ణారోగ్యం కల భార్యాభర్తలకుకూడా (ఇద్దరి జీవకణాలూ సంకీర్ణజీవకణాలైతే) వ్యాధిపీడితసంతతి జన్మించవచ్చును.

(౨) సంకీర్ణవ్యక్తి; రుగ్ణవ్యక్తి:—సంకీర్ణవ్యక్తి పురుషుడనీ, రుగ్ణవ్యక్తి స్త్రీ అనీ అనుకుందాము. అప్పుడు బీజాలు రెండురకాలుగా ఉంటయ్: (i) 'కా' కల బీజాలు; (ii) 'వి' కల బీజాలు. స్త్రీ జీవకణాలలో రెండు 'కా' లున్నాయి కాబట్టి ప్రతిగర్భబీజంలోనూ ఒక 'కా' ఉంటుంది. (i) వ బీజము గర్భబీజంతో సంయుక్తమైతే (కా, కా) కల శిశువు జని స్తుంద, అనగా రు

కాని (ii) వ బీజము గర్భబీజంతో సంమిళిత మైతే (కా, వి) కల శిశువు పుడుతుంది. శిశువుకు వ్యాధి ఉండదు; కాని సంకీర్ణజీవకణాలు. వీరికి నలుగురు సంతానం కలిగితే, ఇద్దరు వ్యాధిపీడితు లౌతారు; ఇద్దరు వ్యాధివిహీనులుగా ఉంటారు.

బలహీనసంక్రామానికి ఈ కింది వ్యాధులను ఉదాహరణగా పేర్కొనవచ్చును:

(i) ఫ్రీడ్రిక్స్ ఎటేక్సియా:—సాధారణంగా, ఆరేళ్లలోపుగా ఉన్న పిల్లల్లో ఈ వ్యాధి కనిపిస్తుంది. వ్యాధిలక్షణాలు: కాళ్లు దుర్బలం; బుద్ధిమాంద్యము; శరీరంలో అకారణంగా కంపం. (ii) అమారెటిక్ ఫామిలీ ఇడియసీ:—లక్షణాలు: సంపూర్ణబుద్ధిమాంద్యం; కళ్లు చెడిపోయి క్రమంగా గుడ్డితనం; దౌర్బల్యం; రెండేళ్లలో మరణం.

బలిష్ఠసంక్రామము

తండ్రికి వ్యాధి ఉండి, తల్లికి వ్యాధి లేదనుకుందాము; అప్పుడు బీజంలో 'కా', గర్భబీజంలో 'వి' ఉంటై. అందుచేత సంతానముయొక్క జీవకణాలలో (కా,వి) ఉంటై. ఒక వ్యాధికారకద్రవ్యము తండ్రినుంచి సంతానానికి సంక్రమించింది. బలిష్ఠసంక్రామ మవడంచేత జీవకణాలలో ఒక్క 'కా' ఉన్నప్పటికీ వ్యాధి అభివ్యక్తమౌతుంది. ఈసంతానముయొక్క జీవకణాలు సంకీర్ణజీవకణాలు. సంకీర్ణజీవకణాలు కల వ్యక్తులయొక్క కలయికవలన పుట్టే సంతానం ఎటువంటిది?

జీవములు (i)కా; (ii) వి.

గర్భజీజములు (i)కా; (ii) వి.

(i) వ బీజము (i) వ గర్భబీజంతో కలిస్తే (కా,కా)కల శిశువు జన్మిస్తుంది; అనగా వ్యాధి కలదు. (i) వ బీజము (ii) వ గర్భబీజంతో కలిస్తే (కా,వి) కల శిశువు; అనగా వ్యాధి కలదు.

(ii) వ బీజము (i) వ గర్భబీజంతో సంయుక్త జన్మిస్తుంది.

(ii) వ బీజము (ii) వ గర్భబీజంతో సంమిళిత మైతే వ్యాధిలేని శిశువు జన్మిస్తుంది.

కాబట్టి తలిదండ్రులిద్దరూ వ్యాధిపీడితులైనప్పటికీ, (ఇద్దరి జీవకణాలూ సంకీర్ణజీవకణాలైతే), వారికి వ్యాధిలేని శిశువుకూడా జన్మించవచ్చును.

ఇక (కా,వి) కల వ్యక్తి (వి,వి) కల వ్యక్తితో సంయుక్తమైతే కలిగే సంతాన మెటువంటిది?

బీజములు (i) కా; (ii) వి

గర్భబీజములు (i) వి; (ii) వి

(i) వ బీజము + (i) వ గర్భబీజము=(కా,వి); అనగా వ్యాధికల శిశువు.

(i) వ బీజము + (ii) వ గర్భబీజము=(కా,వి); అనగా రుగ్ణశిశువు.

(ii) వ బీజము + (i) వ గర్భబీజము=(వి,వి); అనగా వ్యాధిలేని శిశువు.

(ii) వ బీజము + (ii) వ గర్భబీజము=(వి,వి); అనగా అరుగ్ణశిశువు.

కాబట్టి సంకీర్ణజీవకణాలు కల, అనగా వ్యాధిపీడితవ్యక్తియొక్కయు, వ్యాధివిహీనవ్యక్తియొక్కయు సంయోగమువలన పుట్టిన సంతతియందు ప్రతినలుగురిలోనూ ఇద్దరికి వ్యాధి ఉంటుంది; మిగిలిన ఇద్దరికీ ఉండదు.

బలిష్ఠసంక్రామానికి ఈ కిందివ్యాధులను ఉదాహరణగా పేర్కొనవచ్చును:—

(i) డయాబెటిస్ ఇన్సిపిడస్ (అతిమూత్రవ్యాధిలో ఒకరకము):— వ్యాధిలక్షణాలు: అతిమూత్రము; అతిదాహము; అతిఆకలి; మలబద్ధకము; దౌర్బల్యము. ఈ రకపు డయాబెటిస్ కల రోగుల మూత్రంలో పంచదార ఉండదు.

(ii) ఆంజియోన్యురోటిక్ ఈడెమా:—ఒంటి వాపు; సాధారణంగా బుగ్గలు, పెదిమలు వాస్తయ్; నరాలకు సంబంధించిన అస్వస్థత.

(iii) సికిల్ సెల్ ఎనీమియా:— పెద్దజ్వరం అకస్మాత్తుగా వచ్చి హఠాత్తుగా తగ్గిపోతూ ఉంటుంది; రక్తహీనత; రక్తకణాలలో కొన్ని కొడవలిఆకారంగా ఉంటై.

ఒక్కొక్కసారి సంపూర్ణారోగ్యం కల దంపతులకుకూడా వ్యాధిపీడితసంతతి కలుగవచ్చుననీ, అదే విధంగా రుగ్ణదంపతులకు సంపూర్ణారోగ్యం కల సంతానం కలుగవచ్చుననీ మనం తెలుసుకొన్నాము.

బహుశః ఇందుచేతనే మనవాళ్లు పిల్లనిచ్చేటప్పుడుకాని, పుచ్చుకొనేటప్పుడుకాని సంబంధం కలుపుకొనే వ్యక్తికికంటె ఆ వ్యక్తియొక్క వంశవృక్షానికే ఎక్కువ ప్రాధాన్యమిస్తారు.

పూర్వాగతంగాకాక మనం స్వయంగా ఆర్జించుకొన్న గుణాలు మన సంతానానికి సంక్రమిస్తయ్యా? అంటే సంక్రామగుళికలయొక్క నైసర్గికనిర్మాణాన్ని మనం కృత్రిమంగా మార్పిడిచేయగలమా ?

అప్పుడప్పుడు సంక్రామగుళికలు హఠాత్తుగా తమంతట తాము మార్పుచెందడం కద్దు. ఇట్టి హఠాత్పరివర్తనంవల్లనే,ఒకేజాతిలో కనిపించే ఈవైవిధ్యము, నానాత్వము సంభవమైంది. ఈ పరివర్తనం మనము కృత్రిమంగా సాధించగలమా ? అనేకప్రయోగాలు చేసినప్పటికీ ఇది ఇంతవరకూ సాధ్యం కాలేదు.

కళ్లల్లో ఎప్పటికైనా ఏకొద్దిమార్పైనా కలుగుతుందేమో అనే ఆశతో ౬౯ తరాలపాటు ఈగలను చీకట్లో పెంచిచూచారు. కాని మార్పేమీ కనిపించలేదు. కొన్నేళ్లకిందట పావ్లోవ్ అనే రష్యన్ వైజ్ఞానికుడు శిక్షణద్వారా ఎలుకల కలవరిచిన కొన్ని గుణాలు వాటి సంతానానికి సంక్రమిస్తయ్యని ప్రకటించాడు. కాని ఇది అసత్యమని తరువాతతరువాత చాలామంది అమెరికన్ వైజ్ఞానికులు నిరూపించారు.

చైనాఆడువారికి జన్మసిద్ధంగా పొట్టిపాదాలుండవు; తెలుగువారికి పుట్టిన పిల్లలను అరవదేశంలో పెంచితే అరవమూ తెలుగంత తేలిగ్గానే అబ్బుతుంది; ఎన్నితరాలపాటు కుక్కతోకలు తెగగొట్టినప్పటికీ, వాటికి పొట్టితోకలు కల పిల్లలు పుట్టవు.

సంక్రామగుళికలు బహిశ్శక్తులవలన మారు, చెందవనే చెప్పవచ్చును.

అనగా కేవలం స్వార్జితమైన సుగుణదుర్గుణాలు, రోగఆరోగ్యాలు సంప్రదాయసిద్ధముకానిచో, సంతానానికి సంక్రమించవనే చెప్పవచ్చును.

సంక్రామశక్తి ఎంత అనతిక్రమ్యమైనదో, దీనిపట్ల మన మెంత నిస్సహాయులమో తెలపడానికి కవలపిల్లల వ్యాధులు చాలా ప్రత్యాయకమైన నిదర్శనాలు. మార్గొనిస్, ఈన్‌స్టయిన్లు ఈ కింది ఉదాహరణలు పేర్కొన్నారు:— (i) ఇద్దరు కవలపిల్లలకు ఒకే వయస్సులో 'కాన్సర్' వచ్చింది. (ii) ఇద్దరు కవల స్త్రీలకు ౭ నెలల తేడాగా కుడికిక్కీలకు క్షయవ్యాధి సోకింది. (iii) ఇంకోజంటకు ఒకేవయస్సులో అతిమూత్రవ్యాధి ప్రారంభించింది. ఇద్దరూ నెలలు తేడాగా మరణించారు. (iv) ఆస్థ్మా, బ్రాంకైటీస్, కాటరాక్ట్ మొదలైన అనేకవ్యాధులు కవలపిల్లలలో ఏకసమయాన అభివ్యక్తమైనవి.

కాని గుణవిధాతలైన ఈ సంక్రామగుళికలు కొన్ని ధాతికపదార్థాలని మనము ఎరుగుదుము.

ఈ ధాతికద్రవ్యాల రసాయనికనిర్మాణసూత్రాన్ని కనిపెట్టి, ఈ నిర్మాణంలో మార్పు తేగలిగితే గుణాలుకూడా మార్పిడికాగలవని విశదము.

విజ్ఞానశాస్త్రానికీ మార్పిడి ఇంతవరకూ సాధ్యము కాలేదు; కాని ఎన్నటికైనా ఇది సాధ్యపడగలదనే వైజ్ఞానికులు విశ్వసిస్తున్నారు. వైజ్ఞానికుల ఈ ఆశయమేకనుక సిద్ధించినట్లైతే, వ్యాధిహీనమును, పవిత్రమును అయిన ఒక ఉత్కృష్టమానవజాతిని మనము నిర్మించుకోడానికి వీలౌతుంది.

కాని ఆ శుభసమయ మెన్నడు ? అది ఇంకను సుదూరమే అని వైజ్ఞానికుల ప్రత్యుత్తరము.

# వైపరీత్య



## శ్రీ కోట సుందరరామశర్మ

మీ తిట్లే
నాకగు దీవెనలూ
మీ "అక్షింతలె"
నా కక్షితలూ.

మీ కోపానలమే
మలయానిలమూ
మీ అశనిపాతమే
నా శనికి నిపాతం.

మీ కన్నుల ఎఱుపే
నా కనురాగం.

మీ పరిహాసం
నాపయి పుష్పం.

మీ నూరేమిరియం
నా కాయుర్వేదం.

మీ హుంకారము
నా కోంకారం.




కొద్ది మొత్తములను దాచుకొనదలచినవారు రూ. 5లకు ఒక సర్టిఫికెట్టు కొనవచ్చును లేదా ఒక్కొక్కటి అ. 4 అ. 8, రూ. 1 వంతున సేవింగ్సు స్టాంపులను కొనవచ్చును. సర్టిఫికెట్లును, స్టాంపులను గవర్నమెంటువారిచే నియమింపబడిన అధికారముపొందిన ఏ ఏజెంటువద్దనైన లేక సేవింగ్సు బ్యూరోలలోను పోస్టాఫీసులలోను దొరకును

“నా బిడ్డల వివాహ ఖర్చులను నేను భరించగలనా?” ఈ ప్రశ్నకు సమాధానము మీరు ప్రస్తుతము ఏమి చేయుదురో దానిమీద ఆధారపడియుండును

వివాహములు చేయుటవలన డబ్బు ఖర్చు అగును అనేక సంవత్సరములకుముందే జాగ్రత్తతో ద్రవ్యమును కూడబెట్టుటయు కూడబెట్టినధనమును సక్రమముగా వడ్డీకి వేసుకొనుటయు మీ బిడ్డలు ఎదిగివారికి వివాహమైన తర్వాత వారి సాంసారిక జీవనములో చక్కని ప్రారంభమునియ్యగలవు

# నేషనల్ సేవింగ్సు సర్టిఫికెట్లు

★ ప్రతి రూ. 10లు 12సంవత్సరముల తర్వాత రూ. 15లు అగును

★ నూటికి 4½ వంతుల చొప్పున సాధారణ వడ్డీలభించును. దీని మీద ఇన్‌కమ్‌టాక్సు లేదు.

★ 2 సంవత్సరములైనతర్వాత చేరినవడ్డీతో డబ్బును తీసుకొన 5ల సర్టిఫికెట్టుకు 18 నెలలు.)

RAA 126

# ప్రజా పరిషత్తు

## = శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య =

1942 క్రిప్సు ప్రతిపాదనలు అమలులోనున్నవనీ, యుద్ధం ముగిసిందికావున ఆ సూచనల ప్రకారం 1946 ఏప్రిల్ లోగా రాష్ట్రఅసెంబ్లీ ఎన్నికలు జరుగునవనీ, దామాషా ప్రాతినిధ్య ప్రకారం (ప్రపోర్షనేట్ రిప్రజంటేషను) భారతభవిష్యద్రాజ్యాంగనిర్మాణానికి ప్రజాపరిషత్తుఎన్నికలు జరుగుతవనీ, ఆ తర్వాత భారతస్వయంపాలనమునకు కావలసిన రాజ్యాంగాన్ని భారతప్రజలే నిర్ణయించుకుంటారనీ లండన్ వెళ్లి సంప్రదించి తిరిగివచ్చిన ఇండియా వైస్రాయి వేవెలు సెప్టెంబరు 19 న ఇండియాలోను, బ్రిటిషుప్రధాని అట్లీ ఇంగ్లాండులోను ప్రకటించారు.

అప్పుడే రాష్ట్రఅసెంబ్లీ ఎన్నికలకు అన్ని సన్నాహాలూ జరుగుతున్నవి. అన్నిపార్టీలూ రాష్ట్ర ఎసెంబ్లీ ఎన్నికలమీదనే తమ కార్యక్రమమంతా కేంద్రీకరించారు. ప్రభుత్వం రాష్ట్రఅసెంబ్లీల నన్నింటిని వరుసగా రద్దుచేస్తున్నవి. ఓటర్ల లిస్టులు అక్కడక్కడ తయారుచేస్తున్నాం అన్నారు. ఓటర్ల అర్హతలు మాత్రమే కాకుండా జాబితాలుకూడా పాతవే ఉంచుతామని ప్రభుత్వం అంటున్నది. కొన్ని రాష్ట్రాలలో ఇంకా అదనంగా చేరదలచినవోటర్లు తమ దరఖాస్తులు పంపుకొనే యేర్పాటు చేశాం అని అంటున్నారు. సంకుచిత ఓటింగు అర్హతతో, అంతకన్నా సంకుచితవ్యాఖ్యానాలతో, మరీ సంకుచిత అధికార్లతో ఎంతోమంది ప్రజానీకం వోటుఅర్హతను బడయలేక పోవుచున్నారు.

1937 నాటి ఓటింగు అర్హతలే నేటి అర్హతలున్నా. దేశంలో అభిప్రాయభేదం అంటూ లేకుండా అన్ని రాజకీయపార్టీలూ ఐక్యవాంఛగా కాకపోయినా ఏకవాంఛగా వయోజనవోటింగు అర్హత కల్పించవలెననీ, స్త్రీ పురుష భేదం లేకుండా మైనరువెళ్లిన ప్రతివారికీ వోటుండాలెననీ, ఆ విధంగా నూతనజాబితాలు తయారు చేయవలెనని కోరినా, కాలవ్యవధి చాలదనే సాకు తీసుకొని వైస్రాయీ, బ్రిటీషుప్రధానీ పాతపద్ధతినే అనుసరించ నిశ్చయించారు. క్రిందటి ఎన్నికలకన్న … … అంత అధికంగా వోటర్లు చేరే అవకాశం కల్పించను. క్రిందటి ఎన్నికలలో ఆయా రాష్ట్రాలలో … ప్రజలు వోటింగు అర్హతను పొందగలిగారో పరికించండి :

### 1937 వోటర్లు

| రాష్ట్రం | జనాభా | వోటర్లు |
|---|---|---|
| మద్రాసు | 44205000 | 6436760 |
| బొంబాయి | [illegible] | 2609457 |
| బెంగాలు | 50116000 | [illegible] |
| సంయుక్త | 48409000 | 5335309 |
| పంజాబు | 23781000 | 2686094 |
| బీహారు | 32371000 | 2412229 |
| మధ్య | [illegible] | 1741364 |
| అస్సాం | 8623000 | 815341 |
| సరిహద్దు | 2427000 | 246609 |
| ఒరిస్సా | 8360000 | 520225 |
| సింధు | 3887000 | 639043 |
| మొత్తం | [illegible] | [illegible] |

అంటే నాటికి దరిదాపులు 12 మందికిమాత్రమే వోటింగుహక్కు లభించింది. ఇపుడు బ్రిటిషురాష్ట్రాల్లో 1941 జనాభా ననుసరించి 295827000 మంది జనం ఉన్నారు. ఈ 1941 జనాభాలో జనం పెరిగినా

వోటింగుహక్కులో అవకాశాలేమీ పెరగనందున 29 కోట్లపైచిల్లరజనంలో 3 కోట్లమందికిమాత్రమే, అంటే 10 వ వంతుమాత్రమే వోటింగుహక్కు కలదు. అంటే నూటికి తొంబదిమందికి ఈయెన్నికలతో గాని, భారతపౌరజీవితంతో గాని, భవిష్యద్రాజ్యాంగంతో గాని సంబంధం లేకుండాపోయింది.

ప్రజాపరిషత్తునిర్మాణాన్ని గురించి క్రిప్సుసూచనలలో ఈవిధంగా ప్రసక్తిచేశారు: "భారతదేశంలోని నాయకులు ఈలాగా పరస్పరఒడంబడికతో మరొకవిధంగా నిర్ణయించిననేతప్ప, యుద్ధం ముగిసినవెంటనే విధిగా జరుపవలసిన రాష్ట్రశాసనసభల ఎన్నికలఫలితములు తెలియగానే రాష్ట్రాల్లోని ఎసెంబ్లీ సభ్యులందరూ ఒక ఎన్నికదారులముఠా (ఎలెక్టోరల్ కాలేజీ)గా యేర్పడుతారు. అందులో దామాషాప్రాతినిధ్యం (ప్రపోర్షనల్ రిప్రజంటేషను)ప్రకారం 'రాజ్యాంగనిర్మాణసంస్థకు' కాన్స్టిట్యూయంట్ అసెంబ్లీ అనే పేరు యిచ్చుటకు ప్రభుత్వానికిష్టంలేదు. అందుచేత వారెప్పుడూ ఆ పేరు పేర్కొనలేదు. ప్రభుత్వం మాటల్లో చిక్కుకొనదుకనుక యిది కాన్స్టిట్యూయంట్ ఎసెంబ్లీ కాదని నమ్మకమైయుండవచ్చు. ఈ ప్రజాపరిషత్తు అనే మాటను మనమే వాడుతున్నది.) రాష్ట్రఎసెంబ్లీ సభ్యులలో నూటికి పదిమందివంతున సభ్యులు ఎన్నుకోబడుతారు.

ఆవిధంగానే సంస్థానాలకుకూడా బ్రిటిషుఇండియాప్రజల దామాషానుసరించి ప్రతినిధులను పంపవలసినదిగా సంస్థానాధిపతులను ప్రభుత్వం కోరుతుంది. వారును బ్రిటిషుఇండియాప్రతినిధులతో సమానాధికారాలు కలిగియుంటారు."

ఇప్పటికే నూటికి పదిమందిచే ఎన్నుకొనబడిన సభ్యులు మరల తమలో నూటికి పదిమందిని ఎన్నుకోవాలి అంటే ఎన్ని వడపోతలు ? ఈ వడపోతలుకూడా సంస్థానాల్లో కాదు,—ఒక్క రాష్ట్రాల్లోనే ఈ పరోక్షపు ఎన్నికలు. ఇంగ్లాండు అంత ప్రదేశంలో పార్లమెంటుకు కావలసిన 614 మంది ఎన్నికలు ప్రత్యక్షమే. అమెరికాలో చివరకు ప్రెసిడెంటు ఎన్నికలు ప్రత్యక్షమే. మనదేశంలో 159 మంది సభ్యులు, 40 కోట్ల జనం నుండి—కాదుకాదు, 29 కోట్ల జనంలో 3 కోట్ల ఓటర్లనుండి పరోక్షపు ఎన్నికలు. మిగత 50 నామినేషనులు. ఎంతదారుణం!

ఇక సంస్థానాల్లో పౌరసత్వహక్కులు లేవు. ప్రజాప్రతినిధి సభలు లేవు. ఎన్నికలు ఎరుగనే యెరుగరు. ఆసంస్థానాలనుండి వచ్చే ప్రతినిధులు యెన్నుకోబడినవారు కారు. సంస్థానాధిపతి ఎవరిని పంపుతే అతను ఇన్ని వడపోతలతో బయటపడిన రాష్ట్రాలలోని ప్రతినిధితో సమానహోదా కలిగియుంటాడు. సంస్థానాధిపతుల ఆప్తులనే పంపుతారు. వారు సహజంగా ప్రజావిరోధులై యుంటారు. క్రిందటి యుద్ధానంతరం యూరప్‌ఖండంలోని దేశాలలో యేర్పడిన ప్రజాపరిషత్తులు ప్రజలు సరాసరి యెన్నుకున్నవే. 1919–20 లో యూరప్ దేశంలో ప్రత్యక్ష ఎన్నికలతో ఆప్రజాపరిషత్తు లేర్పడితే ఇండియాలో ఈ రెండవ ప్రపంచయుద్ధానంతరం 1946 లో కూడా పరోక్షపు యెన్నికలు! సంకుచిత వోటింగు, టోరీల ప్రభుత్వంలో కాదు-కార్మిక పక్షప్రభుత్వంక్రిందకూడా అంతే. అందులో అనేక వడపోతలు.

ఇక ఈ ప్రజాపరిషత్తు నిర్మాణపు పరికించుదాం. బ్రిటీష్ ఇండియాలోని రాష్ట్రాల్లో ఆయా రాష్ట్రాల ఎసెంబ్లీసభ్యులందరూ ప్రజాపరిషత్తుకు వోటర్లు. వారిలో నూటికి పదిమందివంతున వారినుండి ఎన్నుకోబడినవారు ఈప్రజాపరిషత్తుకు సభ్యులవుతారు. ఆయారాష్ట్రాల ఎసెంబ్లీసభ్యత్వా లీ విధంగా ఉన్నవి:—

రాష్ట్రాల ఎసెంబ్లీలు

| (రాష్ట్రం) | (సభ్యులు) |
| --- | --- |
| మద్రాసు | 215 |
| బొంబాయి | 175 |
| బెంగాలు | 250 |

| | |
|---|---|
| సంయుక్త | 228 |
| పంజాబు | 175 |
| బీహారు | 152 |
| మధ్య | 112 |
| అస్సాం | 188 |
| సరిహద్దు | 50 |
| ఒరిస్సా | 60 |
| సింధు | 60 |
| (ఆంధ్ర | 77) |
| మొత్తం | 1585 |

దీనినిబట్టి 1585 మంది ఎసెంబ్లీసభ్యులు అవుతారనీ, వీరంతా వోటరులయితే, వారిలో నూటికి పది మంది, అంటే 158 మంది, లేక 5 ను నిండుగా వేసుకుంటే 159 మంది రాష్ట్రాలనుండి ప్రజాపరిషత్తుకు సభ్యులుగా ఎన్నుకోబడుతారనీ తేలుతున్నది.

ఇక ఈ 1585 మందినుండి 159 మందిని ఎన్నుకోవడం ఎట్లా అనేది పరికించవలసివున్నది. వీరంతా ఒక ఎన్నికలముఠా అవుతారనీ, వారిలోనుండి దామాషాప్రాతినిధ్యం ప్రకారం ఎన్నుకోవలెననీ క్రిప్సు సూచించాడు. దామాషా అనేది ఏ ప్రాతినిధ్యంపై ఆధారపడిఉంటుంది అనేది సమస్యయే! కులమతాలవారీ ననుసరించియా, రాష్ట్రాలవారీననుసరించియా? కులమతాలవారీ ప్రాతినిధ్యంపై ఆధారపడుతుందంటే ఈ 1585 మంది ఏ కులమతాలవారీగా నియోజకవర్గాలనుండి ఎన్నుకోబడ్డారో గమనించండి:

ప్రా తి ని ధ్యం

| (నియోజకవర్గం) | (సభ్యులు) |
|---|---|
| జనరల్ | 685 |
| నిమ్న జాతులు | 151 |
| వెనుకపడినజాతులు | 24 |
| ముస్లింలు | 482 |
| సిక్కులు | 34 |
| ఆంగ్లో ఇండియన్‌లు | 11 |
| యూరోపియనులు | 26 |
| భారతక్రైస్తవులు | 20 |
| వ్యాపారపారిశ్రామికు | 56 |
| భూస్వాములు | 37 |
| విశ్వవిద్యాలయాలు | 8 |
| కార్మికులు | 38 |
| జనరల్ స్త్రీలు | 28 |
| మహమ్మదీయస్త్రీలు | 10 |
| ఆంగ్లో ఇండియన్ | 1 |
| భారత క్రైస్తవ స్త్రీలు | 1 |
| మొత్తం | 1585 |

ఈ వివరాలు కులమతాలవారీగానూ, ప్రత్యేక వ్యక్తులవారీగానుఅనేదానికన్న కొంత వర్గాలవారీగాను, మరల స్త్రీ పురుషవివరంగాను ఉన్నవి. ఈ విధంగా కాకుండా కులమతాలవారీగానూ, వర్గాలవారీగానూ, మరి ఇతరవిధంగానూఉన్నవన్నింటిని సమన్వయంచేసిన అసలు కులమతాలు, వర్గాలు ఈ విధంగా తేలగలవు. ఆ విధంగా తేలిన ప్రజాపరిషత్తువోటర్లు అనండి, రాష్ట్రఎసెంబ్లీసభ్యులు అనండి వారి సంఖ్య తేలుతుంది. వారినుండి నూటికి 10 మందివంతున ఎన్నుకోబడిన సభ్యుల సంఖ్య తేలుతుంది.

ప్రజాపరిషత్తు వోటర్లు సభ్యులు

| నియోజకవర్గం | రాష్ట్ర అసెంబ్లీ సభ్యులు. | ప్రజాపరిషత్తు సభ్యులు. |
|---|---|---|
| జనరల్ మొత్తం | 685 | 69 (?) |
| నిమ్న జాతులు | 151 | 15 |
| వెనుకపడినజాతులు | 24 | 2 |
| సిక్కులు | 35 | 3 (?) |
| ముస్లింలు (స్త్రీలుసహా) | 492 | 49 |
| భారతీయక్రైస్తవులు | 21 | 2 |
| వ్యాపారపరిశ్రమలు | 56 | 6 |
| భూస్వాములు | 37 | 4 |
| విశ్వవిద్యాలయాలు | 8 | 1 |
| కార్మికులు | 38 | 4 |
| ఆంగ్లోఇండియన్ | 12 | 1 |
| యూరోపియన్ | 26 | 3 |
| | 1585 | 158 |

# భారతి - పార్థివ మార్గశీర్షము

ఈవిధంగా 1585 మందికి 5 ను నిండు అంకెగా లెక్కిస్తే 160 మంది సభ్యులవుతారు. అయితే వేవెలు ప్రకటన యిచ్చిన మరుదినం అధికారవర్గం ఢిల్లీనుండి అనధికారప్రకటనగా (19-వ తేదీ) ప్రజాపరిషత్తుకు 159 మంది సభ్యులుంటారనీ, అందులో నూటికివంతు-50 మంది సంస్థానాధిపతులంపే ప్రతినిధులుంటారనీ, మొత్తం 209 మంది సభ్యులు ప్రజాపరిషత్తు కుంటారనీ (21 హిందూ) ప్రకటించారు. అందుచేత వీరు 5 అంకెను నిండుఅంకెగా స్వీకరించినట్లు కాన్పించనందున 160 మంది కాజాలకపోయినారు. ఇక 159 మాత్రం ఎట్లా అవుతారు? సవర్ణ హిందువులు - జనరల్ సీట్లుసభ్యత్వం 685 ఉంది. అందుచే 69 మందిని ఎన్నుకుంటారా, 68 మందిని ఎన్నుకుంటారా? సిక్కులకు 35 సభ్యత్వం ఉంది. వారు 4 గురిని ఎన్నుకుంటారా, 3 గురిని ఎన్నుకోవలెనా? 159, అంకెఅయితే యేనాటికైనా సిక్కు, సవర్ణులమధ్య సభ్యత్వానికి పేచీ రాగలదు. 160 చేస్తే ఈ పేచీ పోగలదు. అది అనుభవంలో కాని మార్చరేమో? అందుచేత మొత్తంమీద పేలింది. ఈపైఅంచనాలప్రకారం కులమతవర్గాలవారీగా సభ్యత్వం అయితే ఈపైదామాషాను ఎన్నికలు జరుగవలసిఉన్నది. ఈసందర్భంలో 1941 జనాభా ననుసరించి ముఖ్యకులమతాల జనాభా రాష్ట్రాలవారీగా పరికించడం అవసరం కాగలదు. (క్రింది పట్టిక చూడండి).

ఇంతవరకు దామాషా ననుసరించి మనం ప్రజా పరిషత్తుకు 159 సభ్యులను సరిపుచ్చితిమేగాని ఇది దామాషాగా తేలంపవీలులేదు. ఇది కులమతదామాషా అయితే భూస్వాములు, వ్యాపారపరిశ్రమలు, విశ్వవిద్యాలయాలు, కార్మికులు కమ్యూనల్ (కులమత) ప్రాతినిధ్యంక్రిందికి రానేరవు. అందువలన భారతదేశం మొత్తంగా కులమతాలవారీగా అంచనావేస్తే ఈపై అంకెల ప్రకారం పరికించినా హిందువులు, సవర్ణులు, నిమ్నజాతులు, ముస్లింలు, భారత క్రైస్తవులు, సిక్కులు మాత్రమే ఆగణనంక్రిందికి రాగలరుగాని ఆర్థిక వ్యాపారలాభాలకోసరం, వాటి భద్రతకోసరం సీట్లు జనాభాకు సంబంధంలేకుండా యిచ్చిన యూరోపియనుల దామాషా యేవిధంగా చెల్లుగుంది? వారికన్నా అధికంగా దేశంలో స్థిరనివాసమేర్పరచుకొనిన ఆంగ్లో ఇండియనులకు యూరోపియనులకన్న

1941 జనాభా వివరాలు (వేలల్లో) *

| రాష్ట్రం | సవర్ణులు | నిమ్న జాతులు | ముస్లింలు | క్రైస్తవులు | సిక్కులు | మొత్తం |
|---|---|---|---|---|---|---|
| మద్రాసు | 34731 | 8068 | 3896 | 2047 | 0.4 | 49342 |
| బొంబాయి | 14700 | 1855 | 1920 | 375 | 8 | 20850 |
| బెంగాలు | 17680 | 7879 | 33005 | 116 | 16 | 60307 |
| సంయుక్త | 34095 | 11717 | 8416 | 160 | 232 | 55021 |
| పంజాబు | 6302 | 1249 | 16217 | 505 | 3757 | 28419 |
| బీహారు | 23174 | 4340 | 4716 | 35 | 13 | 36340 |
| మధ్య | 9881 | 3051 | 784 | 59 | 15 | 16814 |
| అస్సాం | 3537 | 676 | 3442 | 41 | 3 | 10205 |
| సరిహద్దు | 180 | — | 2789 | 11 | 58 | 3038 |
| సింధు | 1338 | 192 | 3208 | 20 | 31 | 4535 |
| ఒరిస్సా | 5595 | 1238 | 146 | 28 | 0.2 | 8738 |
| బ్రిటిషు ఇండియా | 150890 | 39921 | 79399 | 3482 | 4165 | 295809 |
| సంస్థానాలు | 55227 | 8892 | 12660 | 2834 | 1526 | 93189 |
| ఇండియా | 206117 | 48813 | 92058 | 6817 | 5691 | 388998 |

చాలా తక్కువస్థానా లివ్వడంవల్ల యేదామాషా అమలుజరిపినట్లవుతుంది? యూరోపియన్ల కిచ్చిన సభ్యత్వం వారికి వైటేజీకోసం యిచ్చిందే. ఆసందర్భాన్నిబట్టి ఇంగ్లాండు పెట్టుబడులూ, వ్యాపారాలూ ఇకముందు వైస్రాయి గవర్నర్ జనరల్ అధికారం క్రిందకాకుండా వేరే ఒక హైకమీషనర్‌ను నియమిస్తామనీన్నీ, అతని ఆధీనంలో ఉంటవనీ జూన్ 14న వేవెలుతన ప్లానులో ఉదాహరించాడు. ఇకతాత్కాలిక పరిష్కారసందర్భంలోనే వారి సంగతికి అంత వైటేజీ యివ్వము అన్నప్పుడు, ఈ శాశ్వత పరిష్కార సందర్భంలో వారికి ఇంత సభ్యత్వం, ప్రాతినిధ్యం అనవసరం. అందుచేత వారి సభ్యత్వాన్ని పురస్కరించుకొని నిర్ణయించబడే దామాషాప్రాతినిధ్యం సరియైనది కాజాలదు.

భూస్వాములు, వ్యాపారపరిశ్రమల ప్రతినిధులు అనేవారికికూడా బ్రిటీషుసామ్రాజ్యవాదం దామాషా ప్రాతినిధ్యం యివ్వకుండా వుండదు. ఈ దామాషా ప్రాతినిధ్యం కులాలమీద, మతాలమీద, వర్గాలమీద విభజన అవుతుందని తేలుతుంది. ఇంతవరకు ఉదాహరించిన ప్రకారం కులమతాలవారీగా నిర్ణయం జరిగితే, దామాషావిభజించుతే మొదటివిధానం, అంటే సభ్యులందరూ ఒకే ఎన్నికదారులముఠా కావడం అనేది మార్చవలసివస్తుంది. ఈ మార్పుఫలితంగా ఒకే ఎన్నికదారులముఠా అన్నప్పటికీ రాష్ట్రాలవారీ అనే విషయం గమనించి రాష్ట్రాలవారీగా కులమతాల వర్గాల దామాషాననుసరించి ఎన్నికలు జరుగవచ్చు.

వేవెలుప్లాను భగ్నమైన తర్వాత ప్రతిష్ఠంభనా పరిష్కారసూచన చేస్తూ రాజాజీ అగష్టు 7 న క్రిప్సు ప్రతిపాదనలను ఉదాహరిస్తూ భారతదేశంలోనిరాష్ట్రాల ఎసెంబ్లీ సభ్యులు ఏకంగా ప్రజాపరిషత్తు సభ్యులను యావద్భారతంగా యెన్నుకోవడం కాకుండా, యే రాష్ట్రాని కారాష్ట్రం భారతసమాఖ్యలో కేంద్రంలో ఉండేదీ లేనిదీ తేల్చుకోవడం అనేదే ఈనాటి ప్రధాన సమస్యగా ఉన్నందున ఆయారాష్ట్ర ఎసెంబ్లీలే తమ సభ్యులను తమ దామాషానుబట్టి ఎన్నుకోవడం అవసరమని సూచించారు.

అందుచేత కులమతాలకు దామాషా ప్రాతినిధ్యం ఇవ్వడం అనేది ప్రధాన సూత్రంగా పెట్టుకొన్నప్పటికిని, రాష్ట్రప్రయుక్తంగాఅనేది సమానప్రాధాన్యతతో గమనించవలసి వస్తున్నది. ఫెడరల్ ఎసెంబ్లీ ఎన్నికలలో 1. జనరల్, 2. ముస్లిం, 3. సిక్కుస్థానాలు ఆయారాష్ట్రాలల్లో ప్రాంతాలు నిర్ణయింపబడి నియోజకవర్గాలు విభజిస్తారని కే.టి. షా సుడివిస్తున్నారు.* అందువలన ఆ పద్ధతే ఈ ఎన్నికలకు కూడా అవలంబిస్తారని తలంచితే ఆవిధంగానే ఈ ప్రజాపరిషత్తు ఎన్నికలకుకూడా రాష్ట్రాలవారీ ముఠాలు (Colleges) యేర్పరుస్తారని అందులో రాష్ట్రాలదామాషా ననుసరించి ఎన్నికలు జరగాలె. ఈ విధానం ఫెడరల్ ఎసెంబ్లీ ఎన్నికలకు, స్టేటుకౌన్సిలు ఎన్నికలకు 1935 ఆక్టులో ఉదాహరింపబడి ఉంది.

అందువలన మొత్తంమీద పరికిస్తే, ఈ సామ్యాలన్నింటినీ అన్వయించుకుంటే దామాషానుబట్టి ప్రాతినిధ్యం యేర్పడుతుందని, ఎన్నికలు శాసనసభ్యులు నియోజకముఠాగా యేర్పడినా సభ్యులు యేరాష్ట్రానికారాష్ట్రం, జనరల్, ముస్లిం, సిక్కు, నిమ్నజాతుల స్థానాలకు ఎన్నుకోవడమే జరుగవలెనని తేలుతుంది. అంతేకాకుండా రాజాజీ చెప్పినట్లేమి, అసలీనాటి రాజకీయ పరిస్థితుల, సమస్యల ప్రాధాన్యతనుబట్టి యేమి యేరాష్ట్రానికారాష్ట్రమే నియోజనముఠాగా యేర్పడి ఆయా నియోజకవర్గాలనుండి వచ్చినసభ్యులు ఆయా నియోజకవర్గాలకు ప్రతినిధుల నెన్నుకోవడం అత్యావసరంగా జరిగిననే అసలు సమస్యలు సరిగా అవగతంకావడం, పరిష్కారం జరుగుట కవకాశం ఉంటుంది. అందుచేత రాష్ట్రాలవిశిష్టత్వాన్ని చెక్కుచెదరనీయకుండా, బ్రిటీషుప్రభుత్వం వ్రేళ్లతో నిల్పిన కులమత ప్రాధాన్యాన్ని చెదిరిపోనీయకుండా ప్రజాపరిషత్తు ఎన్నికలు జరుగవలసివున్నది.

* Federal structure by K. T. Shah Page 298.

## వ మార్గశీర్షము

ఈ ఎన్నికలు జరుగునపుడు వోట్లు ఏ విధంగా ఉంటవో, అంటే సింగిల్ ట్రాన్స్‌ఫరబుల్ పద్ధతియా, క్యుములేటివ్ పద్ధతా, డిస్ట్రిబ్యూటివ్ పద్ధతియా ఇంత వరకు తేలలేదు. ఈ నాడు ఆంధ్రవిశ్వవిద్యాలయ సెనెటు ఎన్నికలు, అఖిలభారత కాంగ్రెస్ సంఘ సభ్యత్వ ఎన్నికలు సింగిల్ ట్రాన్స్‌ఫరబిల్ పద్ధతిన జరుగుచున్నవి. అంటే ఒకవోటరు తన వోటును ఒకే అభ్యర్థికిమాత్రమే యివ్వవచ్చును. అది అతనికి అవసరం లేకపోతే మరొకరికి మార్పుచేస్తూ ఉదాహరించవచ్చును. ఒక నియోజకవర్గంనుంచి యెంతమంది ఎన్నుకోబడవలసియున్నా తాను ఒక వోటును మాత్రమే యివ్వనర్హత ఉంటుంది. క్యుములేటివ్ పద్ధతి అంటే 1937 లో శాసనసభకు ఇద్దరు అభ్యర్థుల నెన్నుకోవలసినచోట యివ్వబడినట్లు. అంటే, ప్రతి వోటరూ ఆ నియోజకవర్గంనుండి ఎంతమందిని సభ్యులను ఎన్నుకోవలెనో అన్నివోట్లిచ్చే అర్హత ఉంటుంది. అన్నివోట్లను అందరు అభ్యర్థులకేకాక తన యిష్టం వచ్చిన ఏ ఒకరికైనాకూడా యివ్వవచ్చు. ఇక డిస్ట్రిబ్యూటివ్ వోటు అంటే ఒక నియోజకవర్గంనుండి ఎందరు సభ్యులను ఎన్నుకోవలెనో అన్ని వోట్లుంటవి. క్యుములేటివ్ మాదిరి వాటినన్నింటిని ఒకరికే యివ్వకుండా విధిగా ఎన్ని వోట్లుంటే అందరు అభ్యర్థులకివ్వవలెను. ఒక వేళ ఒకరికే యిస్తే ఒకవోటే లెక్కకు వస్తుంది. మిగతవి మురిగిపోతవి.

ఈ విధానపు వోట్లల్లో ఏ విధంగా వోటుచేయవలసి ఉంటుందో యింకా తేలలేదు. ఫెడరల్ అసెంబ్లీకి ఎన్నికలుకూడా పరోక్షమే! ప్రజాపరిషత్తు ఎన్నికలమాదిరే. దాని కిదివరలో సింగిల్ ట్రాన్స్‌ఫరబుల్ విధానం అమలుజరుపదలిచారు. అందువల్ల అన్ని తతంగాలు. ఆ ఫెడరల్ ఎసెంబ్లీ విధానమే అవలంబిస్తున్నారు గావున వోటింగుకూడా అదే విధానం అమలుజరుపుతారని తేల్చుకోవచ్చు. ఈ కారణంగా చూచినా రాష్ట్రాలవారీగానే ఎన్నికలు జరుగు అవకాశం ఉంది. అందువలన యావద్భారతంగా నియోజక మతాలవల్ల ఎన్నికలు జరిగినా రాష్ట్రాలప్రాముఖ్యం, ప్రాధాన్యతప్రాతినిధ్యం పోకుండా చూచుకోవలసి ఉంది. అందుచేత రాష్ట్రాలు తమ ప్రాముఖ్యతను ప్రస్ఫుటపరుస్తూ తమ విశిష్టతనుప్రకటించవలసి ఉంది.

ఈ ఎన్నికల వోటర్లు సంకుచితం అవడం, ఎన్నికలు పరోక్షమవడం, యూరోపియనులకు దామాషాకుమించిన ప్రాతినిధ్యం యివ్వడం, అంతకన్నా ప్రధానంగా సంస్థానాలనుండి ప్రజల ప్రతినిధులంటూ ప్రజల ఎన్నికలు లేకుండా సంస్థానాధిపతిచే నిర్ణయింపబడి రాష్ట్రాలలో ఎన్నుకోబడినవారితో సమాన అధికారాలుండడం, అన్నింటికన్నా ముఖ్యంగా పరాయి ప్రభుత్వం అనేకమరతులు పెట్టి ప్రజాపరిషత్తును పిలవడం ఎంచలేనన్ని లోపాలతో కూడుకొని వున్నది.

అసలు స్వాతంత్ర్యనిర్ణయం చేయగలిగిన ప్రజాపరిషత్తు ఆయా దేశపు వివిధపక్షాల సంయుక్త తాత్కాలికప్రభుత్వం యేర్పడి, మైనరువెళ్లిన ప్రతి వానికీ స్త్రీ పురుష తేడాలు లేకుండా వోటుహక్కు అర్హత ఉండి భాషాప్రయుక్తంగాననండి, జాతుల విధానంగాననండి సంస్థానాలనేవి నశించి, దేశపునర్విభజన జరిగి ప్రత్యక్ష ఎన్నికల విధానంతో రహస్య వోటింగు యేర్పరచి ఆయారాష్ట్రాల ఎసెంబ్లీల కెన్నికలు కాకుండా ప్రత్యేకం ప్రజాపరిషత్తుకే ఎన్నికలు జరిపి వారంతా ఆయారాష్ట్రాలవారు సమావేశమై తమ దేశరాజ్యాంగం, తమ రాష్ట్రరాజ్యాంగం యేవిధంగా ఉండాలెనో నిర్ణయించి ఆనిర్ణయమును ప్రజలముందు పెట్టి అందుపై భారతదేశపు ప్రజాపరిషత్తునకు ఎన్నికలు సరాసరి ప్రజలనుండియే జరిగితే ఆయా రాజకీయపార్టీలు యిచ్చిన ముఖ్యరాజ్యాంగ సూత్రాలపై తీవ్రచర్చలు, ప్రచారం జరిగి ప్రజలు ప్రబోధంపొంది సరాసరి ఎన్నుకోవడంతో యేర్పడినప్పుడే అది ప్రజల భవిష్యత్తును నిర్ణయించగల రాజ్యాంగం కాగలదు. అది ప్రజల అభిమతంతో రాజ్యాంగనిర్ణయం చేయగలిగిన ప్రజాపరిషత్తు కాగలదు.

అది నిజమే అయినా విధిలేని పరిస్థితులలో నంటూ ఈనాటి రాజకీయవాతావరణాన్ని భారతదేశంలోని వివిధరాజకీయ పార్టీల విభిన్నదృక్పథాలను, ఎదురొడ్డి పరిష్కరించలేని కారణాన కనీసం తమతమ రాజకీయవిధానాలను, తమ ఆశయాలను ప్రచారంచేయవచ్చుగదా అని, తమకు ప్రజలలో ఎంత పలుకుబడి యున్నదో, తమ ఆశయంతో కలిసినిలిచే ప్రజాసామాన్యం యెంత ఉందో అంచనా వేసుకోవడానికి పనికివస్తుంది కదా అని ఈనాడు భారతదేశంలోని అన్ని రాజకీయపార్టీలూ ప్రజాపరిషత్తు ఎన్నికలకు ముందు ప్రాతిపదికగా జరుగుచున్న రాష్ట్రఎసెంబ్లీ ఎన్నికలలో పాల్గొన నిశ్చయించి ఎవరి సాధనసామగ్రిని వారు తయారుచేసుకొని ప్ర

అదేవిధంగా గత్యంతరం లేనిదిగా ఈ నాటి ప్రజాపరిషత్తుకు జరిగే యెన్నికలు, దానికి సంబంధించిన నియమాలు ఉన్నవని తలచినా కనీసం రాజాజీ చెప్పినట్లు ఏ రాష్ట్రానికారాష్ట్రం తమ ప్రతినిధుల నెన్నుకోవడమన్నా జరగాలె. అందుకు ఏ రాష్ట్రానికారాష్ట్రంగా రాష్ట్రశాసనసభ్యులు సమావేశమై తమ ప్రతినిధుల నెన్నుకోవడానికి క్రిప్సుప్లానులోని 'ఏకనియోజకముతా'అనే పదం అడ్డంవస్తుందని తలచితే అచటకైనా యేరాష్ట్రానికారాష్ట్రం ఎన్నుకొనే అవకాశం కల్పించాలె. నిజానికి ఈ 'ఏకనియోజకముతా' అమలుజరుగ వీలులేదు. సంస్థానాలప్రతినిధులకు సమానహోదా ఉంటుందికదా! వారును ఈ ఏకనియోజకముతాలోకి వస్తారా - రారు. రాజాలరు. ప్రభుత్వమే అంగీకరించదు. సంస్థానాధిపతులు అంగీకరించరు. అందువలన 209 మంది ఏకనియోజకముతా కాజాలనపుడు క్రిప్సుప్రతిపాదనలలోని ఆమాట ఆచరణలో ఎగిరినట్లేకదా! అందువలన రాజాజీసూచననే అమలుజరుపుట క్షేమం. ఏవిధంగా యెంత తక్కువ అంచనాగా ఆలోచించినా స్థానికప్రాముఖ్యత పోవడానికి వీలు కన్పించడంలేదు. అంతేకాదు. పోనీయకుండా చూడడంకూడా అత్యవసరం. ఈ స్థానిక ప్రాముఖ్యతనేగాక స్థానికసమస్యను చర్చించి స్వీయ రాష్ట్రపాలనవిధానంకూడా నిర్ణయించుకోవచ్చు. ఎసెంబ్లీసభ్యులు గామాత్రమేగాక ప్రజాప్రతినిధివోటరులుగాకూడా ఆసమాలోచన చేయడం అవసరం. అందువలన యేరాష్ట్రంవారైనా తప్పకుండా కోరుతారు. అన్నిరాష్ట్రాలూ సాధించితీరునవి రాష్ట్రస్వయంవిధానసిర్ణయం, ఎన్నికలు. అందువలన యేరాష్ట్రానికారాష్ట్రం 'తమ రాష్ట్రంలో కలియకపోయినా ఒకముతాగానైనా కలిసి తమ ఎన్నికలు జరుపుకొనితీరవలసియున్నది. ఈవిషయంలో ఆయా రాష్ట్రాలు తప్పకుండా స్వతంత్రంగానే వ్యవహరించగలవు.

ఇక్కడే ఉంది ఆంధ్రులసమస్య. మన మద్రాసురాజధానిఎసెంబ్లీకి ఈక్రిందివిధంగా సభ్యులు ఎన్నుకోబడుచున్నారు. అందులో ఆంధ్రజిల్లాలనుండి ఎన్నుకోబడేవారి సంఖ్యకూడా ఈవిధంగా ఉంది:

| ప్రాతినిధ్యం | రాజధాని. | ఆంధ్రజిల్లాలు. |
|---|---|---|
| సవర్ణహిందువులు | 116 | 45 |
| నిమ్నజాతులు | 30 | 12 |
| వెనుకపడినజాతులు | 1 | 1 |
| ముస్లింలు | 28 | 9 |
| ఇండియన్ క్రైస్తవులు | 8 | 3 |
| స్త్రీజనరల్ | 6 | 2 |
| భూస్వాములు | 6 | 3 |
| కార్మికులు | 6 | 2 |
| మొత్తం | 215 | 77 |

రాజధానిమొత్తంలో ఆంగ్లోఇండియనులు 2, యూరోపియనులు 8, క్రైస్తవస్త్రీ, 1, ముస్లింస్త్రీ 1, విశ్వవిద్యాలయం 1 అదనంగా ఉన్నవి. వాటి ప్రసక్తి అటుంచినా 77 మంది ఆంధ్రసభ్యులు ఎన్నుకోబడుతారు. శాసనసభాసభ్యత్వనిర్ణయం జరిగినపుడే అన్యాయం జరిగింది. అందుపై జరుగవలసినంత ఆందోళన, వత్తిడి జరుగనేలేదు. మద్రాసు రాజధానిలోని 4,93,42,000 మంది జనంలో 2,28,18,000 మంది ఆంధ్రులున్నారు. 215 సభ్యులు గల రాజధాని ఎసెం

బ్లీలో దామాషానుబట్టి అయినా ఆంధ్రులకు 100 స్థానాలు రావలసింది. ఇప్పుడు లేపట్టితే అదుగో అద్దుఅంటారు. నిజానికిది చాలా అన్యాయం. 23 స్థానాలు ఆంధ్రులకు లేకుండాపోయినవి. గతించినదానికి యోజించి ప్రయోజనంలేదు. ఉన్నదానిలోనయినా ఆంధ్రసభ్యులనుండి ఆంధ్రప్రతినిధులను ఎన్నుకోవడమన్నా జరిగితే సంతోషింపదగును. ఈ ప్రతినిధులు రాష్ట్రజనాభా దామాషాననుసరించి 100 మంది కాకపోయినా ఈ నాటికి ఎన్నుకోబడు అవకాశం ఉన్న 77 మంది సభ్యులైనా తమ దామాషాననుసరించి ఎన్నుకోగలిగితే ఆంధ్రప్రాతినిధ్యం లభించినట్లే. కార్మికులు, స్త్రీలు, భూస్వాములు, తదితరులు రాజధాని మొత్తంమీదనైనా, లేకపోతే భారతదేశం మొత్తంమీదనైనా ఎన్నుకోబడవచ్చునని తలచినా జనరల్, ముస్లిం, నిమ్నజాతుల సభ్యులయినా తమ ప్రతినిధుల నెన్నుకోవచ్చు. సవర్ణహిందువులు 4, ముస్లిములు1, నిమ్నజాతులు 1 ఆంధ్రప్రతినిధులుగా ప్రజాపరిషత్తుకు వెళ్లగలుగుతారు. వారు మద్రాసీయులుగా కాకుండా ఆంధ్రులుగా ఎన్నుకోబడునట్లు చూడవలసివున్నది. ఆంధ్రప్రాతినిధ్యం మొత్తంమీద చూపవలెనంటే ప్రజాపరిషత్తు ఎన్నికలలోగానే రాష్ట్రం-ఆంధ్రరాష్ట్రం సంపాదించడం అవసరం. ఆ మాటంటే ఇది కల అంటారు. ఆంధ్రరాష్ట్రం సంపాదించడం-అందుకై ఆందోళనజరుపుట 40 సంవత్సరాలనుండి జరుపుతున్నా ఈ నాటికి సత్వరాంధ్రరాష్ట్రసంపాదన అంటే కేక్రిందికి తేలిపోయింది. ఆంధ్రుల రాజకీయ చైతన్యానికిది మచ్చ.

సత్వరాంధ్రరాష్ట్రనిర్మాణం ఆంధ్రైక్యతలోను, అందుకు చేసే ఆందోళనలోనే ఉందేకాని ఇది భారత రాజకీయ ప్రతిష్టంభనాపరిష్కారానికి అడ్డు కానే కాదు. రాజ్యాంగనిర్మాణం ప్రజాపరిషత్తు నిర్ణయిస్తుంది. ఆ రాజ్యాంగనిర్ణయంలో ప్రాథమికమైన రాష్ట్రనిర్మాణం మనం కోరుతున్నాం. భారతదేశ భవిష్యత్తును నిర్ణయించేది కొన్ని రాష్ట్రాలు (యూనిట్లు). ఆ రాష్ట్రాలలో మనం ఉండనే ఉన్నాం. 40 కోట్ల భారతీయులలో ఆంధ్రులంకూడా ఏ విధంగా అంతర్గర్భితం అయివున్నామో ఆ విధంగానే ఈ ప్రజాపరిషత్తులోకూడా మనం అంతర్గర్భితం అయేవున్నాం. సంఖ్యాధిక్యతను కల్పించేది యేమీలేదు. మద్రాసు రాజధానినుండైనా వెళ్లుతాం. ఈ రాష్ట్రనిర్మాణం దక్షిణాపథంలో జరుగనున్నది. పాకిస్థాన్ నిర్ణయానికి అడ్డుకానేరదు. ఇది పాకిస్థాన్ సరిహద్దులోనిదీకాదు. మన సభ్యత్వం మద్రాసురాజధానిలోనైనా వచ్చితీరేదే!

ఆంధ్రులుగా హాజరపడమా, మద్రాసీయులుగా హాజరవడమా అనేదే సమస్య. ఆంధ్రులుగా వెళ్లడం అంటే ఒకజాతి, ఒకరాష్ట్రం తన జన్మహక్కును, స్వయంనిర్ణయసూత్రాన్ని అమలుజరుపుకోవడం అవుతుంది. అంటే ఇతరులుకూడా స్వయంనిర్ణయసూత్రాన్ని అమలుజరుపుకో నవకాశం యిచ్చి తమ ఆశయానికి బలాన్ని చేకూర్చుకోవడం అవుతుంది. ఆంధ్రులు ఆంధ్రులుగా- మద్రాసీయులుగాకాకుండా- హాజరయితే-కొన్ని వేలసంవత్సరాల సంస్కృతి, నాగరికత, చరిత్ర, విశిష్టత గలిగిన ఒక గొప్పజాతి స్వయంనిర్ణయాన్ని ఆమోదించిందన్నమాట. అనేక రాజకీయ పోరాటాలలో, స్వాతంత్ర్యసమరాలలో వెన్నుచాచి, రొమ్మువిరచి ముందడుగువేసి ప్రపంచవిఖ్యాతి గణించి, సామ్రాజ్యవాదులకు సింహస్వప్నంగా మెలగి, భారతదేశంలో ఆదర్శప్రాయంగా నిలిచిన ఆంధ్రజాతి తన ప్రజాసామాన్యబలంతో, ప్రజాతంత్రశక్తితో భారత ప్రజాతంత్రాన్ని పదునుపెట్టగలుగుతుంది. ఆంధ్రరాష్ట్రనిర్మాణం భవిష్యద్భారతరాజ్యాంగనిర్ణయానికి ప్రతిబంధకం కాకపోగా ప్రబలసహకారి అవుతుంది. ఇందుకై ఆంధ్రులు సర్వశక్తులూ ధారపోసి తమ జన్మహక్కును సాధించాలె.




[ కథ ]

= శ్రీ కందుకూరు లింగరాజు

(గతసంచిక తరువాయి)

రైల్లో ఎక్కినప్పుడే కక్కాయికి దూరంగా ఉన్నానుకదా అని ఓ ధైర్యం కల్గి తనను నిష్పక్షపాతంగా సింహావలోకనం చేసుకున్నాడు. ఎంత ఎల్లా ఆలోచించుకున్నా కక్కాయిమాటలు శరీరానికి సిగరెట్లు అలవాటు చేసుకున్నట్టే అయింది.

అన్నయ్య ఇంటిమెట్లు ఎక్కేటప్పుడు గుండెలు ఎందుకో వెనుదీశాయి. ఇదివరకటి రామూగా తాను ఆ ఇంట్లోకి వెళ్లటంలేదు.

శీతారామయ్య అవ్వాళ చెప్పకుండా తెల్లారగట్టే వచ్చేసేను, దొంగలాగ అన్న భావంలో చాలా కుల్లిపోయేడు. ఇక తమ్ముడికి మొఖం ఎల్లా చూపిస్తానని యేడ్చేడు కూడాను. వెంకటలక్ష్మమ్మతో జరిగిందంతా చెప్పి చాలా బాధపడ్డాడు. ఆవిడా ఎటూ మాట్లాడలేక భర్తను చూచి, కన్నీళ్లుపెట్టుకుంటూనే బ్రతి ఉన్నన్నాళ్లూ మనిషిని కాల్చుకుతినేసేరు. చచ్చికూడా కక్కాయిరూపంలో ప్రవేశించి రక్తమే త్రాగేస్తోన్నా" రని గోలపెట్టింది. శీతారామయ్య ఏం సమాధానమూ చెప్పలేకుండానే వుండిపోయేడు. ఓవిధంగా వూహల్లో తమ్ముడేమైనా మారుతాడా అన్న సంశయం పొడచూపక పోలేదు.

తిరిగీ తమ్ముడు రావడం అటు శీతారామయ్యకూ, ఇటు వెంకటలక్ష్మమ్మకూ కూడా కొత్త ఆశ్చర్యం కల్గించింది. కక్కాయి రానివ్వదనే ఉద్దేశ్యంలో ఇద్దరూ పడ్డారు. పోనీ, ఎల్లాగో వచ్చేడనుకుని, పాడుపడిపోయిన గృహానికి దీపారాధన చేసినట్లే సంబరపడ్డారు.

మూడురోజులవరకూ రామూ ఏం మాట్లాడలేదు. ఇక్కడే వుండి తమదగ్గరే చదువుకుంటాడనుకున్నారు. ఆ మూడు రోజుల్లోనే ఇల్లు మామూలు జీవనంలోకి వచ్చేసింది.

అవ్వాళ భోజనాలదగ్గర శీతారామయ్య అన్నాడు: "రామూ! మా ఏజెంటును ఇవ్వాళ కాకినాడ ట్రాన్స్ఫర్ అడిగాను. ఇస్తానన్నాడు. మరి నీ కాలేజీ చదువుకు ఇక్కడ నుంచి..."

రామూను ఓప్రక్క కృతజ్ఞత ఏడ్పించింది. చెప్పలేక చెప్పేడు: కక్కాయీ, తనూ కాకినాడలో కాపురంపెట్టి చదువు సాగిస్తామని.

ఆవార్త దంపతులిద్దరికీ పిడుగుపడ్డట్టు అయింది. రామూ అంత యెత్తు ఎత్తుతాడని ఎప్పుడూ అనుకోలేదు. ఇరువురూ దిగనారిపోయేరు.

"ఏవోనాయనా, మాకడుపున ఒక్కకాయ లేకపోవడం మూలాన నీ మీదనే మా ఆశలన్నీ నిల్పుకున్నాం. మాదగ్గర వుండే చదువుకుంటూ వనుకుని సంబరపడ్డాం. ఏదో నువ్వు వచ్చినప్పటి నుంచీ ఇంటికి మాణిక్యంలా ఉన్నావు" అని వెంకటలక్ష్మమ్మ తన అమాయికత్వంలోనే అంది.

వాట్లకన్నిటికీ కక్కాయిమాటల్లో అర్థంతీస్తే ముందు రాబోయే పెనుగాలికి ప్రతీహారులూ, కంచుకులూ క్రింద కన్పట్టింది రామూకు.

సీతారామయ్యకూడా చెప్పేడుకాని, "ఏదో కక్కాయి ముసలిదయిపోయింది. ఆట్టే సంవత్సరాలు కూడా బ్రతుకుతుందో లేదో. ఉన్నది మా వేపు ఆవిడ ఒక్కర్తేకదా. ఆవిడకో కోర్కె తీరుస్తే చచ్చేముందర సంతోషంగా ప్రాణంవిడుస్తుందేమో" అన్నాడు రామూ. మా, మీ అని విడతీయడం, అల్లా మాట్లాడడంతోటి సీతారామయ్యా, వెంకటలక్ష్మమ్మలకు ప్రాణాలు నిలువునా పోయినట్లే అయింది. తన పంచన ఓ పాముకు, రెండుతలల నాగుకు పాలుపోసేడా? అది ఇప్పటినుండీ బుసకొట్టడానికి కక్కాయి అనే పుట్ట సాధారంగాచేసుకుని పడగలు విప్పుతోందా? ఆ విష లేపంచేత తన శరీరమే దగ్ధమైపోయి, శాంతిలేక అల్లాడుతూ ఈభూమిమీద నూకలు చాలించుకుంటుందా? చాలా ఆ వేదనతోనే ఆఫీసుకు వెళ్లేడు. ఎవరితోనూ మాట్లాడలేకపోయేడు. రెండు మూడు సార్లు కళ్లమ్మట నీళ్లుకూడా వచ్చేయి.

ఏరోజున, ఏముహూర్తాన రామూను తెచ్చుకున్నాడో అప్పటినుండీ జీవితం సుఖంగా జరుగుతుందనే ఆశించుకుని సౌధాలు నిర్మించుకున్నాడు. కొడుకు, తమ్ముడు, అన్నిటికంటె కాబోయే అల్లుడు అనే ఇద్దరూ భావించుకుని కులికేరు. మరి ఇప్పుడో?

రామూ ఇల్లాంటి పనులు చేస్తాడా? భావిలో తనను పరిత్యజించి చిచ్చుపెడతాడా? ఎటూ నిర్ణయించుకోలేక చాలాసేపు బాధపడ్డాడు. సీతారామయ్య. అటు వెంకటలక్ష్మమ్మకూడా అన్నం తినలేకపోయింది. రామూ ఇంకకొద్దిరోజులకువస్తాడనగానే సెకండుఫారం చదువుతున్న అక్కగారి కూతురు నరసమ్మను తీసుకువచ్చి ఇంట్లో వుంచుకుంది. తనకున్న నగలు అన్నీ వేసి రామూసపర్యలకు నియోగించింది. రామూ ఆ ఎదిగిన అమ్మాయిచేత సపర్యలూ, చాకిరీ చేయించుకోడానికి సిగ్గుపడ్డాడు. వెంకటలక్ష్మమ్మ ఆ ఊహించుకున్న అల్లుడిలో కృతఘ్నత రాదన్న వూహాలోనే పడి, ఇద్దరికీ ఒక్కసారే అన్నంపెట్టడం, 'అంత సిగ్గుపడతావేమే' అని పరిహాసకం ఆడడంతోటి మురిసింది. వాళ్లిద్దర్నీ మొగుడూ పెళ్లాంక్రిందే భావించుకుంది. సంతోషించింది. సంతతిలేని హృదయం పీయూషభాండం పొందినట్లే సుఖించింది. ఎన్నోసార్లు అనుకుంది: రామూకు ఆపిల్ల నచ్చిందా అని అడుగుదామని. కాని ధైర్యం చాలకపోయింది. ఆ మొదటి రోజుల్లో సీతారామయ్యను చెప్పమంది. సీతారామయ్యకూడ రామూ అప్పుడే తన అల్లుడైపోయినట్లు వూహల్లో సంతోషపడి "మాడవే, ఉన్న రెండురోజులున్నూ. ఇద్దరికీ ఏమైనా మనస్సు కలిసిందేమో!" అని అనేసేడు.

సత్యపద్ధతులు తెలియని వెంకటలక్ష్మమ్మకు కులంలోంచి వెలేసినట్లే అయింది ఆమాటలు. రామూ ఇక వెళ్లిపోతాడంటే నిజంగా వెంకటలక్ష్మమ్మకు నిలుచున్న పళంగా కప్పెట్టినట్టయింది. అయినా, ఈమాటు ధైర్యంతో, గుర్రపుబండిలో సామాను పెట్టుకుని వెళ్తానని చెప్పడానికి వచ్చిన రామూతో, 'అంది. రామూ చిరునవ్వు నవ్వి వూరుకున్నాడు. అంతే. అటు దంపతులిద్దరికీ ఆ నవ్వు విషలిప్తమో, పీయూష సిక్తమో తెలియదు.

కాకినాడ రామారావుపేటలో కక్కాయీ, రామూ కాపురం పెట్టినతర్వాత సీతారామయ్య పెళ్లిసంబంధం విషయంలో మాట్లాడిరావలసిందని తోడల్లుణ్ణి పంపేడు. కూడా పెద్దమనిషి, అనుభవం కలవాడు అని సిద్ధాంతి సుబ్బరామయ్యనుకూడా జత పరిచేడు. కట్నాలూ లాంఛనాల విషయంలో నిష్పక్షపాతంగానే వుండమన్నాడు. తను అప్పో సొప్పో చేసి మూడువేలకట్నం, ఎవరూలేకపోయినా వెయ్యి రూపాయలు లాంఛనాలూ జరిపిస్తానని చెప్పమన్నాడు. "'రాజా' లా వున్నాయి కట్నకానుకలు. ఎందుకు ఒప్పుకోరేమిటి" అన్నాడు సిద్ధాంతి.

రామూ అక్కడనుంచి తిరిగివచ్చిన తర్వాత కక్కాయి రామూనుజరిగినదాన్ని గురించి చాలాసార్లు- కనీసం రోజుకు ఒక్కసారైనా అడిగేది. "చూచేవురా. వెధవ్వా. నీకు లోకం ఏంతెలుసు...ఆ ఇద్దరూ కలిసి ఎంతఎత్తు ఎత్తేరో! నీకు ఆముండను ముడెట్టి తమ చేతుల్లో కీలుబొమ్మక్రింద చేసుకుందా మనుకుంటున్నారా? కానీ...వీళ్ల గడ్డి వీళ్లకు తినపించకపోతే నాపేరు కనకమ్మకా" దంది. రామూ కీచులాడుకున్నట్లే అయ్యేడు. కాని పైకి ఏం మాట్లాడలేదు.

పెళ్లిమాటలకు వారు రావడంతోటే కక్కాయి వెన్నపూసా, కన్నతల్లిక్రింద ఆప్యాయం, ప్రేమా కూడి

పడేట్లు మాట్లాడింది. సంబంధం కలిస్తేనే చాలంది. కట్నకానుకల విషయం చాలా బావుంది అంది. అన్నిటికీ సరిగ్గానే సమాధానం చెప్పింది. "మాఘానికి నేనూ, అబ్బాయీ మా శీతన్న యింటికి వస్తా"మని కూడా చెప్పింది.

తీరా వాళ్లు గుమ్మందాటేటప్పుడు "శీతన్న ఆ అమ్మాయిని దగ్గరకుతీసుకున్నాడేమో, వాడి మాగాణీ కాస్తా అమ్మాయికి వ్రాస్తే బావుంటుందేమో" అంది. ఒక్కసారి సిద్ధాంతికీ, తోడల్లుడికీ అడుగుపడ లేదు. 'ఏదో' అని నసికినట్టే సిద్ధాంతి సర్దేడు... కక్కాయి ముందరికాళ్ల బంధం రామూకు ఒక్కసారిగా కొంచెం కొంచెం బోధపడింది "పిల్లగడ్డి పీల్లను తినిపించకపోతే నా పేరు కనకమ్మ కాదురా" అన్న ముక్క ఖండఖండాంతరాళాలలోంచి మ్రోగినట్టయింది.

కక్కాయి...ఆవిడకు మొగుడు చిన్నప్పుడే పోయేడు. ఒక్క కూతురుతప్ప ఇంకెవరూ లేకుండా కాలక్షేపంచేసింది. ప్రపంచం అంటే ఓ విషమైన కక్ష బయలుదేరి దాన్ని సాధించాలన్న భావంలో పడి జీవితం గడిపింది...ఇప్పుడు కక్కాయినిజస్వరూపం బోధపడింది.

"ఈ ముసలితొక్క...డెబ్బయ్యేళ్ల వృద్ధు... ఇంకా ఇన్ని జవసత్తువలు, నక్కజిత్తులు వున్నాయి... ఇంకా ఏ పనికీ వెనుదీయదు..." అని రామూ హడలేడు. అయినా తనలో ఈ మధ్య ఇంజెక్షను తీసుకున్న శీతారామయ్యా వెంకటలక్ష్మమ్మలయెడ విముఖత, కోపం కక్కాయిచేష్టలను సమర్థించింది. పూర్ణంగా కారణాలచేత కాదు. కక్కాయి అంటే భయంచేత. అయినా లేతగా ఉండిపోయిన అన్నగారి మీది కృతజ్ఞత చచ్చిపోలేదని కాస్త తలెత్తింది.

పోనీ, నరసమ్మను పెళ్లిచేసుకోకుండా వుంటే ...ఆ విధంగా అయినా అన్నగారింట్లో తిన్న ఉప్పు పులుసుకు కృతజ్ఞత చూపించవచ్చునేమో అనుకున్నాడు కాని నరసమ్మను చూచినప్పటినుండి ఏదోవిధంగా మనస్సు అటు లాగుతూనేవుంది.

ఆ రోజు అడిగేసింది: "పిల్ల ఎట్లా వుంటుందిరా ?" అని. "బాగానే వుంటుంది" అన్నాడు.

"కన్నేసేవే"! అని ముసలినవ్వునవ్వింది.

కక్కాయిగుండెల్లో ఎంత విషం వుందో అప్పుడు బోధపడింది రామూకు. వచ్చినప్పటినుంచీ భౌతికంగానూ, మానసికంగానూ, ఆఖరుకు శారీరకంగాకూడా ఆ విడకుదాసుడై పోతున్నాడు. ఆ విడ ఎదురుచూపుల్ని చూడలేకపోతున్నాడు. ఆ విడలో ఏ మహత్తరశక్తి ఉందా అని ఆశ్చర్యపడ్డాడు.

శని ఆదివారాల్లో శీతన్న ఇంటికి వెళ్లి ఇద్దరూ పిల్లని చూచుకొనివచ్చేరు..."ఇంగ్లీషు చదివించేరా ? ఎందుకూ ? ఏమైనా పంతులమ్మపనికా ?" అనే వరసలో కట్టె విరిచినట్టు మాట్లాడింది.

వెళ్లేముందర అతిప్రేమతోనే చీరా, రవికల గుడ్డా చేతిలోపెట్టి "ఏదో ముసలిదాన్ని. బ్రతికి వున్నా. అప్పుడప్పుడు వస్తూవుండండి" అని వెంకటలక్ష్మమ్మతో చెప్పింది.

శీతారామయ్యకూ, రామూకూ కూడా ఆ విణ్ణి అర్థంచేసుకోడానికి ఇంకోజన్మ ఎత్తాలేమో అనిపించింది. "తాంబూలాలు పుచ్చుకోడానికి వచ్చినప్పుడే కట్నం ఇచ్చెయ్యాలి. పెళ్లి అయిదు రోజులూ చెయ్యాలి. మా వాణ్ణి ఎవర్నో పీటలమీద కూర్చోబెడతా. వాడికి పెద్దాపురం శిల్కుధోవతులు, బెంగుళూరు పట్టుచీరా పెట్టాలి. మాకు నేతితోనే అన్నీ పదార్థాలూ చేయించాలి. అప్పగింతబట్టలు వచ్చిన వాళ్లందరికీ పెట్టాలి..." ఇల్లాంటి కోర్కెలన్నీ కోరేసింది.

తననుపీఠిలోపెట్టి అమ్ముతోందా, లేక పెళ్లి చేస్తోందా అన్నట్టు రామూకు అనిపించింది.

అన్ని షరతుల్లోనూ మధ్యవర్తులమధ్య బాండు వ్రాయించి మాటువేలు పుచ్చుకుంది. అటు శీతారామయ్య తమ్ముడే అన్న భావంలో ఏ మడిగితే అది ఇచ్చివెయ్యడానికి సిద్ధపడిపోయేడు. ఆఖరుకు తనకేమీ మిగలకపోయినా రెక్కలమీదనైనా జీవించగల నన్న ధీమాతో.

పెళ్లిలో కక్కాయి ఒంటికాలుమీద లేచింది. చుట్టాలు అయినా అవకపోయినా రెండువందలమందిని తీసుకొచ్చింది. అప్పగింతల దగ్గర కనీసం పాతికమందికైనా బట్టలుపెట్టి అప్పగించాలంది. శీతారామయ్య

ఇంచుమించు నరసమ్మకు ఈడుగడే అవడంవల్ల అన్నిటికీ తలొగ్గేదు. ఇచ్చిన చాపులు మాలాళ్లూ మాదిగాళ్లూ కట్టుకున్నట్టు ఉన్నాయని వాటిని చింపించి, గాడిపొయ్యిలో వేయించింది.

ఇలాగే ఇంకా ఎన్నో చేసింది. ఆఖరుకు "పెళ్లి అవుతుందా అవదా? అసలు అవనిస్తుందా? కక్ష సాధించుకోడానికేమైనా వచ్చిందా కనకమ్మ?" అన్న బితుకు అందరి హృదయాల్లోనూ పడింది

శీతారామయ్య పెళ్లివారి కందరికీ పెద్ద అని ఓ శిల్కు ఆడకట్టుపంచెలజత కక్కాయికి ఇచ్చేడు. "ఏం నాయనా, నన్ను దబ్బున చచ్చిపొమ్మనా? లేక మళ్లీ సధవను చేస్తావా? నా శవంమీద కప్పమనడానికేనా ఈ జత?" అంది.

శీతారామయ్య నిలువునా కూలిపోయేడు. తోడల్లుడికి ఆ మాటలు అరికాలిమంట లెక్కించాయి. శీతారామయ్యను చూచి వూరుకున్నాడుకాని లేకపోతే కపాలమోక్షం చేయించేద్దామన్నంత ఆవేశం కలిగింది. అటు రామూకుకూడా జరిగింది విని "ఈ మహామ్మారిని పీకనులిమేస్తే ఒదిలిపోతుంది" అన్నంత కోపం వచ్చిందికాని...తను ఇప్పుడు ఇల్లుపట్టిన వెధవ పెంచడంవల్ల శరీరంలో రక్తం అంతా నీరయిపోయింది.

తక్కినవన్నీ ఏదో అలా అలా జరిగిపోయాయి. వెంకటలక్ష్మమ్మకు "ఇదేమిట్రా, కొరివితో తలగోక్కున్నట్టయిందే" అనిపించింది. నరసమ్మ ఏమయిపోతుందో అని అన్నమే తినలేదు సరిగ్గా. ఓ ప్రక్క ఓ కంట సంతోషం, రెండో ప్రక్క కన్నీళ్లు—వీట్ల మధ్య నలిగిపోయింది.

శీతారామయ్యకు పెళ్లి ఐదువేలు పెట్టి చేసేనే అన్న మాటమాత్రమేకాని ఏమిటో సంతోషమూ, ఉల్లాసమూ కలిగిన పుణ్యానికి ఆయన నోచుకోనే లేదు. బెంగ, ముందేమవుతుందో అన్న ఆదుర్దా, ఇంకా కక్కాయి నరసమ్మను ఏడిపిస్తుందా అన్న ఆందోళన-వీటితోటి నిజంగా బెంగెపెట్టుకున్నాడు. తీరా తనూ, వెంకటలక్ష్మి కలిసి తోడల్లుడిమెడ విరిచి ఈ సంబంధానికి ఒప్పందం చేసేరు. అల్లాంటప్పుడు తన తలమీద బరువు ఎక్కువే అయింది. దీన్ని -ఈ బరువును జీవితాంతంవరకూ నొప్పిలేకుండా మొయ్యగలనా? లేక అదే భారమై, ఎదురతిరిగి, తన్నే తినేస్తుందా? ఈ బాధ ఒకటి ఎక్కువైపోయింది. అది నుంచున్నా, కూర్చున్నా కొల్చుకుతినేస్తూనేవుంది. అల్లాగే నడపీనుగులా భరించేడు. ఎప్పుడు చెప్పకుండా గుండెపగిలిపోతుందో అన్నంత భీతిలోనే రోజులు లెక్కపెట్టుకున్నాడు.

ఏదో తర్వాత జరగవలసిన లాంఛనాలన్నీ సక్రమంగానే జరిగేయి. ఏ పెనుగాలీ లేకపోవడంతో 'పెళ్లివారనిపించుకోవద్దా అనే కక్కాయి ఆ పని చేసింది', అన్నవతులో పడి తృప్తిపడ్డాయి ఆరాటంతో, ఝుంఝూటాల్తో అల్లాడిపోయిన ఆత్మలు.

ఇంక అంతా అణిగిపోయింది అనుకునేటప్పటికే పెనుభూతంలా కక్కాయి అన్న మాటలు శీతారామయ్య చెవిని పడినవి. దాంతో హడలేపోయేడు. మనుగుడుపులు అయి తిరిగివెళ్లిన తర్వాత రామూకు, కాస్త నలగడంవల్ల, జ్వరం తగిలింది. దీన్ని ఆసరా చేసుకుని "మా వాడికి మందుపెట్టేసింది వెంకటలక్ష్మమ్మ...ఇంకేముందిరో నాయనా! పిచ్చాడో, వెర్రాడో అయి చచ్చిపోతాడు ... శీతారామయ్య పెట్టించాడురోయి!." అని వూరంతా ఏకేసింది. రెండురోజుల్లో జ్వరం తగ్గినా అందరూ ఆమాటే నమ్మేరు. భూతవైద్యం చేయించింది. కనపడినవాడు చెప్పిన వైద్యమల్లా చేయించింది. రక్షరేకు, విభూతి పెట్టించింది. తన్ను పిచ్చివాణ్ణిక్రింద చేసి కక్కాయి ఏడ్పిస్తోందా? లేక కక్కాయికే మతిపోయిందా? ఎల్లాగైనా పెళ్లి అయినప్పటినుంచీ కక్కాయి విధానమంతా చాలా మారింది. అస్తమానూ శీతారామయ్యను ఎల్లా కొల్చుకుతిందామా అన్న తలంపే...రామూకే తలనొప్పి పుట్టిస్తోంది.

ఆ వసంతఋతువులో నరసమ్మ వృద్ధమనిషి అయింది. నిషేధం తీర్చుకుంటే మంచిదని సిద్ధాంతిచేత కబురుపెట్టించేడు శీతన్న. బాగానే వుందంటూ తలూపి, "ముందు శీతన్న భూమిఅంతా అబ్బాయిపేర వ్రాస్తానన్నాడు. అది వ్రాస్తేనేకాని కార్యంమాట తలపెట్టుకో దలచలేదు" అని తేల్చేసింది కక్కాయి.

రామూకు కక్కాయి ఎత్తుగడలు నెమ్మదిగా అర్థం అయ్యేయి. శీతారామయ్యను శాంతంగా ఒక్క ఘడియ నుంచోనియ్యడానికి ఇష్టంలేదు. ఏదో

పూర్వఘుటియల్లో ఉన్నదో, లేనిదో పగకల్పించి, ఇప్పుడు అదను దొరికింది కదా అని వేధిస్తోంది. తన ఆటలు సాగుతాయికదా అని నిజంగా నటరాజనృత్యం చెయ్యడానికి ప్రారంభించింది.

నరసమ్మతో పెళ్లికిపూర్వమే ఒకటి రెండు సార్లు మాట్లాడేడు రామూ! ఆ మాటల్లోని అమాయకత్వానికి నిజంగా ముగ్ధుడే అయ్యేడు. తన జీవితం సుఖపడుతుందికదా అని సంతోషపడ్డాడు. కాని అవన్నీ కక్కాయిచేష్టలవల్ల నీటిమీదివ్రాతల్లా కన్పిస్తున్నాయి. నరసమ్మయెడ తన హృదయంలో కల్గిన వాత్సల్యానికి దోహదం జరగదు; తను నరసమ్మతో కాపురంచేసి సుఖపడ్డం ఈ జన్మలో లేదు నియ్యాదు.

శీతన్నమీద రామూకు ంపొందుతున్న ఓవిధమైన ద్వేషభావం క్రమంగా ఎక్కువే అవుతోంది. వెంకటలక్ష్మమ్మయెడకూడా ఆ భావం సమానంగానే పంచుకుంది. ఇక మిగిలిందల్లా నరసమ్మయెడమాత్రం ప్రేమ పోలేదు. మరి వాళ్లల్లో పెరుగుతోందే?... కక్కాయియెడ గురి ఎక్కువైపోతోంది. తను తెలియకుండానే ఆకర్షింపబడిపోతున్నాడు ... ఎల్లాగైనా శీతారామయ్యను శాంతంగా వుండనీకూడదు ... తన తల్లిని, తండ్రిని, దొరికితే తన్ను చంపిన, చంపదలచుకున్న శీతారామయ్యకుట్రకు తగిన ప్రతీకారం చెయ్యాలి. ఎట్లా? కాలం ఇంకేవిధంగా మారుతుంది? నరసమ్మను ఈ జూదంలో ఒడ్డి వాళ్లను జయించాలా? మరి తనో? నరరూపరాక్షసి అవటం లేదూ? కక్కాయి తన మంచికోసం పెడదార్లు తొక్కుస్తుందా? దరిదాపు సంవత్సరంనుంచి అర్థం చేసుకుంటున్నాడే?

ఎల్లాగైనా కక్కాయీ తనూ ఒకటి......నరసమ్మ...జీవితంలో ఒస్తారు పోతారు. తన కర్తవ్యం తను నెరవేర్చుకుంటే తన [illegible], తండ్రీ ఆలోకంలో నుంచేనా తృప్తిపడి రహస్యంగా దీవిస్తారన్న ఆశ. చచ్చిపోయిన [illegible], తండ్రీ జ్ఞాపకంవచ్చేరు. వాళ్లు నిరంతర శోకంతో దగ్ధం అయిపోతూ ప్రతీకారం, పగ అని అలమటించిపోతున్నట్టే తట్టింది రామూకు.

ఎల్లాగైనా శీతారామయ్యకు గుణపాఠం చెప్పాలి; తన ఆస్తి కాజేయదలచుకున్న ఆ నీచుడికి ఎదటివాళ్లు శక్తివంతులే అని తెలియజెయ్యాలి అన్న వృఢనిశ్చయం యెక్కువైపోయింది.

కక్కాయి రామూ తనతో పూర్ణంగా ఏకీభవించడంతో, అగ్నికి ఆజ్యం పోసినట్లే అయినే, తృప్తిపడిపోయింది. శీతారామయ్య మర్యాదాగానే ఉత్తరం వ్రాసిపంపేడు—తను తన భార్యాబదనంతరం ఆస్తి రామూ పేర వ్రాసిస్తానని, దానికి తనకేమీ అభ్యంతరం లేదనిన్నీ.

"పనికిరాదు. ప్పుడే వ్రాసి యివ్వాలి. అబ్బాయిపేరే. అమ్మా[illegible] కాదు. అమ్మాయి పేరేమిటి, మనోవర్తికి రాసిచ్చినట్టుగా" అని వాదించింది.

శీతారామయ్యకు ఎటూ తోచలేదు. అప్పుడే ఎల్లా వ్రాసిసాడు తనకున్న [illegible]. తనకే రేపు పిల్లలుకలిగితే వాళ్లకు జోలిచ్చి బతికమంటూడా! తనో? ఈచిన్న జీతంతో ఎల్లా సరిపెట్టుకోగలడు? పైగా మొన్న పెళ్లికి అయిన అప్పు?

కొంతకాలం ఆగితే రామూలో ఏమైనా పరివర్తనం ఒస్తుందేమో అని అనుకున్నాడు. తమ్ముడు అని స్వతంత్రం లేకుండా అల్లుడు అన్న భయంతోనే సంగతులు విపులంగా వ్రాసేడు. కక్కాయి ఉగ్గుపాలూ వంటబట్టడంమూలాన రామూ ససేమిరా అన్నాడు.

ఓసారి తనే వెళ్లి మాట్లాడివస్తే ఏమైనా దారికొస్తారేమో అని వెళ్లేడు. "దస్తావేజు వ్రాసి పట్టుకు రాకుండా ఏమొఖం పెట్టుకుని గడప త్రొక్కడానికి వచ్చేవు? వెళ్లు వెళ్లు" అని నిక్కచ్చిగా చెప్పేసింది. ' ఆఖరికి కూర్చోమనేనా అనలేదు. పోనీ, తమ్ముడు ఏమైనా పంథామారుతాడేమో, చదువుకున్నవాడు అని కదిపిచూచేడు. కాని కొరగాని కొయ్యే అయ్యేడు. దాంతో నడుం విరిగిన పామే అయ్యేడు శీతారామయ్య. "పోనీ, కక్కాయి మాట నిలబెట్టకూడదూ?" రామూ అన్న ఈ మాటలు శీతన్నను నిలువునా తినేసేయి. ఏమిటీ కర్తవ్యం? ఏమిటీ చెయ్యడం? ఇంటికి వెళ్ళి వెంకటలక్ష్మమ్మతో ఏమని, ఏనోటెట్టుకుని ఈవార్త చెప్పడం? సుఖపడుతుంది కదా అని నరసమ్మను తమ్ముడికిచ్చి పెళ్ళిచేస్తే

అది ఇల్లా విషమించిందే? రేపు నరసమ్మకు-తనింట్లో తిరిగే నరసమ్మకు మొఖం ఎల్లా చూపడం? తోడల్లుడితో ఎట్లా మాట్లాడుతాడు? వయస్సులో వుండి, భర్తను కలిగీ సుఖం లేక, రాత్రిళ్లు నిద్రరాక అటూ ఇటూ బాధతో బాధపడే నరసమ్మ తనపంచన ఉంటే తను ఎల్లా తిండితింటాడు? ఎల్లా మసులుతాడు? తన చేత్తో తనే నరసమ్మకు ఉరి తగిలించేడే? మరి తనింకా ఎందుకు బతుకుతున్నాడు?తలకు ఎక్కేట్టు తమ్ముడూ, కక్కాయీ కాటువేసే వేసేరు. ఇంకా ఎన్నాళ్లు ఈ నిరంతరహృదయవిదారక దృశ్యాల్లో జీవనం చెయ్యడం? ఇంటికెళ్లి ఏమైందని అడిగితే ఏనోరుతోటి ఈవార్త చెప్పడం? దారిలో చచ్చిపోతే నయం అనిపించింది. రైలుపట్టాలదగ్గరకికూడా వెళ్లేడు. కాని తను చచ్చి ఎవర్ని ఉద్ధరిస్తాడు?

నడప్పీనుగ అయి ఇంటికి వచ్చేడు. తలెత్తుకు కాదు. జీవంతో ఉండే కళ్లతో కాదు. వంచుకుని, కన్నీరు కార్చి కార్చి ఉబ్బిపోయిన కనుపాట్లలతో. హృదయం వ్రక్కలై పోతుందా? కడుపు మాడిపోతుందా? భూదేవి ఈదుఃఖం భరించలేక విచ్చిపోతుందా? ప్రళయం ఈపళంగా వచ్చి చుట్టు ముట్టేస్తుందా? అన్న భారంతో వచ్చేడు. కాళ్లు కడుక్కోనీయకుండానే వెంకటలక్ష్మమ్మ అడిగింది. పెదిమవిరిచి గుడ్ల నీరు కుక్కుకున్నాడు. ఆఖరుకు తండ్రిపోయిన రాత్రికూడా అంత దుఃఖించలేదు.

నరసమ్మను కావలించుకుని వెంకటలక్ష్మమ్మ భోరున ఏడ్చింది. "చేతులారా నీకాపురంలో నిప్పులు పోశేమే! మాయదారి సంబంధం కుదిర్చేమే! పాలు అని పోస్తే విషం అయిందే...ఇంకోచోట పడితే నాలుక్కాలాల పాటు సుఖంగా వుందువేమో!"

నరసమ్మ పెళ్లికాకమునుపు తన భర్తను అర్థం చేసుకుందుకు ప్రయత్నించింది. స్వతహాగా భర్త ఇంత దారుణంగా తయారవుతాడా అన్న సంశయం పీకింది. పెళ్లిఅయిన తర్వాత ఒక్క ఘంటసేపైనా ఎప్పుడూ మాట్లాడలేదు. తను ఓసారి భర్తదగ్గరికి వెళితే మార్చగలనన్న వెర్రిధైర్యం వుంది.

ఆ రాత్రి భార్యాభర్తలు ఇద్దరూ భోజనం చెయ్యలేకపోయేరు. ఒకర్ని చూస్తూ ఒకరు లోపల్లోపలే దుఃఖించేరు. నిశాతఘాతాలు ఇంకా ఏమి భరించవలసివస్తుందో అని క్రుంగిపోయేరు.

ఈ వార్త తోడల్లుడి చెవులో ఎల్లాపడిందో కాని, మరి రెండురోజులకు భార్యాభర్తలిద్దరూ వచ్చేరు. శీతారామయ్యా వెంకటలక్ష్మమ్మల ప్రాణాలు పైకి పోనేపోయేయి. ఆకులా అల్లాడిపోయేరు. కూతుర్ని భర్త బ్రతికుండగానే విధవను చేసేరని ఇద్దరూకూడా విరుచుకుపడినారు. నరసమ్మ తల్లితో చెప్పింది—"తొందరపడకండమ్మ! అన్నీ చక్కపడతా"యని. కాని కుర్రకుంకమాటలు ఎవరు చెవినిపెడతారు? ఒక్క కసురు కసిరిపారేసేరు. ప్రపంచకంలో పెట్టవలసిన చివాట్లు, తిట్లు అన్నీ ఆ రాత్రి ఆ భార్యాభర్తలకు ప్రసాదించేరు.

"పిల్లలులేని గొడ్రాలివి...నీకేం తెలుస్తుంది తల్లికడుపుశోకం" అంది అప్పగారు.

భార్యాభర్త లిరువురూ అల్లాగే భరించేరు.

పెద్దలెవరో కలుగజేసుకుని "పోనీ, మీరాకు అమ్మాయిని ఓసారి అక్కడకు తీసుకువెళ్లితే, ఏమైనా సరిపడే సన్నివేశాలు వస్తాయేమో? అబ్బాయి మారినా మారవచ్చు" అన్నారు.

తలతిక్క కాస్త తిప్పుకుని ముగ్గురూ బయల్దేరేరు కాకినాడకు. కాస్త ఎక్కడైనా దూరంగా వెల్తురు కన్పిస్తుందేమో అని శీతారామయ్యా వెంకటలక్ష్మమ్మలు క్షణికంగా తేలికపడ్డారు.

ఇంటికి వచ్చేవరకు కక్కాయి మాట్లాడలేదు...తీరా వచ్చినపని చెప్పేటప్పటికి "శీతన్న చచ్చేడా ఏం? మధ్యవర్తిత్వానికి నువ్వు వచ్చేవు...ఒక్కటే మాట. ఆస్తి వ్రాసిఇస్తేనే ఇచ్చేడు ఈ శ్రావణమాసం లోపుగా. లేకపోతే మా వాడికి రెండోపెళ్లి చేస్తా. అప్పుడే సంబంధాలు వేలకువేలు గుమ్మరిస్తామని వస్తున్నాయి." నిక్కచ్చిగా చెప్పేసింది కనకమ్మ.

'రెండోపెళ్లి!' భార్యాభర్తలు నిలువునా నీరైపోయేరు. ఇంకేమిటి మాట్లాడ్డం? కోపం కాస్త మ్రింగుకుని సాయంత్రం రాముతో మాట్లాడేరు. నరసమ్మకూడా అడిగింది. కాని కనకమ్మకు తందాన తాన అనే స్థితిలో రామూకూడా మాట్లాడేసరికి నడుం విరిగిన పాములే అయ్యేరు. ఆఖరున వెళ్లేటప్పుడు-

"నువ్వూ, కనకమ్మ మానవులమీద పడి రక్తం త్రాగే పిశాచాలు" అన్నాడు వియ్యంకుడు ఆగ్రహం

పట్టితే "అవును నిజమే! శీతన్న చేసిన దారుణాలు, మీవాడు కనుక, ఏమీకనిపించవు. మమ్మల్ని జయిలులో పెట్టించడానికికూడా వాడు ఎత్తువేసేడు." అంది కనకమ్మ. దిగమింగుకునే శీతన్న ఇంటికి వచ్చి రెండింతల శక్తితో అక్షింతలు జల్లేసేరు.

నరసమ్మ తను అక్కడే వుండిపోతా నంది. "నీ కర్మ-ఇంకా వాళ్లనే పట్టుకు దేవుళ్లాడుతా నంటావేమిటే" అని తల్లీ, తండ్రీ కోప్పడ్డారు. నరసమ్మ మంకుతనం పట్టి అక్కడే వుండిపోయింది.

శీతారామయ్యకు రోజులు గడుస్తున్నా యన్న పేరేకాని, ఎదురుగా నరసమ్మను చూస్తుంటే గుండెలు తరుక్కుపోతున్నాయి. నిల్చున్నపళంగా ఆ అమ్మాయి రక్తం తను త్రాగేస్తున్నానే అని రోజూ ఏడ్చేవాడు.

రెండునెలలు గడిచేయి. వెంకటలక్ష్మమ్మ దిగులూ, ఏడ్పులతో కృశించిపోయింది. శీతన్న అసలు అన్నమే తినలేకపోయేవాడు. వాళ్లిద్దరూ తనమూలంగా ఇల్లాంటిస్థితికి రావలసివచ్చింది కదా అని నరసమ్మ చాలాసార్లు మథనపడింది. ఏదైనా మార్గం ఉందా అని ఎంత ఆలోచించినా ఎటూ తట్టలేదు. ఇక మిగిలిపోయిన జీవనంలో వాళ్లసేవ చేస్తే తనకు వాళ్లు చెయ్యగల్గిన సుఖం దుఃఖంక్రింద పరిణమించినా, తన తీర్చలేని కృతజ్ఞత ఉండిపోతుందనే తలంపుతోనే రోజులు గడిపింది.

ఆ మార్చి నెలలో రైతులు శీతారామయ్యకు శిస్తులు తీసుకొచ్చేరు. వచ్చినదాంట్లో మూడొందలు పెట్టి నరసమ్మకు గొలుసు చేయించేడు. తక్కినడబ్బు తను పెళ్లికి భార్యమెడలోనుంచి తీసి బ్యాంకులో తాకట్టుపెట్టిన కాసులపేరుకు జమకట్టేడు. ఇంకా ఐదువందలు ఉండిపోయింది.

పోనీలే, నరసమ్మను ఓ కొడుకుక్రింద చూచుకొందామని ఎంత గుండెనిబ్బరం చేసుకుని మెసలుదామన్నా, సీతారామయ్యా, వెంకటలక్ష్మమ్మలకు ధైర్యం చాలలేకపోతోంది. ఎదురుగా తిరిగే నరసమ్మ, ఆ వయస్సులో మొగుడితో కులుకుతూ ఉండాల్సిందే...తమ దురదృష్టంవల్ల ఇల్లా జరిగిందే... ఎంత కొడుకుక్రింద చూచుకున్నా నరసమ్మ హృదయంలో పడే బాధ తీర్చగలరా? ఇది మనోవ్యథే అయింది ఇద్దరికీ.

రోజూ ఆఫీసుకు వెళ్తూనేవున్నాడు. ఏదో పని చేస్తున్నాడన్న పేరేకాని, మనస్సు ఆలోచనల్తో పరిపరివిధాల పోతూవుంది. ఉత్సాహం ఎప్పుడో చచ్చిపోయింది. అందరూ అడిగేరు "ఏం శీతారామయ్యా, అల్లా వున్నా"వని. దాంతో సరిపెట్టక "ఎంత కష్టం ఒచ్చిందోయి...వాళ్లు ఎక్కడో కర్కోటకముండావాళ్లులా ఉన్నారు" అని పరామర్శ! ఎద్దుపుండు కాకికేమి నొప్పి! ఒరసిన కురుపుమీద ఉప్పూ కారం చల్లినట్టు వుండేది. సమాధానం చెప్పలేక నిట్టూర్పువిడిచి ఊరుకునేవాడు. కాని లోపల్లోపల సంక్షోభం భరించలేక హృదయం వ్రక్కలైపోతుందేమో అని ఆశించేవాడు. అల్లాగైనా శాంతి దొరుకుతుందేమో అని ఆశ.

పోనీ, తనవాళ్లు నెడితే అల్లా అంటున్నారేమో అని కాలేజీలెక్చరర్లచేత రెండు మూడు విధాలుగా చెప్పించేడు రాముకు. కాని "కక్కాయిమాటకు నేనేమీ వ్యతిరిక్తంగా నడవను" అనేశాడు రాము. కాని అక్కడక్కడా "శీతారామయ్య ఇంకా కాళ్లబేరానికి రాడూ?...సరేలే..." అని ఏదో ప్రతీకారం చెయ్యదలచినవాడిలా మీసాలు వడేసేడుట. ఈ సంగతి విన్నప్పటినుండీ శీతారామయ్యకు మతేపోయింది.

ఇంతలోనే కాకినాడనుంచి ఓ స్నేహితుడు వచ్చి "ఏమిరా అబ్బీ, మీ తమ్ముడూ, ఆ కనకమ్మా కలిసి పెళ్లిసంబంధాలు చూస్తున్నారే! అయితే ఇంతకూ మీ ఇద్దరికీ బెడిసికొట్టినట్టేనా?" అన్నాడు.

పిడుగుపడ్డట్టే అయింది. ఇంక తనకేం పిల్లలు కల్గుతారూ? పోనీ, ఆస్తి వ్రాసిస్తే ఏం? దీన్నిగురించి చాలా మథనపడ్డాడు. కాని ఇంతవరకూ వచ్చిన విషయం...ఇప్పుడు తను వ్రాసేస్తే, తనకు నిలవడానికి నీడలేకుండా చేసి, చిప్పా కర్రా చేతికిచ్చి, విషపు నవ్వు నవ్వుదామనేకాదూ? తీరా వ్రాసిచ్చినా— అందులోనూ నరసమ్మ పేర వ్రాసి ఇవ్వకూడదట— నరసమ్మ సుఖపడుతుందనీ, వాళ్లు సుఖపెడతారనీ తనకు ఏం నమ్మకం?

ఆ రాత్రి వెంకటలక్ష్మమ్మతో ఆలోచించేడు. "మీ ఇష్టం వచ్చినట్లు చెయ్యండి" అంది.

"నేను ఆస్తి ఎల్లాగైనా వ్రాయడానికి ఇష్టమే. అది మనిద్దరి అనంతరం సంక్రమించేట్లు వ్రాస్తానన్నా. అల్లా పనికిరాదట. ఇప్పుడు మనం వ్రాసేమా, మన పీకలను ఉరిత్రాళ్లు వాళ్లచేతుల్లో పెట్టినట్టే." అన్నాడు. అందులో ఉన్న లాపాయింటు వెంకటలక్ష్మమ్మకు సమంజసంగానే కన్పించింది.

నరసమ్మ ఇవన్నీ వింది. డబ్బుకూ, మానవ హృదయాలకూ ముడెడితే ఆ మొగుడితో తనేం సుఖపడగలదు? తన జీవితం ఏమిసాక్షిగా నడుస్తుంది? ...మనస్సు భర్తయెడల విరిగిపోయింది.

"పోనీ, చదువుకుంటానులే నాన్నా" అని అనలేక అనలేక అంది నరసమ్మ. ఆ రోజల్లా శీతారామయ్యకుండె చెరువే అయిపోయింది.

ఏదో బ్రతకడానికి తింటున్నాడంటే తింటున్నాడన్నట్టు రోజులు వెళ్లబుచ్చేడు. అలా కడుపు కాల్చుకోవడంవల్ల దగ్గూ, కొద్దిజ్వరం రావడం ప్రారంభించింది. ఇది చూచి వెంకటలక్ష్మమ్మ హడలిపోయింది. భర్తభావిస్థితి ఈ మనోవ్యథతో ఏమైపోతుందో అని ఆవిడా నీరసించిపోయింది.

ఆ రోజు మామూలుగానే ఆఫీసుకు వెళ్లేడు. కొంతసేపు పనిచేసేడు. తర్వాత పెద్ద దగ్గుతెర వచ్చి రక్తంకూడా ఉమ్మేసేడు. అంతే! స్పృహలేని శీతారామయ్యను ఇంటికి బండిమీద తీసుకొచ్చేరు. తనకు ఈ భూమిమీద పసుపూ కుంకుమా అప్పుడే చెల్లినట్టు వెంకటలక్ష్మమ్మ గోలెట్టింది.

డాక్టర్లు 'క్షయ' అన్నారు. ఇక శీతారామయ్య మనవాడు కాడనే వెంకటలక్ష్మమ్మా, నరసమ్మకూడా అనుకొన్నారు. డాక్టర్లు రాజమండ్రీ శానిటోరియంకు తీసుకెళ్లమన్నారు.

వెంకటలక్ష్మీ, నరసమ్మలు చాకిరీతో సగం, బెంగతో సగం, ఇక భావిలో ఉన్న భీతాంగాలతో సగం కృశించిపోయేరు.

కనీసం వారానికి ఒక్కసారైనా శీతారామయ్య రాముకు ఉత్తరాలు వ్రాయించేడు. తను అంత్యదశలో ఉన్నాననీ, ఒక్కసారి చూడ్డానికి రావలసిందనీ.

కక్కాయి అంది 'అంతా నాటకం' అని. రాము విన్నాడు శీతన్న రాజమండ్రీ శానిటోరియంలో మందు తీసుకుంటున్నాడనీ, 'క్షయ'తో చాలా చిక్కిపోయేడనీ, ఇక బ్రతుకుతాడో బ్రతకడో అనీ. రెండు మూడు వారాలుగా వచ్చిన ఉత్తరాలు చూచేడు. అంతా తనను—ఆఖరుకు నరసమ్మను పరిత్యజించినా—కడసారి చూపుక్రింద ఒక్కసారి కనపించమని. "దేహీ అని అడుగుతున్నాను—అన్నయ్యా... కాదు, నీ క్రింద ఓ బానిస..." అనికూడా వ్రాసేడు. రాము ఆలోచనలో పడ్డాడు. కక్కాయిచేతుల్లో పడి తాను వెధవ అయి, మూగుడిలా, అక్షరం ముక్కజ్ఞానం లేనివాడిలా ప్రవర్తించిన సన్నివేశాలన్నీ ఎదురుగ్గా నుంచున్నాయి! "నువ్వు నీ కర్తవ్యం ఈ విధంగానా నెరవేర్చుకొనేది? ఇదా, ఆరేళ్లపాటు సుఖంలో, కష్టంలో నీతో పాల్గొంటూ, ఆఖరుకు నీకు జబ్బుచేస్తే అన్నంతినే దోసిలితో నీ మలమూత్రాలు ఎత్తిన అన్నకూ, వదినకూ చెయ్యవలసిన మర్యాద? ఇదా కృతజ్ఞత? నీకేమైనా లోటు చేసేడా? అక్కడ ఉన్న సంవత్సరాలు రాజాలా గడిపేవే"

మరి కక్కాయి చెప్పిందో? ఏదో! ఏమిటో? తను గుడ్డు తెరవనప్పుడు జరిగిందట! ఎల్లా నమ్మడం? ఇంకెవరూ చెప్పలేదే?

ఇక నరసమ్మ...తను మంగళసూత్రం కట్టి, ఆజన్మాంతం నిన్ను వదలనని సప్తపథం తొక్కి అగ్నిసాక్షిగా ప్రామాణికం చేసేడే? మరి తను అనుసరిస్తున్న మార్గం? తనంటే ఇంకేమైనా గౌరవం ఉంటుందా? తన్ను ఓ మనిషిక్రింద నరసమ్మ లెక్క వేస్తుందా? కక్కాయిమూలంగా తను నరసమ్మను హృదయంలోనుంచి తరిమివెయ్యడానికి ప్రయత్నిస్తున్నాడు. తను ఆమెభిక్షమీద నిల్చున్నా డన్న మాట. ఆడదానిచేతుల్లో కీలుబొమ్మయి, ఇన్నాళ్లూ తాను వంటింట్లోకూర్చుని అన్నం ఉడకేసే ఆడదాని కంటె కనాకష్టం అయ్యేడన్నమాట.

తనెందుకు బ్రతుకుతున్నాడో తనకే తెలియదు. ఆ సన్నివేశాల్నిగురించి తను ఇంతవరకూ ఆలోచించనందుకు విచారించేడు. తీరా ఆలోచించినా తన అసమర్థత ఎదురుగ్గా నుంచుంటోంది. ఇప్పుడు కిం కర్తవ్యం? ఎల్లాగా తను ఎదుర్కోవడం? చచ్చే అన్నగారికి ఆఖరుఘుంటల్లో అయినా ఆత్మశాంతి ఇవ్వడం ఎలా? తను అన్నదగ్గరికి వెళ్లి - బతికుండగానే మాంసం కోసి, కాల్చుకుతిన్న ఈ శరీరంతో వెళ్లి ఆయనను ఎల్లా చూడ్డం?

ఆ వారం ఇంకొక ఉత్తరం వచ్చింది. అందులో డాక్టరుకూడా వ్రాసేడు. అన్నయ్య వ్రాతలో అప్పుడే వొంకర్లు బయల్దేరేయి. డాక్టరు ఇక పది రోజులుకూడా గడవడం కష్టమే అని సూచించేడు. అన్నయ్య ఉత్తరంలో "నాయనా! నాకు సంతానం లేకపోవడంమూలాన నిన్ను కొడుగ్గానే పెంచుకుందామని నా దగ్గరకు తెచ్చుకున్నానేగాని నువ్వూ, కక్కాయీ అనుకున్నట్టు విషపుహృదయంతోమాత్రం కాదు. తండ్రిహృదయంతో, పుత్రక్షేమ కావాలన్న ఆత్రుతచూచే హృదయంతో తెచ్చుకొన్నాను. నాభార్య మాతృప్రేమతోనే పెంచింది. నీకు మా ఇంటిదగ్గరున్న ఆరేళ్ళల్లోనూ ఏవిధమైన లోటూ రాకుండానే కాలం గడిపించే మనకుంటాను. ఇదంతా జరిగిపోయింది. నేను దిక్కులో కాలుఆశించే నరసమ్మను నీకిచ్చి పెళ్ళి చెయ్యడం. కాని అవన్నీ నిరాశలై అధోగతిలో పడ్డాయి. ఏనాడు ఏపాపం చేసేనో తెలియదు. అది అనుభవిస్తున్నాను. నామూలాన్ని నేను కట్టుకున్న పెళ్లాం, పెంచుకున్న నరసమ్మ—వాళ్ల ఉసురుకూడా కట్టుకున్నాను. ఏది ఎల్లా వున్నా ఈ అంత్యగడియల్లో ఒక్కటే అడుగుతున్నా. నువ్వూ నేనూ ఈప్రపంచంలో నాన్నరక్తాన్ని పంచుకుని బ్రతికివున్నాం. అంతే! మన కింకెవ్వరు లేరు. నాపంచప్రాణాలూ ఏమో నీమీద పెట్టుకున్నాను. ఒక్కటే తుదికోర్కె కోరుతున్నాను. నమ్మతావో నమ్మవో అని డాక్టరుదగ్గరనుంచి చీటీ పంపుతున్నాను. నరసమ్మను ఏలుకున్నా ఏలుకోకపోయినా, కొడుకు అని చూచుకున్న నీవు ఈదుర్మార్గుణ్ణి ఈచచ్చేగడియల్లో క్షమించి చూడ్డానికి రా నాయనా. నీకాళ్లు పట్టుకు అడుగుతున్నాను. క్షమించి రా! తండ్రీ! ఒక్కసారి నీముఖం చూపించు. నరసమ్మ చచ్చిందనే అనుకుంటాను. ఆఖర్ని చచ్చిపోయేటప్పుడు కాస్త శాంతంతో చస్తాను. ఇదే నా తుదికోర్కె. నాయనా, రా. నన్ను కనికరించు. క్షమించు......"

ఉత్తరం సాంతంగా చదివేడు. కక్కాయి అంది: "ఆవ్యాధి నీకూ అంటించి వంశానికి రూపనామాలు లేకుండా చేద్దామనిరా"

'ఏమో!' నమ్మలేకపోయేడు. అంత దీనంగా వ్రాసిన అన్నయ్య ఇంకా విషలిప్తమా? తేనెపూసిన కత్తా?

ఆరాత్రి చాలాసేపు ఆలోచించేడు. ఆరాత్రే బయల్దేరి రాజమండ్రీ వెళ్లేడు. కక్కాయికి తెలియనివ్వకుండానే. శానిటోరియందగ్గరకి వెళ్లేటప్పటికి కాళ్లు వణికేయి. శరీరం చెమటలుపట్టేయి. ఎల్లా ఈ మొఖం చూపించడం అన్నయ్యకు?

తల వంచుకునే లోపలికి వెళ్లేడు. నర్సును అడిగేడు. ఎంతో ఆదరంగా చెప్పింది. ఆఖరుకు అల్లాంటివాళ్ల కాళ్లుముట్టుకోవడానికికూడా తను పనికిరాడేమో అనిపించింది. 'పన్నెండో నెంబరు గది'. జీవితంలో రెండుముళ్లు పన్నెండు కొట్టినట్టే అయింది. దూరంనుంచే అన్నయ్య "నాయన వచ్చేడా?" అన్న హీనస్వరం చెవినిపడింది. ఆక్షణంలో ప్రాణం ఎందుకుపోకూడదా అనిపించింది రామూకు. "నాయన వచ్చేడా?" "నాయన వచ్చేడా?" ఆప్రశ్నే ప్రతీ వస్తువూ తనను నిలవదీసి అడుగుతున్నాయి. వెంకటలక్ష్మమ్మ 'రాలేదు' అంది. "ఒస్తారు" 'అస్పష్టంగా వినిపించింది. శబ్దం ఆనమాలుకట్టేడు. అంతే.

లోపలికి నిర్జీవంగానే వెళ్లేడు. ఆ ఆరుకళ్లూ ఆశ్చర్యంతో అల్లాగే ఉండిపోయేయి. నెమ్మదిగా శీతారామయ్యకళ్లమ్మట రెండుచుక్కలు రాలేయి. "తండ్రీ, వచ్చేవా? ఆఖరుదశలో అన్నయ్యను చూడ్డానికి దయకలిగిందా?" ఆవేదనతో శిక్షీణంగా వచ్చేయి. రామూ నిలవనేలేకపోయేడ తన సంచీ అక్కడే పారేసి 'అన్నయ్యా!' అని బావురుమన్నాడు. వెళ్లి కౌగలించుకున్నాడు. శీతారామయ్య అతనితల నిమురుతూనే, కన్నీళ్లుకారుస్తూనే "నాయనా, ఒక్కసారి బాబాయి అని పిలు! అదే కోరుతున్నా" అన్నాడు.

"బాబాయి"—కళ్లు మెరిసేయి. జీవితంలో కన్నతండ్రికంటె ఎక్కువగా పెంచిన తండ్రికే, అన్నయ్యకే తను ఎదురుతిరిగి పిశాచపునవ్వు నవ్వేడు. ఇల్లాంటి శీతలహృదయానికి కార్చిచ్చు పెట్టేడు.

చంటిపిల్లాడిలా రామూ ఏడ్చేడు.

"ఊరుకో నాయనా" వెంకటలక్ష్మి అంది. 'అమ్మా' అని పిల్వడానికి నరకకూపంలో కొన్నిలక్షల వత్సరాలు క్రిమికీటకం అయి, చీమూ రక్తం పీల్చి, తన పాపపరిహారం చేసుకున్నా తగనేమో ఆపిల్పుకు అనిపించింది.

చూచేడు. ఇదివరకటి వెంకటలక్ష్మమ్మ కాదు. అప్పుడు డొక్కాశీతమ్మగారిలో ఆదరించిన మాతృ

దేవత కాదు. నిరంతరశోకయుక్తమై, దావాగ్నులలో నల్గి, ఎముకల ప్రోగై ఉన్న, మూర్తీభవించిన శోక దేవత.

"అమ్మా, క్షమించు" ఏ హృదయంతో అన్నాడో తెలియటం లేదు.

"ఇప్పటికైనా కనికారం కల్గింది మామీద" ఎంత అమాయకత్వం!

ప్రక్కగా ఉన్న నరసమ్మను చూచేడు. తను చూస్తుంటే పమిటి సవరించుకుని, పాలిపోయిన బుగ్గల్లో మంగళసూత్రం కట్టినందుకు గౌరవం చూపించింది. అంతే!

### తనకు హక్కు లేదు

శీతారామయ్య ఆఖరున అడిగేడు: "నాయనా, అన్నయ్యని. ఇక నూకలు ఎల్లాగానూ లేవు. చెయ్యెత్తుతున్నా. ఇవి చేతులు కావు. కాళ్లు అనుకో. నరసమ్మను నీచేతిలో పెట్టేను. కనికరించు. ఆమెని చూస్తుంటే హృదయం తరుక్కుపోతోంది. సాటి వారికి దూరమైపోయేను." ఇంక చెప్పనివ్వకుండానే దగ్గుతెర వచ్చింది.

రామూకు అంతా తెలిసివచ్చింది. "అల్లాగే అన్నయ్యా! [illegible]ం ఇప్పుడు. నీమీదగా ప్రమాణం తీసుకుంటున్నా." అంతే.

ఒక్కసారి ముగ్గురి హృదయాలూ తేలికపడ్డాయి.

తర్వాత జరిగిన రోజుల్లో రామూ నిద్రాహారాలు లేకుండానే అన్నయ్యకు సపర్యచేసేడు. కాని ఫలం దక్కకనేపోయింది.

బ్రతికున్నప్పుడు చెయ్యలేక, ఆఖరు రోజుల్లో కృతజ్ఞత కనపర్చిన హృదయం గగ్గోలు పెట్టింది.

లోకం అంతా చీకటి. అంధకారం. ప్రళయం. జీవితంలో కన్నతండ్రిప్రేమ చూడేలేదు. తండ్రిలా, ఏడుగడలా చూచిన అన్నయ్యను, ఒదినను, ఆఖరుకు పెళ్లాన్ని తను నిల్చుండగానే జీవచ్ఛవాలు చేసేడు. అదీ ప్రతిఫలం.

తన చేతుల్తోనే చితి అంటించేడు. తన్ను పెంచిన తండ్రిని తనే కాల్చేసేడు. మసిచేసేడు. తన చేష్టలవల్ల, తన హృదయదౌర్బల్యంవల్ల, తన నైతికపతనంవల్ల తనే లోకంలో ఓ ప్రేమహృదయాన్ని పోగొట్టుకున్నాడు. ఎక్కడనుంచి పిలిస్తే వస్తాడు, అన్నయ్య- కాదు బాబాయి?

నడిపీనుగే అయి ఇంటికి వచ్చేడు.

కర్మకాండ సరిగ్గానే భక్తితోనే చేసేడు.

"అమ్మా! నా దగ్గరనే వుందువుగాని రా. జీవితంలో ప్రక్కమార్గంలో ఓసారి పడ్డా. కనికరించు" అన్నాడు.

"నాయనా! బ్రతికున్నన్నాళ్లూ ఆయనతోనే వుంది జీవనం. ఆయన లేరు. ఇంక ఏ ముఖం పెట్టుకుని లోకానికి మొఖం చూపిస్తాను" అంది వెంకటలక్ష్మమ్మ.

బరువుగానే నరసమ్మని కాకినాడ తీసుకెళ్లేడు. బండి ఎక్కేటప్పుడు వెంకటలక్ష్మమ్మ కాగితాలు చేతిలో [illegible]

తన అనంతరం ఆస్తి తన అభిమానపుత్రుడు రామూకు చెందునట్లు, వెంకటలక్ష్మమ్మకు నెలకు పది రూపాయలు మనోవర్తి ఇచ్చుటకున్నూ వీలు

రామూ ఏడ్చేడు. చచ్చికూడా, దిక్కూ మొక్కూ లేకుండా చచ్చినా, శీతారామయ్య తన యెడల ప్రేమ, వాత్సల్యం చూపించకుండా ఉండ లేకపోయేడు. మరి తనో?

కక్కాయి ఆశ్చర్యపడింది. అంతే. తర్వాతి రోజుల్లో కక్కాయిని పులిస్త్రాకుకంటె కనీసంగా చూచేడు.

సంవత్సరీకాలు అయ్యేయి. అప్పుడే ఒక్కసారి వెంకటలక్ష్మమ్మ తిరిగి కన్పించింది.

దేవుడి మేలువల్ల నరసమ్మ కొడుకుని కంది. అల్లుడి పేరు పెడతాడేమో అని కక్కాయి ఆశించింది.

'శీతారామయ్య' అని వ్రాసేడు. నరసమ్మకు ఆశ్చర్యం కల్గింది. కక్కాయి కూలేపోయింది. వెంకటలక్ష్మమ్మ విని సంతోషించింది.

అంతే. బ్రతికి ఉపకారం చెయ్యలేనివాడు చచ్చినతర్వాత కృతజ్ఞత చూపించుకున్నట్లే అయింది. శీతారామయ్య పేరు ఇప్పటికీ దేవుడిలా తలుస్తూనే వున్నాడు రామూ!

'తమ్ముడు'! జీవితంలో తను తమ్ముడుగా చేసిన దుర్మార్గాలకు ఇంకా వాపోతూనేవుంటాడు.

# కాలగుర్తింపు

## 'స్టాండర్డు టైము' కథ

నేడు ప్రపంచకంలో అన్ని దేశాలవారూ టైము విషయంలో ఒక 'కామన్ అండర్‌స్టాండింగ్'కు వచ్చి, లండన్‌లో ౧ గంట అయినప్పుడు కలకత్తాలో గాని, మద్రాసులో గాని ఎంత అవుతుందో, అమెరికాలోని వాషింగ్టన్‌లో గాని, న్యూయార్కులో గాని ఎంత అవుతుందో, టోకియోలో ౨ గంటలు (మధ్యాహ్నం) అయినప్పుడు మిగిలిన ప్రదేశాలలో ఎంత అవుతుందో సరిగా తెలుసుకోగలుగుతున్నారు. దాని వల్ల అనేక ప్రయోజనాలున్నాయి. అలా తెలుసుకోలేకపోతే అనేకనష్టాలున్నాయి. దీనికై ప్రపంచంలోనివారంతా ఒక ప్రదేశపు టైమును ఆధారంగా పెట్టుకుని, దానిని స్థిరంగా ఉంచుకొని, ప్రపంచకంలో టైమంతా తెలిసే లెక్కనొకదానిని కనిపెట్టారు. అది కనిపెట్టడానికీ, మన మిప్పు డింత సుఖమైన టైము—సందిగ్ధం (Discrepancy) లేకుండా ఉండడానికీ ప్రపంచకమంతా గ్రీనిచ్ టైమునే 'స్టాండర్డు'గా తీసుకోడానికీ కలిగిన పరిస్థితులు ఇక్కడ ఉటంకించడమవుతున్న

గడియారాలు—టైము చూపే యంత్రాలు—వచ్చిన కొన్నాళ్లదాకా, అంటే సుమారు నూరేళ్ల క్రితంవరకూ ఇంగ్లండులోనూ, మిగిలిన దేశాల్లోనూ కూడా సూర్యుడు ఎప్పుడు నడినెత్తిమీదికి వస్తే అప్పుడు మధ్యాహ్నం ౧౨ గంటలని అనుకునేవారు. అప్పటి కప్పుడే భూమి గుండ్రంగా ఉందన్న సంగతి ప్రపంచకంలో అన్ని జాతులవారూ అంగీకరించారు.



జావా దర్బారుల్లో

జాతీయ నృత్యం

అంచేత అందరికీ ఒకేసారి సూర్యుడు రాడుగనక అన్ని పట్టణాల్లోనూ వాటికి ఉన్న పట్టణాలలోని టైముకన్నా ముందుగా ౧౨ అయిపోతుందిగదా! ఈ కారణంవల్ల సూర్యుడు నెత్తి మీద ఉన్నప్పుడు ౧౨ గంటలనే ఒక సూత్రాన్నే అందరూ అనుసరించినా, టైములో చాలా తేడా వచ్చేది.

ఈ టైముతేడాబాధ మొదట్లో అంతగా లేకపోయినా, రైళ్లూ అవీ వచ్చాక బాగా కలిగింది. ఈ టైము తేడా మూలాన ౧౮౪౦ లో రైల్వే వారు (ఇంగ్లండులో) స్థానిక టైమ్నూ, థేమ్సునదిమీద ఉన్న 'గ్రీనిచ్' అనే పట్టణం టైమ్నూ రెండూకూడా టైంటేబిల్స్ (Time tables) లో వేసేవారు. ఈ రెండు టైములవల్లకూడా మరీ గొడవ జరిగేది. కనక ౧౮౪౭ లో ఇంగ్లండులోని అన్ని రైల్వేలవారూ కూడా ఒక గ్రీనిచ్ టైమునే ప్రచురించడానికి నిర్ణయించుకున్నారు. తరవాత కొంతకాలానికి ఇంగ్లండులాగే మిగతా దేశాలవారుకూ 'గ్రీనిచ్' టైమును తమ ము ట్టణాలన్నిటిలోనూ పెట్టుకున్నారు.

తరవాత కొద్దికాలానికి విదేశప్రయాణాలూ, వర్తకాలూ ఎక్కువయాక ఒక దేశానికీ మరో దేశానికీ టైములో గంటలకొద్దీ తేడా ఉండేది. ఇది—ఈ తేడా—టెలిఫోనూ, టెలిగ్రాఫీలు వచ్చాక మరీ ఇబ్బంది అయిపోయింది. ఇలాగ దేశదేశాల్లోనూ, ప్రపంచకం అంతటా టైములో తికమకలు ఏర్పడ్డవి.

ఈ తికమక పోగొట్టడానికి శాండ్‌ఫర్డ్ ఫ్లెమింగ్ అనే స్కాట్లండుమనిషి ఒక ఉపాయం కనిపెట్టాడు. అతను స్కాట్లండులో ౧౮౨౭ లో 'కిర్కాల్డీ' అనే ఊళ్లో పుట్టినాడు. కెనడాలో ఒక సివిలింజనీరింగ్ కంపెనీ పెట్టాడు. ఈ టైముతేడాలు అతని వృత్తికి చాలా నష్టం, అభివృద్ధి కడ్డంకూ కలిగించినాయి. అందువల్ల తీవ్రంగా ఆలోచించి ఈ క్రింది ఉపాయం కనిపెట్టాడు.

భూమి గుండ్రంగా ఉంది. వృత్తంలో ౩౬౦° (డిగ్రీలు) ఉంటాయి. రోజుకు ౨౪ గంటలు. ౩౬౦ లో ౨౪ సరిగా ౧౫ సార్లు పోతుంది. కనక భూమి చుట్టూ పైనించి కిందికి (అంటే ఉత్తరధ్రువంనుంచి దక్షిణధ్రువానికి) ౨౪ రేఖలూ ౧౫ డిగ్రీల ఎడం చొప్పున గీస్తే ఒకరేఖమీది పట్టణానికీ, దాని పక్క రేఖమీద నున్న పట్టణానికీ టైములో ౧ గంట తేడా ఉంటుంది. అంటే ౧° డిగ్రీకి ౪ నిమిషాలు అన్నమాట. దీనివల్ల ప్రపంచకం అంతటా టైము తేడాను సులువుగా కట్టుకోవచ్చు. ఆధారం 'గ్రీనిచ్' టైమునే ఉంచుకున్నారు.

ఈ ఆలోచన 'ఫ్లెమింగ్' మొదట 'రాయల్ కెనెడియన్ ఇన్‌స్టిట్యూట్' వారితో చెప్పగా వారు గ్రహించి దానిని బలపరచినారు. దీనిని మొదటలో కొందరంగీకరించకపోయినా క్రమంగా ౧౮౮౪

నాటికి ప్రపంచకంలోని అన్నిరాజ్యాలవారూ అంగీకరించారు.

ఈ రేఖా ప్రారంభం గ్రీనిచ్‌లో జరిగింది. గ్రీనిచ్‌లో ప్రారంభమైన స్టాండర్డు టైమునూ, 'గ్రీనిచ్ రాయల్ అబ్జర్వేటరీ' వారు చేసిన పరిశ్రమనూ గౌరవించేందుకై ఇప్పుడు ప్రపంచకంలోనివారంతా గ్రీనిచ్ టైమునే స్టాండర్డుగా తీసుకొంటున్నారు. ('మెయిల్' నుంచి.)

శ్రీరామశాస్త్రి.

*   *   *

## శ్రీకారము వేదోక్తమే!

గత మాసపు భారతిలో శ్రీ కొత్త భావయ్య చౌదరిగారు 'శిరి' యను ప్రాకృత రూపము సంస్కరింపబడి 'శ్రీ' యను రూపమును పొందిన దని వ్రాసినారు. ఇది ఏమాత్రమును సమంజసముగా లేదు.

ఋగ్యజుస్సామాథర్వములలో కనీసము నాలుగైదు నూరుమారులు శ్రీకారము (వివిధవిభక్తులలో) ప్రయుక్తమైనది. ఖిలసూక్తములలో శ్రీసూక్తము ఆబాలగోపాల పరిచితమైన విషయము. కేవలము 'శ్రీః' అను పదముకూడ ఋగ్వేదమున (౫-౫౭-౬) ప్రత్యక్షమే కదా! ఇక శ్రియం, శ్రీభిః, శ్రీణ్ మున్నగు రూపములనుగూర్చి ఎక్కువగా వ్రాయబనిలేదు.

ఈ ఋగాదులకు పూర్వము మన దేశమున నున్న భాషగాని, గ్రంథముగాని లభింపలేదు. ఇట్టి పరిస్థితిలో ప్రాకృతపు 'సిరి' నుండి శ్రీకారము పుట్టిన దనుట నిరాధారముకదా! దీనిని ఏమాత్ర మాలోచింపక క్రీ. శ. ౧-౨ శతాబ్దముల శాసనాధారములతో 'సిరి' నుండి 'శ్రీ' యైనదనుట వింతలలోని వింతకదా!

శ్రీ సదాశివమూర్తి.



# విమర్శనము



## నుడికడలి

మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు కూర్చిన ప్రమాణాంధ్రనిఘంటువు "మచ్చునుడులు" మా కార్యాలయమునకు చేరినది. "నుడిదండలలో హెచ్చుగా పనికివచ్చినదియు, పనికివచ్చుచున్నదియు కీ. శే. బహుజనపల్లి సీతారామాచార్యులుగారి 'శబ్దరత్నాకరము' అయినను, అదియు లోట్లులేనిది కాదు. కాన, ప్రయత్నించి, దానికంటె మంచినిఘంటువు వ్రాయఁదగునని సుమారు ౪౫ ఏండ్లక్రిందటనే తలంచితిని."అనీ, "ప్రమాణాంధ్రనిఘంటువు లేనిలోటు తీర్చుటకే నేను నుడికడలి కూర్పఁదలఁచితిని"అనీ కూర్పరిఅయిన శ్రీ రామచంద్రశాస్త్రిగారు తెలుపుతున్నారు. రామచంద్రశాస్త్రిగారు పండితులు, దేశభక్తులు, కార్యశూరులున్నూ. వీరు తదేకనిష్ఠను నుడికడలిపని ఒనగూర్చి మచ్చునుడులను పైకితీసుకువచ్చారు. ప్రమాణాంధ్రనిఘంటువు లేని లోటు మన అందరికీ కనపడుతూన్నదే. యిలాంటినిఘంటువులు కావాలని ఎంత కాలంనుంచో కోరుకుంటున్నాముకూడాను.

ఈనిఘంటువుకూర్పులో కొన్ని ప్రత్యేకతలున్నవి. అకర్మకక్రియకు 'ఎక్కటిచెయిది'; సకర్మకక్రియకు 'పొందిమిచెయిది'; ప్రత్యయానికి 'చేర్పు'; దేశ్యానికి 'నాటినుడి'; తత్సమానికి 'సరినుడి'; తద్భవానికి 'మారునుడి'; నామవాచకానికి 'పేరునుడి'; విశేషణానికి 'పేరుతోడు';—యిలాంటి కొత్త-కొత్తపదజాలం వాడబడింది.

సంస్కృతసంప్రదాయము మీదబడినప్పుడు ఎన్నో తెలుగుమాటలూ, వాడుకలూ దెబ్బతిని ఓడిపోయినవి. వాడుకలోనుంచి చ్యుతమైనవి. రామశబ్దానికి 'రమ్' అంగమంటే తెలుస్తున్నది. 'అంగం' అనేదానికి బదులు అంతకుముందున్న 'ఎతటము' (బేస్)అనేది నేడు వాడుకలో లేదు. 'అంగము' అనేది చెలామణీలో ఉంది. యిలాగే విశేషణం, విశేష్యం, నామవాచకం, సమాసం, అవ్యయం, తత్సమ, తద్భవ దేశ్యములున్నూ చెలామణీలో ఉన్నవి. "పాతవడ్డ మాట"లనుగానీ, లేక వీటికి సరిఅయిన తెనుగు మాటలనుగానీ సృష్టిచేసుకోవడంకంటె చెలామణీలో ఉన్నవాటినే (సంస్కృతం, హిందీ, ఆంగ్లం ఏదైనా) వాడుకుంటే, కావలసిన విషయం చప్పన బోధపడి నిఘంటువుప్రయోజనం సుగమమై సులభమైన దౌతుంది. కొత్తసృష్టికాని, పాతవడ్డ మాటలను చెలామణీకి తెచ్చే ప్రయత్నంకాని—ఒకవేళ జయించినా—ఎదురీతవంటిదే అవుతుంది.

యివాళ తెలుగుభాషలో ఎన్నో ఆంగ్లపదాలు బాగా కలిసిపోయినవి. కొన్ని బాగా కలవలేదు. "టైం, రైలు, మోటారు" లవలె "బఫూన్" అన్నది తెలుగులో కలిసినదాన్నిగా జమకట్టుకోలేము. "బఫూన్" లాంటిది "నుడికడలి" చేరినది. యిలాంటివి ఆలోచించతగనివి.

వాడుకలతో, సామెతలతో, ప్రయోగాలతో వ్యుత్పత్తులతోసహా ప్రమాణాంధ్రనిఘంటువును వెలయించుటకు రామచంద్ర శాస్త్రిగారు చేస్తున్న ఈ ప్రయత్నము ప్రశంసనీయము. 'జరుక్'

---

## స్వప్నకుమార స్వరూపసందర్శనము

రాయప్రోలు సుబ్బారావుగారి 'స్వప్నకుమార' కావ్యమునకు ప్రతిపద్య ప్రతిపదార్థ, తాత్పర్య, వ్యాఖ్యారూపమైన ఈగ్రంథము ౧౯౫౨ మార్చిలో జరుగనున్న ఇంటర్మీడియేటు, విద్వాన్ (మద్రాసు)

పరీక్షలకు వెళ్లు విద్యార్థులకు మిక్కిలి ఉపయోగపడు నని విశ్వసింపవచ్చును.

### మానవత్వము

గ్రంథకర్త: దూర్వాసుల నరసింహమూర్తి గారు, నక్కపల్లి, విశాఖపట్టణముజిల్లా. మత, రాజకీయములకుగల సంబంధమును గురించిన సంగ్రహసమీక్ష ఈ చిన్న పుస్తకము.

### పద్యకథామంజరి

ప్రాచీన కావ్యములనుండి ఏర్చి కూర్చబడిన పద్యకథా సంకలనగ్రంథము. హైస్కూలు తరగతుల విద్యార్థులకు కావ్యవాఙ్మయవిషయములో స్వతంత్రమైన భావనా శక్తిని పెంపొందింపజేయుటకుగా శ్రమించి కూర్చబడినది. కూర్పరి: ధరణికోట వేంకటసుబ్బయ్య గారు, యం.ఏ, బి.ఇడి., ఆంధ్రోపన్యాసకుడు, వేంకటగిరి రాజకళాశాల, నెల్లూరు. ప్రకాశకులు: వేదము వేంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్సు, ౪ మల్లికేశ్వర గుడిసందు, ముత్యాలపేట, మద్రాసు. వెల ౧ రూపాయి.

### అరవై సంవత్సరాల కాంగ్రెసు

రచయిత: డాక్టరు భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు. అనువాదకులు: ఏడిద కామేశ్వరరావు గారు. ప్రకాశకులు: దేశికవితామండలి, బెజవాడ. వెల ౧౦ అణాలు.

ఈ క్రీస్తుశకునాటికి అఖిలభారత కాంగ్రెసుకు ౬౦ ఏండ్లు నిండుచున్నవి. ఈ షష్టిపూర్తి ఉత్సవము జరుపుటకై మహాసన్నాహములు జరుగుచున్న ఈ శుభ తరుణములోనే అందరి అందుబాటులోనికిని రాగల ఈ చిన్న గ్రంథము వెలువడుట ప్రశంసింపదగియున్నది. ఆకారములో చిన్నదయినను ౬౦ ఏండ్ల చరిత్ర పూర్తిగా ఇందులో ఇమిడియున్నది. డాక్టరు పట్టాభి గారి రచనకు వేరు విమర్శలెందుకు? విషయగౌరవమును, కర్తృగౌరవమును కూడ గల ఈ గ్రంథమును సకలాంధ్రులును తప్పక చదివి మననము చేయదగును.

## గ్రంథ స్వీకారము

### శ్రీ వేంకటేశ్వర వచనములు

శ్రీ వేంకటేశ్వరప్రభాత స్తవముతోసహా. ౧౫వ శతాబ్దినాటి వచనకావ్యము. రచయిత: తాళ్లపాక పెద తిరుమలాచార్యులుగారు. పరిష్కర్త: వేటూరి ప్రభాకరశాస్త్రిగారు. ప్రకాశకులు: శ్రీ వేంకటేశ్వరప్రాచ్యవిద్యాపరిశోధనాలయము, తిరుపతి. వెల రూ. ౧-౮-౦.

### పరమావిష్కారము

శ్రీమాతకృతము. అనువాదకులు: వేలూరి చంద్రశేఖరంగారు. ప్రకాశకులు: చతుర్వేదుల వెంకట కృష్ణయ్యగారు, శ్రీ అరవిందాశ్రమము, పుదుచ్చేరి. వెల ౪ అణాలు.

Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., G. T., Madras. Editor—S. Sambhu Prasad.







చక్కని రుచి, ఘుమ ఘుమలాడే సువాసన, నేత్ర పర్వంగావుండే రంగు, తక్కువధర, వీటి అన్నింటి నిబట్టి లిప్టన్స్ టీ గర్ల్ మిగతా వాటిని తలదన్ని అత్యధిక గౌరవాన్ని తెచ్చుకున్నది.

# లిప్టన్స్ టీగర్ల్

మృదు మధురమైన ఇండియన్ డస్ట్ టీ

LTK 846

## సంక్రాంతి వినోదానికి

సహృదయలోకానికి

చలనచిత్రకావ్యసమర్పణోత్సవము

జనవరి

[illegible]

బెజవాడ • గుంటూరు • నెల్లూరు
రాజమండ్రి • కాకినాడ • మచిలీపట్నం
కర్నూలు • విజయనగరం • గదగ్
కాలికట్ • ఎర్నాకులం

తదితరనగరాలలో

స్వీకరించండి



వాహినీ వారి

# మల్లీశ్వరి



*Directed by* **B.N.REDDI**

CAMERA...BARTLEY....... SOUND... DINSHAW....... ART... NAGOOR...... STUDIO... NEWTONE